భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ బ్రహ్మవైవర్త పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ బ్రహ్మవైవర్త పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాధ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు


అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి.... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...







# Sreepeetam

# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991


# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయించేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని - సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని - వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ర్బాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ర్పసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ బ్రహ్మవైవర్త పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో పదవది బ్రహ్మవైవర్త మహాపురాణం. "బ్రహ్మవైవర్త సంజ్ఞంతు నామోజానురుదాహృతః" అన్నమాటను బట్టి శ్రీమహావిష్ణువు జానువుగా ఈ పురాణం చెప్పబడింది. "సావర్ణినా నారదాయ కృష్ణమహాత్మ్య ముత్తమమ్। బ్రహ్మరూపవరాహస్య చరితం వర్ణ్యతే మహుః॥" అన్న శ్లోకం ప్రకారం సావర్ణిమనువు వరాహస్వామి, శ్రీకృష్ణుడికి సంబంధించిన విశేషాలను నారదమహర్షికి తెలియచేసిందే ఈ బ్రహ్మవైవర్త పురాణం అని తెలుస్తోంది. "సారభూతం పురాణేషు బ్రహ్మవైవర్తముచ్యతే" అష్టాదశ పురాణాల సారమే ఈ పురాణం అని దీని గొప్పతనం ఘనంగా చెప్పబడింది. ఇందులో మొత్తం 18000 శ్లోకాలున్నాయి. ఇది నాలుగు ఖండాలుగా విభాగించబడింది. 1.బ్రహ్మఖండం 2.ప్రకృతిఖండం 3.గణేశ ఖండం 4.శ్రీకృష్ణజన్మ ఖండం అని ఇందులో శ్రీకృష్ణ జన్మ ఖండం తిరిగి పూర్వార్ధం ఉత్తరార్ధం అని రెండు విభాగాలతో వుంటుంది.

## బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పిన ప్రధాన విషయాలు

**1. బ్రహ్మఖండం :** ఇందులో పరబ్రహ్మనిరూపణ, త్రిమూర్తులు ధర్మదేవత, దుర్గా, లక్ష్మి, సరస్వతీదేవిల జననం,గోవులు, గోపికా రాధాదేవి ఆవిర్భావం, బ్రహ్మచేసినసృష్టి క్రమం, విష్ణుమూర్తి వైష్ణవప్రశంస, నారదుడి జన్మవృత్తాంతం, చికిత్సా ప్రకరణం, మహాపురుషస్తోత్రం, విష్ణుశంకరుల దివ్యస్తోత్రాలు, బ్రహ్మ నారదుల సంవాదం, నారదమహర్షి ప్రశ్నలు, ఆహ్నికకార్యక్రమాలు, భగవంతుడి స్తుతి, స్వరూపవివరణ వంటి విషయాలు ప్రధానంగా చెప్పబడ్డాయి.

**2. ప్రకృతిఖండం :** ఈఖండంలో పంచప్రకృతి స్వరూపాలు, దేవతల జన్మ వృత్తాంతం, సరస్వతీ కవచం, సరస్వతీ స్తోత్రం, సరస్వతీ ఉపాఖ్యానం, పృథ్వీస్తోత్రం, గంగాదేవి ఉపాఖ్యానం, తులసీఉపాఖ్యానం, శంఖచూడవధ, సాలగ్రామ మహాత్మ్యం, సావిత్రోపాఖ్యానం, కర్మవిపాకం, శుభకర్మల ఫలితాలు, యమధర్మరాజస్తుతి, నరకకుండాలు, వైష్ణవుల ప్రాశస్త్యం, లక్ష్మీపూజ, కర్మల ఫలితాలు, సముద్ర మధనం, స్వాహాదేవి వృత్తాంతం, స్వధా, దక్షిణాదేవి వృత్తాంతం పూజావిధి. షష్ఠీ, మంగళా, మనసాదేవి, సురభి, రాధాదేవీల ఉపాఖ్యానాలు వారి పూజా విధానాలు, సుయజ్ఞోపాఖ్యానం, రాధాకవచం, దుర్గాదేవిపూజ, దుర్గాస్తోత్రం, దుర్గాకవచం తదితర ప్రధానమైన విషయాల్ని వివరించారు.

**3. గణపతిఖండం :** ఈఖండంలో పార్వతీపరమేశ్వరుల సంయోగ వర్ణన, పుణ్యకవ్రతమహిమ, గణపతిజననం, గణపతి తలతెగిపడటం, శ్రీహరి గణపతికి ఏనుగు శిరస్సు అంటించటం, గణపతి పూజ, కవచం, స్తోత్రాలు, కుమారస్వామి జీవితవిశేషాలు, గణపతివివాహం, కార్తికేయుడికి పట్టాభిషేకం, లక్ష్మీదేవి చరిత్ర, జమదగ్ని కార్త్యవీర్యులచరిత్ర, మహాలక్ష్మీ కవచం, భద్రకాళీకవచం, దుర్గాదేవికవచం, కైలాస వర్ణన, పరశురాముడు చేసిన దుర్గాస్తుతి లాంటి ముఖ్యమైన విషయాలన్నిటినీ ఈ గణపతి ఖండం చెబుతుది.

**4. శ్రీకృష్ణ జన్మఖండం (పూర్వార్థం) :** ఈ ఖండంలో విరజానది ప్రాశస్త్యం, గోలోకవర్ణన, శ్రీకృష్ణస్తోత్రరాజం, శ్రీకృష్ణజన్మోపాఖ్యానం, రాధాకృష్ణులవివాహం, బృందావననగర వర్ణనం, ఏకాదశీవ్రతనిరూపణం, మోహినీస్తోత్రం, రాధాకృష్ణ సంవాదం, సతీదేవి దేహత్యాగం, శంకరుడి వివాహం, దుర్వాసుడి గర్వభంగం, శ్రీకృష్ణుడి రాసక్రీడా వర్ణనం వంటి ప్రముఖవిషయాలు సవివరంగా చెప్పబడ్డాయి.

**5. శ్రీకృష్ణ జన్మఖండం (ఉత్తరార్థం) :** ఈ విభాగంలో శ్రీకృష్ణుడి ప్రభావం, ఇంద్రుడిగర్వభంగం, శచీదేవిచేసిన గురుస్తుతి, రామావతార చరిత్ర, శ్రీకృష్ణుడి మధురయాత్ర, కంసవధ, దానం దానిఫలితాలు, రాహుగ్రస్తసూర్య గ్రహణదర్శన విశేషం, తారాఅపహరణ, గృహస్థశిష్యధర్మాలు, కర్మవిపాక వివరణం, శ్రీకృష్ణుడు

నందుడికి దుర్గాదేవి స్తోత్రాన్ని బోధించటం, ఉద్ధవుడు చేసిన రాధాదేవి స్తుతి, దేవకీ దేవి చేసిన గౌరీపూజ, రామకృష్ణులవిద్యాభ్యాసం, ద్వారకానగరవర్ణనం, రుక్మిణీ కల్యాణం, బాణాసురసంహారం, గణపతి మహిమ, రాధాదేవి గోలోకానికి వెళ్ళటం, నారదుడి వివాహవృత్తాంతం, అగ్ని బంగారాల ఉత్పత్తిలాంటి ఎన్నో విషయాలు ఈ ఖండంలో వివరించబడ్డాయి.

## పరబ్రహ్మ స్వరూపం

**నైమిశారణ్యం :** అది నైమిశారణ్యం అక్కడ దీర్ఘకాలంగా గొప్ప సత్రయాగం జరుగుతోంది. ఆయాగాన్ని నిర్వహిస్తున్నవారు శౌనకాదిమహర్షులు. ఒకరోజు వ్యాసమహర్షి శిష్యుడు సూతమహర్షి ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆయన్ని చూసి ఎంతో ఆనందంగా శౌనకాది మునులు స్వాగత సత్కారాలు అందించారు. సూతమహర్షి వారి సత్కారాలు స్వీకరించి ప్రశాంతంగా కూర్చున్నాడు. అప్పుడు అందరూ ఆయన్నిచేరి, మహానుభావా! నీవు సకలశాస్త్రాలు, పురాణ ఇతిహాసాలు తెలిసినవాడివి. మీరాకతో మా ఆశ్రమం ఎంతో పావనమైంది. ఏ పురాణాన్ని వింటే సంసార బంధాలు తొలగిపోతాయో దేనిని వింటే ఆనందంకలుగుతుందో, శ్రీకృష్ణపరమాత్మమీద భక్తి ప్రపత్తులు ఏపురాణ శ్రవణం ద్వారా పొందుతామో, ధర్మప్రబోధాత్మకమైన కథలు ఏ పురాణంలో వున్నాయో అటువంటి పురాణాన్ని దయచేసి మాకు వినిపించు" అని ప్రార్థించారు.

శౌనకాదిమునుల ప్రార్థనవిన్న సూతమహర్షి వారితో! మహర్షులారా! మీ ఆసక్తి చాలా గొప్పది. మీరు చెప్పిన అన్ని వివరాలు విశేషాలు బ్రహ్మవైవర్త మహాపురాణంలో ఉన్నాయి. ఆ పురాణం అన్ని పురాణాలకీ సారభూతం లాంటిది. అన్ని రకాల సంశయాలనీ పోగొట్టి, విన్నవారికి, చెప్పిన వారికీ ఐహికాముష్మిక ఫలాలను ప్రసాదించేది. ఆ దివ్యపురాణాన్ని మీకు చెబుతాను సావధానులైవినండి అని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

**గోలోకం :** పూర్వం ప్రళయం సంభవించినప్పుడు భయంకరమైన చీకటి ఆవరించింది. అక్కడ కోటిసూర్యుల కాంతితో అసంఖ్యాకమైన కిరణాలు

వెదజల్లుతూ ఒక తేజోపుంజం విరాజిల్లుతోంది. మహోజ్వలంగా ప్రకాశిస్తున్న ఆ దివ్యతేజస్సు పరమపురుషుడిది. పరమపురుషుడి స్వరూపంగా వున్న ఆ దివ్యతేజోమండలంలో స్వర్గమర్త్యపాతాళాలనే మూడులోకాలున్నాయి. ఆ మూడులోకాల కన్నా పైన నాశనం అనేదే లేని గోలోకం వుంది. దాని విస్తీర్ణం మూడుకోట్లయోజనాలు. ఎంతో విలువైన రత్నాలతో గుండ్రంగా ఆలోకం నెలకొంది. మహాతేజోవంతమైన ఆ గోలోకాన్ని యోగులు సైతం స్పష్టంగా చూడలేరు.

అయినా ఆ దివ్యలోకం విష్ణుభక్తులకి సులభంగా కనిపిస్తుంది. అనన్యమైన భక్తి ప్రపత్తులు నారాయణుడి మీద ఉన్నవారే ఆ గోలోకానికి చేరుకోగలరు. పరమపవిత్రమైన ఆ గోలోకం పరమపురుషుడైన శ్రీకృష్ణుడి యోగశక్తితో ధరించబడింది. ఆగోలోకంలో వ్యాధులు, వార్ధక్యం, చావు, భయం లాంటివి ఏవీ ఉండవు. రత్నాలతో వజ్రాలతో నిర్మించిన ఎన్నో భవనాలు ఆ గోపికా జనాలతో, విష్ణుభక్తులతో నిండి వుంటుంది. అదే ప్రళయకాలంలో అందరూనశించిపోగా కేవలం శ్రీకృష్ణుడు మాత్రమే అక్కడ వుంటాడు.

**వైకుంఠం :** దివ్యమైన ఆ గోలోకానికి క్రింది భాగంలో కుడివైపు వైకుంఠం, ఎడమభాగంలో శివలోకం వున్నాయి. వైకుంఠం ఒక కోటి యోజనాల విస్తీర్ణంలో వ్యాపించి మండలాకారంగా వుంటుంది. ఆ లోకం కూడా లయకాలంలో శూన్యమైపోతుంది. సృష్టిజరిగినప్పుడు శ్రీ లక్ష్మీనారాయణులతో చతుర్భుజాలు కలిగిన ఎంతోమంది సేవకులతో కళకళలాడుతూ వుంటుంది. ఆ దివ్యవైకుంఠంలో చావు, ముసలితనం వ్యాధులులాంటివి ఏమాత్రం కనిపించవు.

**శివలోకం :** వైకుంఠ ధామానికి ఎడమప్రక్కనవున్న శివలోకం కూడా కోటియోజనాల విస్తీర్ణంలో వుంటుంది. ఆలోకం కూడా ప్రళయకాలంలో శూన్యంగా వుండి, తిరిగి సృష్టి ప్రారంభమైనప్పుడు పార్వతీ పరమేశ్వరులతో ప్రమథగణాలతో వైభవంగా ప్రకాశిస్తోంది.

గోలోకం మధ్యలో ఒక దివ్యమైన జ్యోతివెలుగుతుంటుంది. అది పరమాత్మజ్యోతి. పరమానందాన్ని కలిగిస్తుంది. యోగులు ధ్యానంతో జ్ఞాననేత్రం ద్వారా ఆ జ్యోతిని దర్శించి ఆనందాన్ని అనుభవిస్తూ వుంటారు. ఆ జ్యోతి మధ్యభాగం చాలా సుందరంగా వుంటుంది. ఆ సుందరరూపం ఎలా వుంటుందంటే!

## పరబ్రహ్మ స్తుతి

నవీననీరదశ్యామం రక్తపంకజలోచనం ।
శారదీయ సార్వణేందుశోభితం చామలాననం ॥ 1

కోటికందర్పలావణ్యం లీలాధామమనోహరం ।
ద్విభుజంమురళీహస్తం సస్మితం పీతవాసనం ॥ 2

శ్రీవత్స వక్షఃసంభ్రాజత్కౌస్తుభేన విరాజితం ।
సద్రత్నసార రచితకిరీట మకుటోజ్జ్వలం ॥ 3

రత్నసింహాసనస్థం చవనమాలా విభూషితం ।
తదేవపరమంబ్రహ్మ భగవంతం సనాతనమ్ ॥ 4

స్వేచ్ఛామయం సర్వబీజం సర్వాధారంపరాత్పరమ్ ।
కిశోరనయనం శశ్వద్గోపవేష నిధాయకకు ॥ 5

కోటిపూర్ణేందు శోభాఢ్యం భక్తానుగ్రహకారకం ।
నిరీహం నిర్వికారం చ పరిపూర్ణతమం విభుం ॥ 6

రాసమండలమధ్యస్థం శాంతంరాసేశ్వరం పదం ।
మాంగళ్యం మంగళార్హంచ మాంగల్యం మంగళప్రదం ॥ 7

పరమానందబీజంచ సత్యమక్షరమవ్యయం ।
సర్వసిద్ధేశ్వరం సర్వసిద్ధి రూపంచ సిద్ధిదం ॥ 8

ప్రకృతేః పరమీశానం నిర్గుణం నిత్యవిగ్రహం ।
ఆద్యంపురుషమవ్యక్తం పురుహూతంపురుష్టుతం ॥ 9

సత్యం స్వతంత్రమేకించ పరమాత్మస్వరూపకం ।
ధ్యాయంతేవైష్ణవాః శాంతాః శాంతం తత్పరమాయణం ॥ 10

*(శ్లో॥16-26 అధ్యా-1 ఖండం-1)*

కొత్తనల్లని మేఘంలాగా, కలువల్లాంటి ఎర్రని కళ్ళతో, శరత్కాల పున్నమి చంద్రుడు లాంటి నిర్మలమైన ముఖంతో, కోటి మన్మథుల సౌందర్యంతో ప్రకాశిస్తూ రెండు భుజాలతో చేతిలో మురళిని పట్టుకుని, చిరునవ్వులు చిందిస్తూ, పచ్చనివస్త్రాలు ధరించి, శరీరం మీద రత్నాభరణాల్ని ధరించి, శ్రీచందనాన్ని పూసుకుని, కస్తూరీతిలకాన్ని నుదుటదిద్దుకొని, హృదయంమీద శ్రీవత్సాన్ని, కౌస్తుభమణిని శిరస్సుమీద నవరత్నఖచిత కిరీటాన్ని ధరించి వనమాలావిభూషితుడై రత్న సింహాసనం మీద ఆసీనుడై వుంది ఆదివ్యరూపం. ఆరూపాన్నే సనాతనమైన పరబ్రహ్మ అని, పరమాత్మ అని కీర్తిస్తారు.

స్వేచ్ఛగా వుండేవాడు, సమస్తప్రపంచానికీ కారణభూతుడు, సకలసృష్టికీ ఆధారమైనవాడు, ఎప్పుడూ గోపవేషంలో వుండేవాడు, భక్తుల్ని అనుగ్రహించే దయాగుణం కలిగినవాడు, కోటిపూర్ణచంద్రులకాంతిలో ప్రకాశించేవాడు, నవయవ్వనుడు, స్వార్థమైన కోరికలేవీ లేనివాడు, నిర్వికారుడు, పరిపూర్ణుడు, మంగళప్రదమైనవాడు, రాసమండలంలో విహరించేవాడు, పరమానంద కారకుడు, శాంతస్వభావుడు, సర్వసిద్ధిస్వరూపుడు, సిద్ధుల్ని ప్రసాదించేవాడు, ప్రకృతికి అతీతుడు, నిర్గుణుడు, నిరంజనుడు, ఆదిపురుషుడు అవ్యక్త స్వరూపుడు, అద్వితీయుడు ఆ పరబ్రహ్మ, సకల సద్గుణ సంపన్నుడైన ఆ శ్రీకృష్ణపరబ్రహ్మనే శాంతచిత్తులైన వైష్ణవులు నిత్యం ధ్యానిస్తారు.

ఇన్ని గుణాలతో నిండిన ఆ శ్రీకృష్ణపరమాత్మ ప్రళయం సంభవించాక సమస్త సృష్టీ శూన్యంగా వుందని గమనించాడు. శూన్యంగా వున్న విశ్వాన్ని తిరిగి పునర్జీవింపచేయాలనుకున్నాడు. నశించిపోయిన, జలాన్ని, వాయువుని, వృక్షాల్ని, పర్వతాల్ని, సముద్రాల్ని, ధాతువుల్ని సస్యాల్ని, సకలదేవీ దేవతల్ని, మానవుల్ని ఇలా అందరినీ సృష్టించాలని సంకల్పించాడు.

## శ్రీకృష్ణ పరబ్రహ్మ సృష్టి

ఆదిపురుషుడైన శ్రీకృష్ణపరమాత్మ కుడివైపునుండి ముందుగా సంసారానికి మూలకారణమైన సత్త్వ, రజ, స్తమోగుణాలు, పంచవింశతి (25) తత్త్వాలు,

వాటికి చెందిన మహాతత్త్వం, అహంకారం, రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాలనే పంచతన్మాత్రలు ఆవిర్భవించాయి.

**నారాయణుడి ఆవిర్భావం :** శ్రీకృష్ణుడి దివ్యశరీరం నుంచి, శ్యామల వర్ణంతో ప్రకాశించేవాడు, పచ్చని వస్త్రాలు ధరించినవాడు, చతుర్భుజుడు, శంఖచక్రగదా, పద్మాలని ధరించినవాడు, చిరునవ్వులు చిందించేవాడు, రత్నభూషణాల్ని శార్ఙ్గం అనే ధనుస్సుని ధరించినవాడు శ్రీవత్సలాంఛనాన్ని హృదయం మీద ధరించినవాడు, చంద్రకాంతితో ప్రకాశించే అందమైన ముఖబింబం కలిగినవాడు, మన్మథుడి కన్నా అధికమైన రూపలావణ్యాలతో శోభించేవాడు, అయిన శ్రీమన్నారాయణుడు ఆవిర్భవించాడు. ఆనారాయణుడు తనకు తండ్రి అయిన శ్రీకృష్ణ పరమాత్మని ఎంతో ఘనంగా స్తుతించాడు.

## నారాయణుడు చేసిన శ్రీకృష్ణస్తుతి

వరం వరేణ్యం వరదం వరార్హం వరకారణమ్ ।
కారణం కారణానాంచ కర్మ తత్కర్మ కారణమ్ ॥ 1

తపస్తత్ఫలదం శశ్వత్త పశ్వీశం చ తాపసమ్ ।
వందేనవఘన శ్యామం స్వాత్మారామం మనోహరమ్ ॥ 2

నిష్కామం కామరూపంచ కామఘ్నం కామకారణమ్ ।
సర్వం సర్వేశ్వరం సర్వబీజరూపమనుత్తమమ్ ॥ 3

వేదరూపం వేదభవం వేదోక్త ఫలదం ఫలం ।
వేదజ్ఞం తద్విధానంచ సర్వవేదవిదాంవరమ్ ॥ 4

*(శ్లో॥10-13, అధ్యా-3, ప్ర.ఖం)*

శ్రేష్టమైనవాడు, గొప్పవాడు, వరాల్ని ప్రసాదించేవాడు కారణాలకు కారణమైనవాడు, కర్మస్వరూపుడు తపస్సుల్ని ఫలింపచేసేవాడు ఎప్పుడూ తపస్సుని ఆచరించేవాడు, ఈశ్వరుడు, కొత్తమేఘంలా నల్లగా వుండేవాడు, మనస్సుని హరించేవాడు, నిష్కాముడు, కామస్వరూపుడు, కామాల్ని పోగొట్టేవాడు, కోరికలు పుట్టటానికి కారకుడు సర్వస్వరూపుడు, సర్వేశ్వరుడు,

సమస్తానికీ కారకుడు. వేదస్వరూపుడు, వేదంతో కొనియాడబడేవాడు, వేదంలో చెప్పిన ఫలాల్ని ప్రసాదించేవాడు, సకల వేదాలూ తెలిసినవాడూ, వేదాలు తెలిసినవారందరిలో శ్రేష్టుడు, అయిన శ్రీకృష్ణపరమాత్మా నిన్ను ఎప్పుడూ నేను స్మరిస్తాను.

ఈవిధంగా నారాయణుడు శ్రీకృష్ణుణ్ణి భక్తిగా స్తుతించి ఆయన ముందున్న రత్న సింహాసనం మీద కూర్చున్నాడు.

శ్రీమన్నారాయణుడు చేసిన ఈ దివ్య శ్రీకృష్ణస్తుతిని శ్రద్ధాభక్తులతో నియమంగా త్రిసంధ్యల్లో పారాయణ చేసిన వాడికి పాపాలన్నీ నశిస్తాయి. ఈ స్తోత్రాన్ని విన్నా శుభఫలితాలు వస్తాయి. పుత్రులు లేనివారికి పుత్ర సంతానం కలుగుతుంది. వివాహం కావలసినవారికి వివాహం జరుగుతుంది. రోగపీడితులకి వ్యాధినివారణ జరుగుతుంది.

**మహాదేవుడి ఆవిర్భావం :** శ్రీకృష్ణ పరమాత్మ ఎడమభాగం నుంచి, శుద్ధ స్ఫటికంలా ప్రకాశించేవాడు, దిగంబరుడు, బంగారుకాంతిలా మెరిసిపోయే జటాజూటాలు కలిగినవాడు, చిరునవ్వులు చిందించే ముఖంతో, మూడుకళ్ళతో, శిరస్సునచంద్రరేఖని, చేతిలో జపమాలని ధరించినవాడు, సమస్త సిద్ధులకీ ఈశ్వరుడు, స్వయంగా సిద్ధుడు, యోగులకు యోగి, గురువులకు గురువు, మృత్యువుకి మృత్యువు, మృత్యుంజయుడు, శివస్వరూపుడు , జ్ఞానానందుడు విష్ణుభక్తులందరికన్నా గొప్పవాడు అయిన 'మహాదేవుడు' ఆవిర్భవించాడు. ఆ మహాదేవుడు తనను సృష్టించిన శ్రీకృష్ణ పరబ్రహ్మని ఇలా స్తుతించాడు.

## మహాదేవుడు చేసిన శ్రీకృష్ణస్తుతి

జయస్వరూపం జయదం జయేశం జయకారణం ।
ప్రవరం జయదానాం చ వందే తమపరాజితమ్ ॥ 1

విశ్వం విశ్వేరంచ విశ్వేశం విశ్వకారణమ్ ।
విశ్వరక్షాకారణంచ విశ్వఘ్నం విశ్వజం పరమ్ ॥ 2

ఫలబీజం ఫలాధారం ఫలంచతత్ఫల ప్రదమ్ ।
తేజఃస్వరూపం తేజోదం సర్వతేజస్వినాం వరమ్ ॥ 3

*(శ్లో॥24-27, అధ్యా3 (ప్ర.ఖం)*

ఈవిధంగా మహాదేవుడు శ్రీకృష్ణపరమాత్మని ఘనంగా స్తుతించి, అక్కడే నారాయణుడికి నమస్కరించి ఆయన ప్రక్కనే వున్న మరో సింహాసనంలో కూర్చున్నాడు.

**చతుర్ముఖబ్రహ్మ ఆవిర్భావం :** శ్రీకృష్ణ పరమాత్మనాభిలోని కమలం నుంచి, మహాతపస్వి, వృద్ధుడు కమండలాన్ని ధరించినవాడు, తెల్లని వస్త్రాలు, దంతాలు, కేశాలు కలిగినవాడు, యోగులకి, శిల్పులకి ఈశ్వరుడు, సకల ప్రాణికోటికీ తండ్రి, గురువు, తపఃఫలితాలని, సకల సంపదల్ని అనుగ్రహించేవాడు, సృష్టికర్త సమస్తకర్మలకీ కారణభూతుడు, విధాత, నాలుగు వేదాలనీ తన నాలుగు ముఖాలలో ధరించినవాడు, సరస్వతీదేవికి భర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ ఉదయించాడు. ఆ బ్రహ్మ కూడా తనని సృష్టించిన శ్రీకృష్ణ పరమాత్మకి భక్తిగా నమస్కరించి ఇలా కీర్తించాడు.

## బ్రహ్మచేసిన శ్రీకృష్ణస్తుతి

కృష్ణం వందే గుణాతీతం గోవిందమేకమక్షరం ।
అవ్యక్తమవ్యయం వ్యక్తం గోపవేషనిధాయినం ॥ 1
కిశోరవయసం శాంతం గోపీకాంతమనోహరమ్ ।
నవీననీరదశ్యామం కోటికందర్పసుందరం ॥ 2
బృందావన నవాభ్యర్ణే రాసమండలసంస్థితం ।
రాసేశ్వరం రాసవాసం రాసోల్లాససముత్సుకం ॥ 3

*(శ్లో॥ 35-37, అధ్యా-3)*

ఈవిధంగా శ్రీకృష్ణ పరమాత్మని స్తుతించి అక్కడే వున్న నారాయణ, మహాదేవులకి నమస్కరించి ఆసనంలో కూర్చున్నాడు చతుర్ముఖబ్రహ్మ.

**ధర్మదేవత ఆవిర్భావం :** త్రిమూర్తులు ఆవిర్భవించిన తరువాత శ్రీకృష్ణ పరబ్రహ్మ వక్షఃస్థలం నుంచి, తెల్లని జడలను ధరించినవాడు, సర్వసాక్షీభూతుడు, సర్వజ్ఞుడు, అందరిమీదా, అన్నిరకాల కర్మల మీద సమానమైన దృష్టి కలిగినవాడు, హింస, కోపం లేనివాడు, దయామయుడు, ధర్మజ్ఞానం కలిగినవాడు,

ధర్మాన్ని ఆచరించేవాడు, ధర్మస్వభావాన్ని పెంపొందించేవాడు, ధర్మాత్ములందరికన్నా గొప్ప ధర్మాత్ముడు అయిన 'ధర్మపురుషుడు' ఉదయించాడు. ఆయన వెంటనే శ్రీకృష్ణ పరమాత్మకి సాష్టాంగదండ ప్రణామం చేసి ఆయన్ని భక్తి పూర్వకంగా ఇలా స్తుతించాడు.

## ధర్మదేవత చేసిన శ్రీకృష్ణస్తుతి

కృష్ణం విష్ణుం వాసుదేవం పరమాత్మానమీశ్వరం ।
గోవిందం పరమానందం ఏకమక్షరమచ్యుతం ॥ 1

గోపేశ్వరంచ గోపేశం గోపం గోరక్షకం విభుం ।
గవామీశంచ గోష్ఠస్థం గోవత్సపుచ్ఛధారిణం ॥ 2

*(శ్లో॥ 45-46, అధ్యా3)*

ఈవిధంగా శ్రీకృష్ణపరమాత్మని స్తుతించి త్రిమూర్తుల ప్రక్కనున్న ఆసనం మీద కూర్చున్నాడు. ధర్మదేవత చెప్పిన శ్రీకృష్ణుడి 24 నామాల స్తోత్రాన్ని ప్రతిరోజూ ఉదయాన్నే పఠించిన వాడికి సుఖసంతోషాలు ప్రాప్తిస్తాయి.

**సరస్వతీదేవి ఆవిర్భావం :** శ్రీకృష్ణపరమాత్మ ముఖం నుంచి మూర్తీభవించిన లక్ష్మీ కళతో ఒక కన్యఆవిర్భవించింది. ఆదేవి తెల్లని వర్ణంతో ప్రకాశిస్తోంది. వీణని, పుస్తకాలనీ చేతిలో ధరించింది. చక్కని పద్మాలలాంటి అందమైన కళ్ళు కలిగినది. బంగారు రంగు చీరని రత్నాభరణాలనీ ధరించినది. చిరునవ్వులు చిందించే ముఖంతో వెలుగొందుతున్నదీ, వేద శాస్త్రాలకు నిలయమైనదీ, పండితులందరికీ తల్లిలాంటిది, వాక్కులకి అధిష్టానదేవత, కవులందరి చేతా కీర్తించబడేది, శుద్ధ సత్త్వస్వరూపిణి ఆయిన సరస్వతీదేవి తనని సృష్టించిన శ్రీకృష్ణ పరబ్రహ్మ గుణ గుణాలని ఇలా మధురంగా కీర్తించింది.

## సరస్వతీదేవి చేసిన శ్రీకృష్ణస్తుతి

రాసమండల మధ్యస్థం రాసోల్లాససముత్సుకం ।
రత్నసింహాసనస్థంచ రత్నభూషణ భూషితం ॥ 1

రాసేశ్వరం రాసకరం పరం రాసేశ్వరీశ్వరం ।
రాసాధిష్ఠాతృదైవంచ వందేరాసవినోదినం ॥ 2
రాసాయాస పరిశ్రాంతం రాసరాసవిహారిణం ।
రాసోత్సుకానాం గోపీనాం కాంతం శాంతం మనోహరం ॥ 3

*(శ్లో॥60-63, అధ్యా3)*

శ్రీకృష్ణుడి దివ్యలీలల్ని మధురంగా కీర్తించిన సరస్వతీదేవి ముందుగా శ్రీకృష్ణుడికి తరువాత అక్కడున్న అందరికీ నమస్కరించి ఆసనంలో కూర్చుంది.

**మహాలక్ష్మీదేవి ఆవిర్భావం :** శ్రీకృష్ణ పరబ్రహ్మ మనసునుంచి రత్నాభరణాలు, పీతాంబరం ధరించిందీ, చిరునవ్వులు చిందించే ముఖం కలిగినదీ, నవయవ్వనంతో శోభించేది, సకలైశ్వర్యాలకీ అదిష్ఠాత్రి, సకల సంపదల్నీ ప్రసాదించేది అయిన మహాలక్ష్మీదేవి ఆవిర్భవించింది. ఆదేవి తనని సృష్టించిన శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కరించి ఇలా ఘనంగా కీర్తించింది.

## మహాలక్ష్మీదేవి చేసిన శ్రీకృష్ణస్తుతి

సత్యస్వరూపం సత్యేశం సత్యబీజం సనాతనమ్ ।
సత్యాధారంచ సత్యజ్ఞం సత్యమూలం నమామ్యహం ॥

*(శ్లో॥68, అధ్యా-3)*

సత్యస్వరూపుడు, సత్యానికి ఈశ్వరుడు, సత్యానికి కారణమైనవాడు, సనాతనుడు, సత్యానికి ఆధారమైనవాడు, సత్యజ్ఞుడు, సత్యం మూలస్థానంగా కలిగినవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి నమస్కరిస్తున్నాను. అని స్తుతించి అక్కడేవున్న ఒక సింహాసనం మీద కూర్చుంది.

**మూలప్రకృతి శ్రీదుర్గాదేవి ఆవిర్భావం :**

శ్రీకృష్ణ పరమాత్మ బుద్ధినుంచి ఈసమస్తానికీ అధిష్టాతృదేవి. ఆది ప్రకృతి, ఈశ్వరి, మేలిమిబంగారం లాంటి కాంతి కలిగినది, కోటిసూర్యులతేజస్సుతో ప్రకాశించేది, చిరునవ్వులు చిందించే ముఖం కలిగినది, పద్మంలాంటి కళ్ళు కలిగినది, ఎర్రటి వస్త్రాల్ని ధరించింది, నిద్ర, తృష్ణ, ఆకలిదప్పికలు, దయ,

శ్రద్ధ, క్షమ లాంటి సర్వశక్తులకీ అధిష్ఠానదేవత, భయంకర స్వరూపిణి, వంద భుజాలు కలిగినది, తొందరగా సాధ్యంకానిది, ఆర్తిని తొలగించేది, భగవంతుడి శక్తి స్వరూపిణి, లోకాలన్నిటికీ తల్లి, త్రిశూలం శక్తి, శార్ఙ్గం, ధనుస్సు, ఖడ్గం, బాణం, శంఖం, చక్రం, గద, పద్మం, స్ఫటికమాల, కమండలం, వజ్రం, అంకుశం, పాశం, భుశుండి, దండం, తోమరం, నారాయణాస్త్రం , బ్రహ్మాస్త్రం, రౌద్రాస్త్రం, పాశుపతాస్త్రం, వాయవ్యాస్త్రం, వారుణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, గాంధర్వాస్త్రం, ధరించివున్న ఆదిప్రకృతి శ్రీదుర్గాదేవి ఆవిర్భవించింది. ఆ మహాశక్తి తనని సృష్టించిన శ్రీకృష్ణ పరబ్రహ్మని దివ్యంగా ఇలా స్తుతించింది.

## శ్రీ దుర్గాదేవి చేసిన శ్రీకృష్ణస్తుతి

అహం ప్రకృతిరీశానా సర్వేశాసర్వరూపిణీ ।
సర్వశక్తి స్వరూపాచ మయాశక్తిమజ్జగత్ ॥ 1

త్వయాసృష్టాన స్వతంత్రా త్వమేవజగతాం పతిః ।
గతిశ్చ సాతాస్రష్టాచ సంహర్తా చపునర్విధిః ॥ 2

స్రష్టుం స్రష్టాచ సంహుర్తుం సంహర్తా వేధసాం విధిః ।
పరమానంద రూపం త్వాం వందేచానంద పూర్వకం ॥ 3

యంచస్తోతుంమశక్తాశ్చ బ్రహ్మవిష్ణుశివాదయః ।
వేదా అహంచవాణీచ వందేతం ప్రకృతేః పరం ॥ 4

వేదాశ్చ విదుషాం శ్రేష్టాః స్తోతుంశక్తాశ్చన క్షమాః ।
నిర్లక్ష్యం కః క్షమం స్తోతుం తం నిరీహం నమామ్యహం ॥ 5

*(శ్లో॥ 77-85 అధ్యా3)*

నేను ప్రకృతి స్వరూపిణిని ఈశ్వరిని సర్వేశ్వరిని, సమస్త రూపాల్నీ నేను ధరిస్తాను. నేను సకలశక్తి స్వరూపిణిని, నావల్లనే ఈ ప్రపంచమంతా శక్తిని కలిగివుంది. అయినా నేను నీచేత సృష్టించబడ్డాను. అందువల్ల నేను పూర్తి స్వతంత్రురాలినికాను. నీవే ఈలోకాలన్నిటికీ ఈశ్వరుడివి. రక్షకుడివి. సృష్టికర్తవి, సంహారకర్తవి కూడా నీవే. నిన్ను స్తుతించటానికి బ్రహ్మ, విష్ణు

శివాదిదేవతలు, వేదాలు, నేను, లక్ష్మి, సరస్వతి, గొప్ప పండితులు కూడా శక్తులు కారు. అటువంటి పరబ్రహ్మవైన నీకు నమస్కరిస్తున్నాను అని పలికి శ్రీకృష్ణుడి సమీపంలో వున్న రత్నసింహాసనం మీద ఆసీనురాలయ్యింది.

**సావిత్రీదేవి ఆవిర్భావం :** శ్రీకృష్ణ పరబ్రహ్మ నాలుకనుంచి శుద్ధ స్ఫటికంలా తెల్లగా ప్రకాశించేది, అందమైనది, తెల్లటి వస్త్రాల్ని ధరించినది, సమస్తఅలంకారాలతో శోభిస్తున్నది, జపమాలను ఒకచేతిలో ధరించిన సావిత్రీదేవి ఆవిర్భవించింది. పరబ్రహ్మ, సనాతనుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మని సావిత్రీదేవి ఇలా స్తుతించింది. అక్కడున్న ఆసనంమీద కూర్చుంది.

## సావిత్రీదేవి చేసిన శ్రీకృష్ణస్తుతి

నమామి సర్వబీజం త్వాం బ్రహ్మజ్యోతిః సనాతనం ।
పరాత్పర తమం శ్యామం నిర్వికారం నిరంజనం ॥

*(శ్లో॥4, అధ్యా-4)*

**రతీమన్మథుల ఆవిర్భావం :** శ్రీకృష్ణపరమాత్మ మనసునుంచి మేలిమిబంగారంలాంటి కాంతితో ప్రకాశించే ఒక దివ్యపురుషుడు ఉదయించాడు. ఆ పురుషుడు తన పంచబాణాలతో అందరి మనసుల్నీ చలింపచేస్తున్నందున అతన్ని మన్మథుడు అని పిలిచారు. ఆ మన్మథుడికి ఎడమవైపు అతడికి ప్రియురాలు, జనులందరికీ మోహాన్ని కలిగించే ఒక అందమైన స్త్రీ ఆవిర్భవించింది. ఆమెని చూడగానే అందరికీ ప్రీతి కలిగింది అందుకే ఆమెని అందరూ 'రతీ' అని పిలిచారు. అలా ఆవిర్భవించిన రతీ మన్మథులు శ్రీకృష్ణుడికొలువులో వున్న సింహాసనం మీద కూర్చున్నారు.

**అగ్ని-వరుణుల ఆవిర్భావం :** శ్రీకృష్ణుడి మనసునుంచి రతీదేవితో సహా ఆవిర్భవించిన మన్మథుడు. ఊరికే కూర్చోకుండా తన పూలబాణాల శక్తి ఏపాటిదో తెలుసుకోవాలనుకున్నాడు. అతడు మారణం, స్తంభనం, జృంభణం, శోషణం, ఉన్మాదం అనే తన అయిదు బాణాల్నీ అక్కడున్న దేవతలందరి మీదా ప్రయోగించాడు. మన్మథబాణ ప్రయోగ ప్రభావంతో అందరూ మోహాన్ని పొందారు.

అందంగా వున్న రతీదేవిని చూసిన వెంటనే బ్రహ్మదేవుడికి రేతస్సు పతనమైంది. ఆయన సిగ్గుతో దాన్ని వస్త్రం చాటున దాచాడు. అయితే జ్వలిస్తున్న ఆ రేతస్సు ఆ వస్త్రాన్ని కాల్చి కోటితాటి చెట్లంత ఎత్తుకి ఎగిసింది. అదిచూసి శ్రీకృష్ణపరమాత్మ తన లీలతో నీటిని సృష్టించాడు. ఆనీటిలోని ఒక్క కణం అంతమంటనీ చల్లార్చింది. ప్రపంచాన్ని ఆ నీరే పవిత్రం చేసింది. పరమాత్మ సృష్టించిన ఆ నీటినుంచి వరుణుడనే పురుషుడు ఆవిర్భవించాడు. ఆయనే సమస్త జలాలకూ అధిపతి.

అక్కడ ఆవిర్భవించిన అగ్నికి ఎడమభాగంలో ఒక కన్య ఉదయించింది. ఆమెని 'స్వాహా' దేవి అంటారు. ఆమె అగ్నికి భార్య. అలాగే వరుణుడి పక్కనుంచి మరో కన్య పుట్టింది. ఆమెని 'వరుణానీ' అంటారు. ఆమె వరుణుడి భార్య.

**వాయువు ఆవిర్భావం :** కృష్ణపరమాత్మ నిశ్వాసం నుంచి వాయుదేవుడు ఆవిర్భవించాడు. ఆ వాయువే సమస్త జీవులకీ ప్రాణాధారం అయ్యాడు. అతడే ప్రాణులందరికీ ఉచ్ఛ్వాసంగా మారాడు. వాయుదేవుడి ఎడమప్రక్క నుంచి ఒక కన్య ఆవిర్భవించింది. ఆమెని 'వాయవి' అంటారు. ఆమె తరువాత వాయువుకి భార్య అయ్యింది.

**శ్రీమహావిష్ణువు ఆవిర్భావం :** మన్మధుడి ప్రభావంతో తిరిగి బ్రహ్మదేవుడికి రేతస్సు పతనమైంది. ఈసారి ఆయన తన రేతస్సుని నీళ్ళల్లో వదిలాడు. నీటిలోకి చేరిన బ్రహ్మరేతస్సు వేయి సంవత్సరాల తరువాత ఒక శిశువుగా రూపొందింది. ఆశిశువే క్రమంగా పెరిగి విరాట్‌రూపాన్ని ధరించింది. ఆ విరాట్ పురుషుడి ఒక్కో రోమకూపంలో ఒక్కో విశ్వం ఉంటుంది. అతనికన్నా గొప్పవాడు లేడు. ఆవిరాట్పురుషుడే శ్రీమహావిష్ణువు. ఆయన శ్రీకృష్ణ పరబ్రహ్మ పదహారో అంశ.

**భూమి ఆవిర్భావం :** పరబ్రహ్మ పదహారో అంశతో జన్మించిన శ్రీమహావిష్ణువు నీటిమీద తామరాకులాగా సముద్రం మీద హాయిగా శయినించి వున్నాడు. ఒకనాడు ఆయన చెవిలోని మలం నుంచి మధు–కైటభులనే రాక్షసులు పుట్టారు. వారు జన్మించగానే నీటిపైకి వచ్చి అక్కడ కనిపించిన

బ్రహ్మని చంపాలని ప్రయత్నించారు. అప్పుడు బ్రహ్మ ప్రార్థన విని నిద్ర లేచిన శ్రీహరి వారిద్దరితో యుద్ధంచేసి చివరికి వారిని ఘోరంగా వధించాడు. అప్పుడు మరణించిన ఆ అసురులు మేదస్సు(కొవ్వు) ఆ నీటిలో ఏర్పడింది. అదే క్రమంగా భూమిగా మారింది. ఆ భూమి మీదే విశ్వాలన్నీ వున్నాయి. కాలక్రమంలో ఆభూమినే వసుంధర అని పిలిచారు.

**రాధాదేవి ఆవిర్భావం :** బ్రహ్మాదిదేవతలందర్నీ సృష్టించిన తరువాత శ్రీకృష్ణ పరమాత్మ వారందర్నీ తీసుకుని దివ్యమైన గోలోకానికి వెళ్ళాడు. గోలోకంలో ఒక అందమైన రాసమండలం వుంది. అది ఎంతో విస్తీర్ణంగా కల్పవృక్షాల మధ్యలో వుంది. ఆ ప్రదేశంలో చందనం, అగరు, కస్తూరి, కుంకుమ వంటి సుగంధ ద్రవ్యాలు చల్లబడ్డాయి. పెరుగు పేలాలు, సత్తుపిండి, ధాన్యం, గరికలతో ఆ ప్రదేశం నిండి వుంది. అంత సుందరమైన రాసమండంలోకి ప్రవేశించి అక్కడున్న సింహాసనం మీద కూర్చున్నాడు కృష్ణ పరమాత్మ. ఆయనతో వచ్చిన దేవతలు కూడా చుట్టూ కూర్చున్నారు.

అంతలో కృష్ణపరమాత్మ ఎడమభాగం నుంచి ఒక సుందరమైన కన్య ఆవిర్భవించింది. ఆకన్య వెంటనే అక్కడనుంచి సమీపంలో ఉన్న పూలచెట్టు దగ్గరికి పరుగెత్తుకెళ్ళింది. పూలనుకోసి తెచ్చి కృష్ణుడి పాదాలమీద వేసింది. ఆమె రాసమండలంలో శ్రీకృష్ణుడి ఎదుట పరుగెత్తింది. (రాసేదధావ) కాబట్టి ఆమెని 'రాధ' అని పిలిచారు. ఆరాధాదేవి శ్రీకృష్ణుడి ప్రాణసఖి. ఆయనకి అత్యంత ప్రీతిపాత్రురాలు. పదహారు సంవత్సరాల కన్య బంగారు చీరని ధరించి సర్వాంగ సుందరంగా శోభిస్తుంది. అలాజగదేక సౌందర్యవతిలా భాసిస్తున్న రాధాదేవి శ్రీకృష్ణుడికి భక్తిగా, ప్రేమతో నమస్కరించి ఆయనకి ఎదురుగా వున్న ఆసనం మీద కూర్చుంది.

**గోవులు గోపికలు గోపకులు :** దివ్య సింహాసనం మీద కూర్చున్న రాధాదేవి రోమకూపాల నుంచి, ఆశ్చర్యకరంగా లక్షకోటి గోపికాగణాలు ఆవిర్భవించాయి. వారంతా రాధాదేవితో సమానమైన సౌందర్యం కలిగి అదే రూపంతో వున్నారు. వారంతా నవయవ్వనవతులు. అదే సమయంలో

శ్రీకృష్ణపరమాత్మ రోమకూపాల నుంచి ముప్ఫై కోట్లమంది గోపకులు ఉదయించారు. వారంతా శ్రీకృష్ణుడి రూపంతో వున్నారు. అందరూ యవ్వనవంతులే.

**వాహనాలు :** గోపకులు ఉదయించిన తరువాత కృష్ణపరమాత్మ రోమకూపాల నుంచి రంగురంగుల గోగణాలు అసంఖ్యాకంగా ఆవిర్భవించాయి. వాటిలో వివిధ రకాలైన ఎద్దులు, ఆవులు, లేగదూడలు, కపిల గోవులు ఉన్నాయి. వాటిలో కోటి సింహాల బలం కలిగిన ఒక వృషభరాజం వుంది. శ్రీకృష్ణుడు ఆవృషభాన్ని శివుడికి వాహనంగా ప్రసాదించాడు.

తరువాత కృష్ణపరమాత్మ కాలగోళ్ళ నుంచి రాజహంసలు ఆవిర్భవించాయి. ఆ రాజహంసల్లో ఒక బలమైన అందమైన రాజహంసని బ్రహ్మదేవుడికి వాహనంగా ఇచ్చాడు. కొద్ది సేపటికి ఆయన ఎడమ చెవిలోనుంచి తెల్లని గుర్రాల సమూహం ఆవిర్భవించింది. వాటిలో ఒక మంచి బలిష్టమైన గుర్రాన్ని ధర్మదేవతకి కానుకగా ఇచ్చాడు కృష్ణపరమాత్మ. ఆ తరువాత ఆయన కుడిచెవినుంచి అసంఖ్యాకమైన సింహగణాలు ఆవిర్భవించాయి. వాటిలోంచి ఒక బలిష్ఠమైన సింహాన్ని ఆదిప్రకృతి దుర్గాదేవికి వాహనంగా బహుకరించాడు.

**దివ్యరథాలు :** యోగీంద్రుడైన కృష్ణపరమాత్మ తన సంకల్పశక్తితో అయిదు దివ్యరథాల్ని సృష్టించాడు. అవి ఒక్కోటీ లక్షయోజనాల ఎత్తుతో, వందయోజనాల విస్తీర్ణంతో వున్నాయి. లక్షచక్రాలతో వున్న ఆరథాలు వాయువేగంతో నడుస్తాయి. అలాంటి దివ్యరథాలలో ఒకదాన్ని నారాయణుడికి రెండో రథాన్ని రాధాదేవికి ఇచ్చి మిగిలిన మూడు రథాల్ని తన దగ్గరే ఉంచుకున్నాడు.

**యక్షులు :** శ్రీకృష్ణుడి గుహ్యప్రదేశం నుంచి పింగళవర్ణంతో అసంఖ్యాకమైన పురుషులు ఆవిర్భవించారు.గుహ్యప్రదేశం నుంచి పుట్టారు కాబట్టి వారిని గుహ్యకులు అన్నారు. ఆ గుహ్యకుల్లో మొదట పుట్టిన వాడు కుబేరుడు. కాలక్రమంలో ఆయన ధనానికి అధిపతి అయ్యాడు. ఈ గుహ్యకులనే యక్షులు అని కూడా అంటారు.

**పార్షదులు :** గుహ్యకుల తరువాత శ్రీకృష్ణుడి ముఖం నుంచి శంఖచక్ర గదా పద్మాలు, వనమాలలు, పట్టుపీతాంబరాలు ధరించిన వారు, నల్లనిరంగుతో ప్రకాశించేవారు, నాలుగు భుజాలతో వున్నవారు చెవులకి కుండలాలు తలపై దివ్యమైన కిరీటాలు, శరీరం మీద వివిధరకాల రత్నాభరణాలు ధరించిన 'పార్షదులు' అనేవారు ఉద్భవించారు. అలా ఉద్భవించిన 'పార్షదుల్ని' నారాయణుడికి తన గుహ్యం నుంచి ఆవిర్భవించిన గుహ్యకుల్ని కుబేరుడికి ఇచ్చేశాడు శ్రీకృష్ణపరమాత్మ.

**వైష్ణవులు :** పార్షదుల తరువాత, రెండు భుజాలతో నల్లని వర్ణంతో, ఎల్లప్పుడూ జపమాలను చేతిలో ధరించినవారు శ్రీకృష్ణుడి దివ్యపాదపద్మాలని నిరంతరం భక్తిగా ధ్యానంచేసేవారు, శ్రీకృష్ణుడి దాసుల్ని దాసులుగా సేవించేవారు, కృష్ణభక్తి పరాయణులు, శ్రీకృష్ణుడి దివ్యనామం వింటేనే చాలు పులకరించి పోయేవారు, కృష్ణుడు తలపుకు వస్తే కళ్ళలో నీళ్ళు తిరిగి కంఠం గద్గదమై పోయేవారు, వైష్ణవులు పరమభక్తి పరాయణులైన ఆ వైష్ణవులు కృష్ణపరబ్రహ్మ పాదాలనుంచి జన్మించారు.

**అష్టభైరవులు :** తరువాత శ్రీకృష్ణపరమాత్మ కుడి కంటినుంచి, మహాభయంకరులు, త్రిశూలం, పట్టిసం అనే ఆయుధాల్ని ధరించినవారు, చంద్రరేఖని సిగపై ధరించినవారు, మహాకాయులు, జ్వలిస్తున్న అగ్నిశిఖలా వెలుగొందుతూ శివతేజస్సుతో ప్రకాశించేవారు, పూజనీయులు, దిగంబరులు అయిన రురుడు, సంహారుడు, కాలుడు, అసితుడు, క్రోధుడు, భీషణుడు, మహాభైరవుడు, ఖడ్వాంగుడు అనే అష్టభైరవులు ఆవిర్భవించారు.

**ఈశ్వరుడి ఆవిర్భావం :** అష్టభైరవులు తరువాత శ్రీకృష్ణ పరబ్రహ్మ ఎడమకంటి నుంచి భయంకరమైనవాడు, త్రిశూలం, పట్టిసం, గద, అనే ఆయుధాల్ని, పులిచర్మాన్ని ధరించినవాడు, త్రినేత్రాలతో దిగంబరుడుగా, మహాకాయుడుగా వున్నవాడు చంద్రరేఖని సిగలో ధరించినవాడు అయిన ఈశ్వరుడు ఆవిర్భవించాడు. దిక్పాలకులందరికీ ఆయనే అధిపతి.

అదేవిధంగా శ్రీకృష్ణుడి ఎడమకంటి నుంచి ఎందరో క్షేత్రపాలకులు, యోగినిలు, ఢాకినీ గణాలు ఉద్భవించగా, ఆయన పృష్ట(వెనుక) భాగం నుంచి దివ్య శరీరధారులైన ముప్పైమూడుకోట్ల మంది దేవతలు ఆవిర్భవించారు.

## బ్రహ్మ నారదుల పరస్పర శాపాలు

శ్రీకృష్ణుడి ఆజ్ఞతో సకలసృష్టిని చేస్తున్నాడు బ్రహ్మదేవుడు. ఆసమయంలో బ్రహ్మ వెనుకభాగం నుంచి అధర్ముడు, ఎడమ భాగం నుంచి అలక్ష్మి (దారిద్ర్యదేవత) ఆయన నాభినుంచి దేవశిల్పి విశ్వకర్మ తరువాత అష్టవసువులు ఉదయించారు. అదేవిధంగా బ్రహ్మమనసునుంచి 1.సనక 2.సనందన 3.సనాతన 4.సనత్కుమారులనే నలుగురు పుత్రులు ఉదయించారు. వారంతా బ్రహ్మ వర్చస్సుతో వెలిగిపోతున్నారు. బ్రహ్మ ముఖం నుంచి సుందరమైన ఒక నవయువకుడు జన్మించాడు. అతడే స్వాయంభువమనువు. ఆయనతో పాటే ఆయన భార్య శతరూపకూడా ఆవిర్భవించింది.

ఆవిధంగా తన నుంచి జన్మించిన పుత్రుల్ని 'సృష్టిచేయండి' అని ఆజ్ఞాపించాడు బ్రహ్మదేవుడు. అయితే పరమభాగవతులై సంసారజీవితం మీద విరక్తిచెందిన ఆయన మానసపుత్రులు సృష్టికార్యాన్ని తిరస్కరించి, తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయారు. వారలా వెళ్ళిపోవటంతో ఒక్కసారిగా భృకుటి నుంచి ఏకాదశరుద్రులు ఆవిర్భవించారు. వారి పేర్లు 1.కాలాగ్నిరుద్రుడు 2.మహాన్ 3.మహాత్మ 4.మతిమాన్ 5.భీషణుడు 6.భయంకరుడు 7.ఋతుధ్వజుడు 8.ఊర్ధ్వకేశుడు 9.పింగళాక్షుడు 10.రుచి 11.శుచి వీరిలో కాలాగ్ని రుద్రుడు ప్రళయకాలంలో సృష్టిని సంహరిస్తాడు.

ఏకాదశ రుద్రులు ఆవిర్భవించిన తరువాత బ్రహ్మదేవుడి కుడిచెవి నుంచి పులస్త్యుడు, ఎడమచెవినుంచి పులహుడు, కుడి కన్ను నుంచి అత్రిమహర్షి, ఎడమ కన్ను నుంచి క్రతుమహర్షి, ఆయన నాసికారంధ్రాల నుంచి ఆరణిమహర్షి, ముఖంనుంచి అంగిరస మహర్షి, ఎడమభాగం నుంచి భృగుమహర్షి, కుడివైపు నుంచి దక్షుడు, ఆయననీడ నుంచి కర్దమమహర్షి, నాభినుంచి పంచశిఖుడు,

వక్షస్థలం నుంచి వోఢుమహర్షి, కంఠభాగం నుంచి నారదమహర్షి, స్కంధభాగం నుంచి మరీచిముని, గొంతునుంచి అపాంతర తమ మహర్షి, నాలుక నుంచి వశిష్ఠమహర్షి, క్రింది పెదవులనుంచి హంసమహర్షి, కుడిపార్శ్వం నుంచి 'యతి' అనేముని ఆవిర్భవించారు.

బ్రహ్మదేవుడు వీరందరినీ పిలిచి "మీరంతా నేటి నుంచి సృష్టికార్యాన్ని చేయండి" అని ఆజ్ఞాపించాడు. ఆ మాట విన్న నారదమహర్షి బ్రహ్మతో "తండ్రీ! మాకు పూర్వం జన్మించిన మా సోదరులు సనకనందనాదులకి వివాహం చేసి ముందువారిని సృష్టికార్యంలో వినియోగించు. ఆ తరువాత మమ్మల్ని ఆజ్ఞాపించవచ్చు. వారేమో తపస్సు చేయటానికి వెళ్ళి పోయారుకదా! వారినేమీ అనకుండా మమ్మల్నెందుకు సంసారకూపంలోకి తోస్తున్నారు. అందులోపడిన వాడు ఎప్పటికీ బయటపడలేడు కదా! మాకుకూడా సంసారంచేసి సృష్టికార్యాన్ని కొనసాగించాలన్న ఇచ్ఛలేదు. తపోవృత్తిని ఆశ్రయించి జీవించాలనేదే మా కోరిక" అని అన్నాడు.

**బ్రహ్మపెట్టిన శాపం :** నారదుడి మాటలు విన్న బ్రహ్మకి ఆగ్రహం కలిగింది. తన మాటని ధిక్కరించటమేకాకుండా, తనకు ఎదురు సమాధానం చెప్పటాన్ని ఆయన సహించలేక పోయాడు. వెంటనే నారదుడితో "నారదా! యుక్తా యుక్తాలు మరిచి తండ్రినైననన్నే ప్రశ్నించావు. అందుకే నిన్ను శపిస్తున్నాను. నేటినుంచి నీలో జ్ఞానం నశిస్తుంది.

త్వరలో నీవు 'ఉపబర్హణుడు' అనే గంధర్వుడిగా జన్మిస్తావు. ఆ జన్మలో నీవు స్త్రీలోలుడివైపోతావు. ఎంతో మంది అందమైన స్త్రీలతో రమిస్తావు. నీకు ఏభైమంది భార్యలుంటారు. వివిధ రకాల శృంగాభోగాలనుభవించి, గంధర్వుల్లో గొప్ప విలాస పురుషుడుగా ప్రసిద్ధి చెందుతావు. అలానీవు నీ భార్యలతో ప్రియురాళ్ళతో లక్ష్య దివ్యయుగాలు కాలం గడిపి మరోజన్మలో ఒకదాసికి పుత్రుడుగా జన్మిస్తావు. ఆజన్మలో విష్ణుకథలు వినటం వల్ల, విష్ణు భక్తులకి సేవ చేయటం వల్ల తరువాత జన్మలో తిరిగి నా కుమారుడిగా జన్మిస్తావు. ఇదే నీవు చేసిన అపరాధానికి తగిన శిక్ష" అని కఠినంగా పలికాడు.

బ్రహ్మశాపాన్ని విన్న నారదుడికి దుఃఖం ముంచుకొచ్చింది. రెండు చేతులూ జోడించి పితామహా! దయచేసి నామీద కోపాన్ని ఉపసంహరించుకోండి. ఎంతోమందిని సృష్టించే తమకు కోపం తగదు. నేనేం తప్పుచేసాను. నేనేమైనా చెడుమార్గంలో సంచరిస్తుంటే నన్ను మందలించవచ్చు లేదా నన్ను శపించవచ్చు కానీ నేను తపస్సు చేసుకుంటానంటే అకారణంగా నన్ను శపించారే! ఇది భావ్యమా! శపిస్తే శపించారుకానీ నేను ఎన్ని జన్మలెత్తినా హరిభక్తి విడవకుండా నన్నంటిపెట్టుకుని వుండే వరాన్ని ప్రసాదించండి. బ్రహ్మ పుత్రుడైనా సరే హరి భక్తి లేకపోతే వాడు సూకరంతో సమానుడు.

**నారదుడు బ్రహ్మకిచ్చినశాపం :** తండ్రీ! ఏయజమానైనా తన భార్యకి, పుత్రులకి, సేవకులకి, బంధువులకి సన్మార్గాన్ని చూపిస్తే అతడు ఉత్తమగతులు పొందుతాడు. ఎవరైతే అలాకాక చెడుమార్గాన్ని చూపిస్తే వారు ఘోరమైన కుంభీపాకనరకానికి చేరుకుంటారు. శ్రీకృష్ణుడి మీద భక్తి ప్రపత్తులు పెంచుకున్నవాడిని తిరస్కరిస్తే అతడు గురువైనా తండ్రైనా, యజమానైనా, కొడుకైనా దుర్మార్గుడే అవుతాడు. కనుక తండ్రీ! నా తప్పులేక పోయినా నన్ను శపించావు కనుక నీవు కూడా శపించబడటానికి అర్హుడవే. కనుక నిన్నిలాశపిస్తున్నాను.

సకల సృష్టికీ నీవుకారకుడవైనప్పటికీ నీకు కవచం, మంత్రం, స్తోత్రం, పూజ అనేవి లోకంలో లేకుండుగాక! ఈ నాశాపప్రభావం మూడు కల్పాలవరకూ కొనసాగుతుంది. మూడు కల్పాల తరువాత మాత్రమే నీవు పూజించబడతావు. అప్పటిదాకా నీకు యజ్ఞంలో భాగం, వ్రతాలు, పూజ, వంటివి ఉండవు" అని శపించాడు. ఆ విధంగా బ్రహ్మదేవుడికి నాటినుంచి పూజులు లేకుండా పోయాయి. ఇక నారదుడు కూడా బ్రహ్మశాపాన్ని అనుసరించి ఆయన చెప్పిన జన్మలు ఎత్తి, హరిభక్తి ప్రభావంతో తిరిగి బ్రహ్మకుమారుడుగా జన్మించాడు.

## ఆయుర్వేద విశారదులు - ఆరోగ్య సూత్రాలు

సకలసృష్టికీ ప్రధానకారకుడైన శ్రీకృష్ణపరమాత్మ లోకోద్ధరణ కోసం నాలుగువేదాల్ని సృష్టించాడు. ఆయన అంశతో జన్మించిన చతుర్ముఖ బ్రహ్మ తన నాలుగు ముఖాలతో ఋక్, యజు, సామ, అధర్వవేదాల్ని గ్రహించి వాటి

జ్ఞానంతో తాను ఆయుర్వేదాన్ని సృష్టించాడు. పంచమవేదంగా ప్రసిద్ధి పొందిన ఆయుర్వేదాన్ని, సూర్యభగవానుడికి ఉపదేశించాడు. సూర్యుడు తను గ్రహించిన దాన్ని 'భాస్కర సంహిత' అనే పేరుతో తిరిగి తన శిష్యులకి ఉపదేశించాడు. ఆ తరువాత పరంపరగా సూర్యుడి శిష్యులు ఆయుర్వేదాన్ని లోకంలో ప్రచారం చేసారు.

**సూర్యుడి శిష్యులు :** భాస్కర సంహితకర్త అయిన సూర్యభగవానుడికి 1.ధన్వంతరి 2.దివోదాసు 3.కాశీరాజు 4.అశ్వినీకుమారులు 5.నకులుడు 6.సహదేవుడు 7.అర్కి(యముడు) 8.చ్యవనుడు 9.జనకుడు 10.బుధుడు 11.జాబాలుడు 12.జాజలి 13.పైలుడు 14.కరథుడు 15.అగస్త్యుడు అనే శిష్యులున్నారు. వారంతా వేదవేదాంగవిజ్ఞానవేత్తలే కాక ఆయుర్వేద ఔషధ విజ్ఞానాన్ని కూడా తెలిసిన పండితులు. అసాధ్యవ్యాధుల్ని సైతం నిర్మూలించగల సిద్ధవైద్యులు.

**సూర్యుడి శిష్యులు రచించిన గ్రంథాలు :** సూర్యుడి శిష్యులైన పదిహేను మంది మహాపండితులు వివిధరకాల ఆయుర్వేదగ్రంథాలు రచించారు. 1.ధన్వంతరి – చికిత్సాతంత్రవిజ్ఞానం 2.కాశీరాజు చికిత్సా కౌముదీ తంత్రం 3.అశ్వినీకుమారులు – చికిత్సాసారతంత్రం 4.నకులుడు – వైద్యకసర్వ స్వతంత్రం 5.సహదేవుడు–వ్యాధిసింధువిమర్ధనం 6.దివోదాసు–చికిత్సాదర్పణం 7.అర్కి(యముడు) జ్ఞానార్ణవమహాతంత్రం 8.చ్యవనమహర్షి – జీవదానతంత్రం 9.జనకమహారాజు – వైద్యసందేహ భంజనం 10.బుధుడు– సర్వసారతంత్రం 11.జాబాలమహర్షి – తంత్రసారకం 12.జాజలిముని–వేదాంగసారతంత్రం 13.పైలమహర్షి – నిదానతంత్రం 14.కరథముని – సర్వధర తంత్రం 15.అగస్త్యమహర్షి – ద్వైధఆయుర్వేదానికి ఎంతో ఘనమైన ప్రాశస్త్యాన్ని కల్పించారు.

వీరందరిలో సుప్రసిద్ధుడైనవాడు ధన్వంతరి. ఆయనతో పాటు మరికొంతమంది భాస్కర సంహిత ఆధారంగా వివిధరకాల చికిత్సా విధానాలని సవివరంగా తమదైన శైలిలో మానవలోకానికి అందించారు.

ముందుగా వ్యాధితత్త్వాన్ని గుర్తించటం, తరువాత ఆ వ్యాధిని సమూలంగా నాశనం చేయగలగటం తెలిసినవాడే మంచి వైద్యుడని చెప్పబడతాడు. ఆయుర్వేద శాస్త్రాన్ని బాగా తెలుసుకుని సమర్ధవంతంగా రోగాన్ని నివారించగలిగిన వైద్యుడు, ఆయుర్ధాయానికి కర్తకాలేడు.

**రోగాలు-కారణాలు :** అన్నిరకాల రోగాలకీ కారణం జ్వరం. ఈ జ్వరం అనేది శివస్వరూపం. అది ఎంతో వికృతంగా, భయంకరంగా వుంటుంది. దానికి మూడుపాదాలు, మూడుతలలు, ఆరుభుజాలు, తొమ్మిదికళ్ళు ఉంటాయి. జ్వరం రౌద్ర స్వరూపంతో వుంటుంది. అది యముడితో సమానమైనది.

జ్వరం రావటానికి ప్రధాన కారణం మందాగ్ని అనగా అజీర్ణం. దానికి కారణం వాత, పిత్త, శ్లేష్మాలు 1.వాతజ్వరం 2.పిత్తజ్వరం 3.శ్లేష్మజ్వరం 4.వాతపిత్త కఫాలదోషం వల్ల వచ్చిన జ్వరం అని జ్వరం నాలుగు విధాలు

అతిసారం, పాండు, కుష్ఠు, జలోదరం, ప్లీహం, శూల, జ్వరం, గ్రహణి, కాస, హలీమకం, గుల్మం, విషమేహం, కబ్జం, గోదం, మూత్రకృచ్ఛం, సన్నిపాతం, విఘూచి, ఇలా మానవులకి మొత్తం 64 రకాల రోగాలు కలుగుతాయి. ఇలాకలిగిన వ్యాధులన్నీ మృత్యువు అనే కన్యకి పుత్రులు, వార్ధక్యం అనేది ఆ మృత్యుకన్యకి పుత్రిక. ఈ ముసలితనం (వార్ధక్యం) అనే మృత్యుకన్య పుత్రిక తన సోదరులైన రకరకాల వ్యాధులతో కలిసి భూమండలమంతా సంచరిస్తూ వుంటుంది. యమనియమాలు పాటించేవారిని రోగనివారణోపాయాల్ని ఆచరించేవారిని చూసి మృత్యుకన్య పుత్రులు పుత్రికలు దూరంగా పారిపోతారు. అనగా వ్యాధులు, వార్ధక్యం అనేవి వారిని చేరవు అని భావం.

**వార్ధక్యనివారణ :** కళ్ళని నిత్యం నీళ్ళతో కడుక్కోవడం, నిత్యం శారీరక వ్యాయామం చేయటం, అరికాళ్ళనునూనెతో మర్ధించటం, చెవులో తరుచుగా నూనె వేసుకోవటం, తలని కుంకుడుకాయతో రుద్ధి శుభ్రపరచుకోవటం, వసంతఋతువులో ప్రతిరోజూ కొంతదూరం నడవటం, స్వల్పంగా వేడినీళ్ళని త్రాగటం, యుక్తవయసులో తన కన్నా చిన్న వయసు స్త్రీతో సంగమించటం చేసిన వారికి వార్ధక్యం(ముసలితనం) త్వరగారాదు.

- ✳ గ్రీష్మ ఋతువు(ఎండాకాలం)లో నదుల్లో చెరువుల్లో చల్లని నీళ్ళతో స్నానం చేస్తూ, చందనం కలిపిన నీటిని త్రాగుతూ చల్లగాలిని సేవించేవాడికి వార్ధక్యం రాదు.
- ✳ వర్షఋతువులో వేడినీళ్ళతో స్నానం చేయాలి. వర్షం నీటిని త్రాగకూడదు. వేళతప్పకుండా ఎక్కువ తక్కువలు లేకుండా ఆహారాన్ని భుజించాలి.
- ✳ శరదృతువులో ప్రతిరోజూ ఉదయంపూట చల్లగాలిలో తిరగకూడదు. సరస్సులో స్నానం చేస్తే మంచిది. గోరువెచ్చనినీళ్ళతో స్నానం శ్రేయస్కరం. మితమైన ఆహారాన్నే స్వీకరించాలి.
- ✳ హేమంతఋతువులో కూడా చెఋవు లేక నదిలో స్నానం చేస్తే మంచిది. ఈ ఋతువులో వేడిగా ఉండే కొత్త బియ్యంతో వండిన అన్నాన్ని తినాలి.
- ✳ శిశిరఋతువులో కూడా కొత్తబియ్యంతో వండిన అన్నాన్ని వేడిగా తినాలి. వేడినీళ్ళతో స్నానం చేస్తే మంచిది.
- ✳ బాగా ఆకలిగా వున్నప్పుడే భోజనం చేయాలి. బాగా దాహం వేసినప్పుడే నీళ్ళు త్రాగాలి. నిత్యంతాంబూలం సేవించాలి.
- ✳ పెరుగు, ముందురోజుతీసిన పాలని పెరుగుచేసి దానిద్వారా వచ్చే వెన్నని, (కొత్తవెన్న) కొత్తగా తయారుచేసిన నేయిని, కొత్త బెల్లాన్ని నిత్యం తినాలి. ఈవిధంగా నియమాలు పాటించిన వారికి వార్ధక్యం దరిచేరదు.

**వార్ధక్య కారణాలు :** ఎండినమాసం తినటం, తనకన్నా పెద్దవయసు స్త్రీలతో సంభోగించటం, ఉదయించే సూర్యుణ్ణి చూడటం, లేతపెరుగుని, రాత్రిపూట పెరుగుని తినటం, చెడ్డస్త్రీని, రజస్వల అయిన స్త్రీని, భర్త పుత్రులు లేని స్త్రీని, యాగం చేసిన శూద్రుడి భార్యని, ముట్లుడిగిపోయిన స్త్రీని కామించటం, వారితో కామసుఖం అనుభవించటం చేసే వారికి త్వరగా వార్ధక్యం మీదపడుతుంది.

**వ్యాధులకి కారణాలు :** మానవులు చేసే పాపాలకి, వారికి వచ్చే వ్యాధులకి దగ్గరి సంబంధం వుంది. మానవులు చేసే పాపాల వల్లే వారికి వార్ధక్యం,

వ్యాధులు కలుగుతున్నాయి. పాపం వల్ల ముందుగా వ్యాధులు కలిగితే ఆ వ్యాధుల వల్ల వార్ధక్యం వస్తోంది. ఆ పాపం వల్లే దుఃఖం ఇంకా ఎన్నోరకాల శారీరక మానసిక బాధలు వారికి కలుగుతున్నాయి. అందుకే ఇన్ని బాధలకి, వ్యాధులకీ కారణమైన పాపాల్ని ఎవరూ చేయకూడదు.

**వ్యాధినివారణ మార్గాలు :** స్వధర్మాన్ని ఆచరించేవాడికి, దైవ, గురు, బ్రాహ్మణ భక్తి ఉన్నవాడికి, తపస్సు, ధ్యానం చేసేవాడికి, వ్రతాలు, ఉపవాసదీక్షలు, పూజలు ఆచరించేవాడికి, పుణ్యతీర్థాలు, క్షేత్రాలు దర్శించేవాడికి వ్యాధులురావు.

**పైత్యకారణం :** బాగా ఆకలివేసినప్పుడు అన్నం (ఆహారం)తినాలి. అలా తినక ఆకలిని అణుచుకుంటే శరీరం లోపల ఉన్న మణిపూరక చక్రంలో పైత్యం పుడుతుంది. తాటి ముంజల్ని, మారేడు పండుని తిన్న వెంటనే నీళ్ళు త్రాగితే ప్రాణాల్ని పోగొట్టే పిత్తం ఏర్పడుతుంది. వేడినీళ్ళని తరుచుగా తలమీద పోసుకున్నా, భాద్రపదమాసంలో ఎక్కువగా చేదు(కాకర) వస్తువులు తిన్నా, పైత్యం శరీరంలో ఏర్పడుతుంది.

**పిత్తనాశకాలు :** పంచదారకలిపిన ధనియాలు, చల్లని నీళ్ళతో తడిపిన పిండి, శనగలు, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుమీగడ, బాగా మ్రగ్గిన తాటిపండు, మారేడుపండు, చెఱకు,పెసరకట్టుతోచేసిన చారు, పంచదార కలిపిన నువ్వులపిండి, అల్లం. ఈ వస్తువులన్నీ పిత్తాన్ని నశింపచేసి శరీరానికి బలాన్ని చేకూరుస్తాయి.

**శ్లేష్మకారణాలు :** అన్నంతిన్న వెంటనే స్నానం చేసినా, దాహం వేయకుండా నీళ్ళు త్రాగినా, నువ్వులనూనె, చిక్కటి ఉసిరి పండురసం, చద్ది అన్నం, ముందురోజు మజ్జిగ (పుల్లటి మజ్జిగ) పెరుగు, బాగాపండిన అరటిపండు, వర్షం నీళ్ళు, పంచదార కలిపిన నీళ్ళు, కొబ్బరినీళ్ళు, బాగా పండిన సన్నదోసకాయ, వర్షాకాలంలో నదుల్లో, చెరువుల్లో చేసేస్నానం ఇలాంటి వాటివల్ల శ్లేష్మం శరీరంలో ప్రకోపిస్తుంది. అది గనుక శరీరంలోకి చేరితే లోపలున్న వీర్యాన్ని పోగొడుతుంది. అది శరీరంలోని బ్రహ్మ రంధ్ర స్థానంలో చేరి శరీరం మొత్తాన్ని బాధిస్తుంది.

**శ్లేష్మనాశకాలు :** నీటి ఆవిరిని శరీరానికి పెట్టుకోవటం, ఎండిన పదార్థాలని తినటం, కరక్కాయ, బాగాపండని వెలగపండు, అరటిపండు, మిరియాలు, ధనియాలు, శొంఠి వేసి తయారుచేసిన కారప్పొడి, అధికంగా ఆహారాన్ని తీసుకోకుండా వుండటం, అధికంగా నీళ్ళు త్రాగకుండా వుండటం, నెయ్యికలిపిన రేచన చూర్ణాన్ని తినటం, పంచదార నెయ్యి కలిపి తినటం, మిరియాలు, పిప్పళ్ళు, శొంఠిజీవకం, తేనె ఇలాంటివన్నీ శ్లేష్మాన్ని తొలగిస్తాయి.

**వాతకారణాలు :** అన్నంతిన్న వెంటనే నడవటం, పరుగెత్తటం శరీర శ్రమకలిగేపనులు చేయటం, ఎండలో తిరగటం, అతిగా తిరగటం, అతిగా మైథునం చేయటం, వృద్ధస్త్రీలతో సంభోగించటం, మనస్తాపంతో ఆలోచించటం, మొరటుగా ప్రవర్తించటం, సరైన వేళకు ఆహారాన్ని తీసుకోకపోవటం, అందరితో పోట్లాడటం, ఇతరుల్ని బాధపెట్టటం, అతిగా భయపడటం, బాధపడటం, లాంటి వన్నీ శరీరంలో వాతాన్ని ప్రకోపింపచేస్తాయి. ఈ వాతరోగం శరీరంలోని ఆజ్ఞాచక్రం నుంచి పుడుతుంది.

**వాతహరాలు :** పండినఅరటిపళ్ళు, కొబ్బరినీళ్ళు, అప్పుడే చిలికి చేసిన మజ్జిగ, గేదెపెరుగు, పంచదారతో తయారుచేసిన ఆహారపదార్థాలు, చల్లటినీరు, నువ్వులనూనె, కొబ్బరి, ఖర్జూరం, తాటిపండు, వేడిగావున్న ఉసిరిరసం, గోరువెచ్చని నీళ్ళతో స్నానం చేయటం, మంచి చందనద్రవాన్ని సేవించటం, తామరాకులమీద పడుకోవటం, ఇవన్నీ వాతాన్ని నశింపచేస్తాయి. ఈ వాతరోగాలు 1.క్లేశజనితాలు – అనగా కష్టాలవల్ల వచ్చేవి 2.సంతాప జనితాలు – అనగా బాధపడుతూవుండటం వల్ల వచ్చేవి 3.కామజనితాలు – అతిగా కామసుఖాలు పొందటం వల్ల వచ్చేవి అని మూడు విధాలుగా వుంటాయి.

## మహాపురుష స్తోత్రం

పూర్వం మాలావతి అనే గంధర్వస్త్రీ తన భర్త అయిన ఉపబ్రంహణుడు మరణించగా, ఆయన్ని తిరిగి బ్రతికించుకోవటానికి మహాపురుషుడైన శ్రీకృష్ణుణ్ణి ఇలా స్తుతించింది.

వందే తం పరమాత్మానం సర్వకారణ కారణం ।
వినా యేన శవాః సర్వే ప్రాణినో జగతీ తలే ॥
నిర్లిప్తం సాక్షిరూపం చ సర్వేషాం సర్వకర్మసు ।
విద్యమానం న దృష్టం చ సర్వైః సర్వత్ర సర్వదా ॥
యేన సృష్టా చ ప్రకృతిః సర్వాధారా పరాత్పరా ।
బ్రహ్మవిష్ణు శివాదీనాం ప్రసూర్యా త్రిగుణాత్మికా ॥
జగత్ స్రష్టా  స్వయం బ్రహ్మ నియతో యస్య సేవయా ।
పాతా విష్ణుశ్చ జగతాం సంహర్తా శంకరః స్వయం ॥
ధ్యాయంతే యం సురాః సర్వే మునయో మనవస్తథా ।
సిద్ధాశ్చ యోగినః సంతః సంతతం ప్రకృతేః పరం ॥
సాకారం చ నిరాకారం పరం స్వేచ్ఛామయం ప్రభుం ।
వరం వరణ్యం వరదం వరార్హం వరకారణం ॥
తపఃఫలం తపోబీజం తపసాం చ ఫలప్రదం ।
స్వయం తపఃస్వరూపం చ సర్వరూపంచ సర్వతః ॥
సర్వాధారం సర్వబీజం కర్మ తత్కర్మణాం ఫలం ।
తేషాం చ ఫలదాతారం తద్బీజం క్షయకారణం ॥
స్వయం తేజః స్వరూపం చ భక్తానుగ్రహవిగ్రహం ।
సేవాధ్యానం న ఘటతే భక్తానాం విగ్రహం వినా॥
తత్తేజోమండలాకారం సూర్యకోటి సమప్రభం ।
అతీవ కమనీయం చ రూపం తత్ర మనోహరం॥
నవీననీరదశ్యామం శరత్పంకజలోచనం ।
శరత్పార్వణ చంద్రాస్య మీషద్దాస్య సమన్వితం ॥
కోటికందర్పలావణ్యం లీలాధామ మనోహరం ।
చందనోత్క్షిత సర్వాంగం రత్నభూషణ భూషితం ॥

ద్విభుజం మురలీహస్తం పీతకౌశేయవాససం ।
కిశోరవయసం శాంతం రాధాకాంతమనంతకం ॥

గోపాంగనా పరివృతం కుత్రచిన్నిర్జనే వనే ।
కుత్రచిద్రాసమధ్యస్థం రాధయా పరిసేవితం ॥

కుత్ర చిద్గోపవేషం చ వేష్టితం గోపబాలకైః ।
శతశృంగాచలోత్కృష్టే రమ్యే బృందావనే వనే ॥

నికరం కామధేనూనాం రక్షంతం శిశురూపిణం ।
గోలోకే విరజాతీరే పారిజాతవనేవనే ॥

వేణుం క్వణంతం మధురం గోపిసమ్మోహకారణం ।
నిరామయే చ వైకుంఠే కుత్రచిచ్చ చతుర్భుజం ॥

*(శ్లో. 9-21, అధ్యా-8, ప్ర.ఖం)*

ఈ దివ్యస్తోత్రాన్ని పూజసమయంలో పఠించిన వారికి శ్రీకృష్ణుడి అనుగ్రహం, ధర్మార్ధకామమోక్షాలఫలితం లభిస్తుంది. ఎవరు ఏ కోరికతో ఈ స్తోత్రాన్ని పఠిస్తారో వారికి ఆ కోరికలు తీరుతాయి.

## శ్రీకృష్ణ మంత్రం

### ఓం నమో భగవతేరాసమండలేశ్వరాయ స్వాహా

దివ్యమైన ఈ శ్రీకృష్ణ మంత్రం పదహారు అక్షరాలతో భక్తులకి కల్పతరువులా వుంటుంది. ఈ మంత్రాన్ని పూర్వం గోలోకంలో, రాసమండల ప్రదేశంలో బ్రహ్మదేవుడికీ, శంకరుడికీ, ధర్మదేవతకీ, శ్రీకృష్ణుడు స్వయంగా ఉపదేశించాడు.

## శ్రీకృష్ణ కవచం

అస్య శ్రీ శ్రీకృష్ణ కవచస్య, శ్రీహరిఋషిః, గాయత్రీ ఛందః, శ్రీకృష్ణోదేవతా, ధర్మార్ధకామమోక్షేషు వినియోగః

ప్రణవో మే శిరః పాతు రామేశ్వరాయ చ ।
ఫాలం పాయాన్నేత్రయుగ్మం నమో రాధేశ్వరాయ చ ॥

కృష్ణః పాయాత్ శ్రోత్రయుగ్మం హే హరే ఘ్రాణమేవ చ ।
జిహ్వికాం వహ్ని జాయా తు కృష్ణాయేతి చ సర్వతః ॥

శ్రీకృష్ణాయ స్వాహేతి చ కంఠం పాతు షడక్షరః ।
హ్రీం కృష్ణాయ నమో వక్త్రం క్లీం పూర్వశ్చ భుజద్వయం ॥

నమో గోపాంగనేశాయ స్కంధావష్టాక్షరో ௨వతు ।
దంతపంక్తిమోష్ఠయుగ్మం నమో గోపీశ్వరాయచ ॥

ఓం నమోభగవతే రాసమండలేశాయ స్వాహా ।
స్వయం వక్షః స్థలం పాతు మంత్రో௨యం షోడశాక్షరః ॥

ఐం కృష్ణాయ స్వాహేతి చ కర్ణయుగ్మం సదా ௨వతు ।
ఓం విష్ణవే స్వాహేతి చ కపోలం సర్వతో௨వతు ॥

ఓం హరయే నను ఇతి పృష్ఠం పాదం సదా௨వతు ।
ఓం గోవర్ధనధారిణే స్వాహా సర్వశరీరకం ॥

ప్రాచ్యాం మాం పాతు శ్రీకృష్ణః ఆగ్నేయ్యాం పాతు మాధవః ।
దక్షిణే పాతు గోపీశో నైఋత్యాం నందనందనః ॥

వారుణ్యాం పాతు గోవిందో వాయువ్యాం రాధికేశ్వరః ।
ఉత్తరే పాతు రాసేశః ఐశాన్యామచ్యుతః స్వయం॥

సతతం సర్వతః పాతు పరో నారాయణః స్వయం ।
**ఫలశ్రుతి :** ఇతి తే కథితం బ్రహ్మన్ కవచం పరమాద్భుతం ॥

మమ జీవన తుల్యం చ యుష్మభ్యం దత్తమేవ చ ।
అశ్వమేధ సహస్రాణి వాజపేయ శతాని చ ॥

కళాం నార్హంతి తాన్యేవ కవచస్యైవ ధారణాత్ ।
గురుమభ్యర్చ్య విధివత్ వస్త్రాలంకార చందనైః ॥

స్నాత్వా తం చ నమస్కృత్య కవచం ధారయేత్సుధీః ।
కవచస్య ప్రసాదేన జీవన్ముక్తో భవేన్నరః ॥
యది స్యాత్సిద్ధకవచో విష్ణురేవ భవేద్ద్విజ ॥

*(శ్లో.26-38, అధ్యా-19, ప్ర.ఖం)*

(ఈ కవచాన్ని 3 లక్షల సార్లు పారాయణ చేస్తే సిద్ధిస్తుంది. అలా పఠించి సిద్ధిపొందినవాడు, శ్రీకృష్ణుడితో సమానుడౌతాడు.

## శివుడి మంత్రం

### ఓం నమో భగవతే శివాయ స్వాహా

పన్నెండు అక్షరాల శివమంత్రాన్ని పూర్వం బ్రహ్మదేవుడు రావణాసురుడికి ఉపదేశించాడు. తరువాత శంకరుడు ఇదే మంత్రాన్ని బాణాసురుడికి ఉపదేశించగా, ఆయనదాన్ని దుర్వాసమహర్షికి చెప్పాడు. అనంతరకాలంలో ఈ శివమంత్రాన్ని పుష్కరక్షేత్రంలో వశిష్ఠమహర్షి గంధర్వరాజైన ఉపబర్హణుడికి బోధించాడు. ఈ శివమంత్రాన్ని జపించటానికి ముందు శివుడికి నైవేద్యం పెట్టి ఆ తరువాత జపించాలి.

## శ్రీ శివకవచం

అస్యశ్రీ శివకవచ స్తోత్రస్య ప్రజాపతి ఋషిః, గాయత్రీఛందః, శ్రీపరమేశ్వరో దేవతా, ధర్మార్థకామమోక్షేషు జపే వినియోగః.

శంభుర్మే మస్తకం పాతు ముఖం పాతు మహేశ్వరః ।
దంతంక్తిం నీలకంఠోఽస్యధరోష్ఠం హరః స్వయం ॥
కంఠం పాతు చంద్రచూడః స్కంధౌ వృషభవాహనః ।
వక్షస్థలం నీలకంఠః పాతు పృష్ఠం దిగంబరః ॥
సర్వాంగం పాతు విశ్వేశః సర్వదిక్షు చ సర్వదా ।
స్వప్నే జాగరణే చైవ స్థాణుర్మే పాతు సంతతం ॥

ఇతి తే కథితం బాణ కవచం పరమాద్భుతం ।
యస్మై కస్మై న దాతవ్యం గోపనీయం ప్రయత్నతః ॥
యత్ఫలం సర్వతీర్థానాం స్నానేన లభతే నరః ।
తత్ఫలం లభతే నూనం కవచస్యైవ ధారణాత్ ॥
ఇదం కవచమజ్ఞాత్వా భజేన్మాం యః సుమందధీః ।
శతలక్షప్రజప్తోఽపి న మంత్రః సిద్ధిదాయకః ॥

*(శ్లో. 44-54, అధ్యా-19, ప్ర.ఖం)*

పరమపవిత్రమైన ఈ శివకవచాన్ని పరమేశ్వరుడు స్వయంగా బాణాసురుడికి ఉపదేశించాడు. ఈ దివ్యకవచాన్ని అయిదు లక్షల సార్లు పారాయణ చేస్తే సిద్ధిస్తుంది. ఇద్ది సిద్ధించుకున్నవాడు శివానుగ్రహంతో సకల సుఖభోగాలు పొందుతాడు. చివరికి శివుడితో సమానుడవుతాడు.

## బాణాసురకృత శివస్తుతి

వందే సురాణాం సారం చ సురేశం నీలలోహితం ।
యోగీశ్వరం యోగ బీజం యోగినాం చ గురోర్గురుం ॥
జ్ఞానానందం జ్ఞానరూపం జ్ఞానబీజం సనాతనం ।
తపసాం ఫలదాతారం దాతారం సర్వసంపదాం ॥
తపోరూపం తపోబీజం తపోధనధనం వరం ।
వరం వరేణ్యం వరదమీడ్యం సిద్ధగణైర్వరైః ॥
కారణం భుక్తి ముక్తీనాం నరకార్ణవతారణం ।
అశుతోషం ప్రసన్నాస్యం కరుణామయసాగరం ॥
హిమచందన కుందేందు కుముదాంభోజ సన్నిభం ।
బ్రహ్మజ్యోతిః స్వరూపం చ భక్తానుగ్రహ విగ్రహం ॥
విషయాణాం విభేదేన బిభ్రతం బహురూపకం ।
జలరూపమగ్నిరూపమాకాశరూప మీశ్వరం ॥

వాయురూపం చంద్రరూపం సూర్యరూపం మహత్ప్రభుం ।
ఆత్మనః స్వపదం దాతుం సమర్థమవలీలయా ॥
భక్తజీవనమీశం చ భక్తానుగ్రహకాతరం ।
వేదా న శక్తా యం స్తోతుం కిమహం స్తౌమి తం ప్రభుం ॥
అపరిచ్ఛిన్న మీ శానమహో వాఙ్మనసోః పరం ।
వ్యాఘ్రచర్మాంబరధరం వృషభస్థం దిగంబరం ॥
త్రిశూలపట్టి శధరం సస్మితం చంద్రశేఖరం ॥
ఇత్యుక్త్వా స్తవరాజేన నిత్యం బాణః సుసంయుతః ।
ప్రాణమచ్ఛంకరం భక్త్యా దుర్వాసాశ్చ మునీశ్వరః ॥
ఇదం దత్తం వసిష్ఠేన గంధర్వాయ పురామునే ।
కథితం చ మహాస్తోత్రం శూతినః పరమాద్భుతం ॥

*(శ్లో.56-68, అధ్యా-19, ప్ర.ఖం)*

బాణాసురుడు చేసిన ఈ శంకరస్తుతిని భక్తిగా పఠించిన వాడికి సకల పుణ్యతీర్థాలలో స్నానం చేసిన ఫలితం లభిస్తుంది. ఒక సంవత్సరం పాటు శ్రద్ధగా ఈ స్తోత్రాన్ని పఠించినా విన్నా సంతానం లేనివారికి సంతానభాగ్యం కలుగుతుంది. వ్యాధులతో పీడించబడేవారు కూడా సంపూర్ణంగా స్వస్థత పొందుతారు. అవివాహితులకి ఒక నెలలోనే వివాహం జరుగుతుంది. విద్యార్థి మంచిబుద్ధిని, విద్యని పొందుతాడు. దరిద్రుడు ధనవంతుడవుతాడు.

## మహేశ్వరుడు చెప్పిన పరబ్రహ్మ స్వరూపం

పూర్వం నారదుడు పరమేశ్వరుణ్ణి దర్శించి “ప్రభూ! పరమేశ్వరా! పరబ్రహ్మ ఎవరు? ఆయనకి ఆకారం వున్నదా? లేక ఆయన నిరాకారుడా? పరబ్రహ్మకున్న విశేషణాలు ఏవి? వేదాల్లో శాస్త్రాల్లో పరబ్రహ్మ స్వరూపం ఏవిధంగా చెప్పబడింది? అని ప్రశ్నించాడు. నారదుడి ప్రశ్నలు విని శివుడు చిరునవ్వులు చిందిస్తూ పరబ్రహ్మ స్వరూపాన్ని ఇలా వివరించటం ప్రారంభించాడు.

పరబ్రహ్మ సనాతనుడు. ఆ పరబ్రహ్మే పరమాత్మగా చెప్పబడతాడు. పరమాత్మకి స్వరూపం వుంది. అది జీవులందరి శరీరాల్లో వుంటుంది. అక్కడ వున్న పరమాత్మ జీవులు చేసే వివిధ రకాల కర్మలకి సాక్షిగా వుంటుంది.

జీవుడిలో వున్న పంచప్రాణాలు శ్రీమహావిష్ణువు స్వరూపం. ప్రజాపతి అయిన బ్రహ్మదేవుడు మనోరూపుడు పరమేశ్వరుడనైన నేను జ్ఞానస్వరూపుడిని, సర్వేశ్వరి అయిన శక్తి ప్రకృతి స్వరూపిణి. విష్ణువు, బ్రహ్మ, ప్రకృతి, నేను ఆ పరమాత్మకి (పరబ్రహ్మకి) అధీనులం. ఆయన ఎక్కడ వుంటే మేమూ అక్కడ వుంటాం.

పరమాత్మ ప్రతిబింబమే జీవాత్మ. జీవుడు తానుచేసిన కర్మ ఫలితాలన్నిటినీ అనుభవిస్తాడు. సూర్య చంద్రుల ప్రతిబింబాలు నీళ్ళతో నిండిన కుండల్లో కనిపించినట్టే, పరమాత్మ ప్రతిబింబమైన జీవాత్మకూడా పరమాత్మ ఉన్నచోటే వుంటుంది. ఆనీళ్ళ కుండ పగిలిపోతే అందులో ప్రతిబింబించిన సూర్యచంద్రుల బింబాలు మాయమైపోయినట్టే, ప్రళయకాలంలో జీవాత్మలు పరమాత్మలో లీనమౌతాయి.

పరబ్రహ్మ ఒక్కడే! ప్రళయంసంభవించినప్పుడు మేమంతా ఆయనలో లీనమైపోతాం. ఆ పరబ్రహ్మే ఎండాకాలం మధ్యాహ్నం వెలిగే కోటిసూర్యుల కాంతిలో వెలుగొందే మండలాకారంలో, జ్యోతి స్వరూపంతో వుంటాడు. ఆయన జ్యోతి విశ్వమంతా వ్యాపించివుంది. ఆ పరబ్రహ్మని యోగులు చంద్రుణ్ణి చూసినంత సులభంగా దర్శిస్తారు.

యోగులందరూ పరబ్రహ్మని సనాతనుడని కీర్తిస్తారు. సర్వమంగళాకారుడు, సత్యస్వరూపుడు అయిన ఆ పరమాత్మని యోగులు నిత్యం ధ్యానిస్తూ వుంటారు. పరబ్రహ్మ నిరీశ్వరుడు, ఎలాంటి ఆకారం లేనివాడు. అందరికీ ప్రధానమైనవాడు. ఆయన ప్రకృతికన్నా శ్రేష్ఠమైనవాడు, ఈ సమస్తానికీ కారణమైన ప్రకృతి సైతం చివరికి ఆయనలోనే లీనమైపోతుంది.

సృష్టి చేయాలని భావించిన పరబ్రహ్మ అంశమే పురుషుడు. ఆ పురుషుడు సగుణ స్వరూపుడు. సత్త్వరజస్తమోగుణాలనే ప్రకృతి ఆ పురుషుడికి నీడలాంటిది. కుమ్మరివాడు మట్టితో కుండలు చేసినట్టు పరబ్రహ్మ అంశ అయిన ఆ పురుషుడు ప్రకృతి ద్వారా సకల సృష్టినీ చేస్తున్నాడు.

నారదా! పరబ్రహ్మతత్త్వం గురించి వేదాల్లో కూడా చెప్పబడింది. సృష్టిలో వున్న సకలజీవులకీ ఆత్మలాంటివాడు పరబ్రహ్మ. జీవుడిలో వున్న పరబ్రహ్మకి ఎలాంటి వికారాలు వుండవు. అతడు జీవులుచేసే పనులకి సాక్షీభూతుడుగా వుంటాడు. ఆ ఆత్మ అంతటా వ్యాపించి వుంటుంది. అన్నిటికీ మూలం పరమాత్మే. అలాగే సృష్టిలో అన్నిటికీ కారణభూతమైన ప్రకృతి ఆ పరబ్రహ్మకి శక్తి స్వరూపిణి ఆమె వల్లనే పరబ్రహ్మ కూడా శక్తిమంతుడవుతున్నాడు.

యోగులందరూ పరబ్రహ్మని తేజస్వరూపుడుగా భావించి దర్శిస్తారు. ధ్యానిస్తారు. కానీ నా (శివుడి)భక్తులు, వైష్ణవులు (శ్రీకృష్ణుడిభక్తులు) పరబ్రహ్మని తేజోస్వరూపుడుగా భావించరు. వైష్ణవులు పరబ్రహ్మలో వుండే తోజోరూపాన్ని చూసి అసలు పురుషుడు లేకుండా ఇంత తేజస్సు ఎక్కడినుంచి వచ్చింది? అని ఆలోచించి ఆ తేజస్సుకి మూలకారకుడైన పరమాత్మని ఒక సుందరరూపుడుగా (శ్రీకృష్ణుడుగా) భావించి ధ్యానిస్తారు.

**గోలోకం :** నారదా! కోటి సూర్యుల కాంతితో వెలిగిపోతూ మండలాకారంగా వున్న ఆ దివ్య తేజోమండలం (పరబ్రహ్మ) మధ్యలో 'గోలోకం' ప్రచ్ఛన్నంగా వుంది. ఆదివ్యగోలోకం లక్షకోట్ల యోజనాల వైశాల్యంతో విస్తరించి వుంది. ఆలోకంలో రత్నాలు ఇంద్రనీలమణులు పొదిగిన భవనాలున్నాయి. నిత్యం ఎంతో మంది గోపికలు ఆ లోకంలో సంచరిస్తూ వుంటారు. పరమపవిత్రమైన గోలోకం వైకుంఠానికి ఏభై యోజనాల దూరంలో వున్నది. అక్కడ, గోవులు, గోపికలు, గోపకులు, కలవృక్షాలు, బృందావనం, విరజానది ఉంటాయి. బంగారం పూలు పూసే దివ్యపారిజాతవనాలు లక్షకోట్లు ఆశ్రమాలు మరెన్నో సుందరమైన ప్రాకారాలు వింత వింత శోభలతో అలరారుతున్నాయి.

అత్యంత వైభవంతో వెలుగొందే ఆ గోలోకంలో కౌస్తుభమణితో ప్రకాశించే రాజగృహంవున్నది. ఆమందిరంలోకి ప్రవేశించేమెట్లు మణులతో పొదగబడి వున్నాయి. దాని ద్వారాలు కూడా నవరత్నాలతో మెరుస్తున్నాయి. చిత్ర విచిత్రమైన దర్పణాలతో ఆ మందిరం ప్రకాశిస్తోంది. ఆదివ్య భవనానికి మొత్తం 16 ద్వారాలున్నాయి. భవనంలోపల రత్నాలతో వెలిగించిన దీపాలు దివ్యకాంతుల్ని వెదజల్లుతున్నాయి.

ఆ మందిరంలోనే ఒక ఉన్నత సింహాసనం వుంది. దానిమీద నల్లని మేఘంలాంటి రంగుతో ప్రకాశించేవాడు, నవయువకుడు, శరత్కాలంలో మధ్యాహ్నం కనిపించే సూర్యుడి వెలుగులాంటి నేత్రాలు కలవాడు, శరత్కాలంలో పున్నమిచంద్రుడులాంటి ముఖారవిందంతో శోభించేవాడు, కోటిమన్మథుల లావణ్యంతో, కోటిచంద్రులకాంతితో, చిరునవ్వుతో, చేతిలో మురళిని, శరీరంమీద పట్టు పీతాంబరాలని, ధరించినవాడు, చందనాన్ని వంటికి పూసుకుని మాలతీపుష్పాలమాలని, వనమాలని, దివ్యాభరణాలని, తలమీద నెమలిపింఛంతో కూడిన కిరీటాన్ని, చేతులకి రత్నాలతో చేయబడ్డ దండ కడియాలని, ధరించినవాడు, నిత్యం బ్రహ్మాది దేవతలచేత మనీంద్రులచేత నమస్కరించబడేవాడు అయిన శ్రీకృష్ణ పరబ్రహ్మ ఆసీనుడైవుంటాడు.

రాసేశ్వరుడు రాధాప్రియుడు అయిన ఆ పరమాత్మనే వైష్ణవభక్తులు నిత్యం తమ మనసుల్లో ధ్యానిస్తూ వుంటారు. అంతేకాని పరబ్రహ్మని రూపరహితుడుగా వారు ఎప్పుడూ భావించారు. నారదా! ఆ పరబ్రహ్మ అక్షర స్వరూపుడు, సనాతనుడు, స్వేచ్ఛామయుడు, నిర్గుణుడు, నిరంజనుడు, కూడా అంతేకాదు, ఆయన సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సకల సిద్ధులూ కలిగినవాడు అలాంటి కృష్ణ పరమాత్మ రెండు భుజాలతో గోపాలుడి రూపంతో గోపికలందరితో కలిసి నివసిస్తుంటాడు. గోలోకనాయిక రాధాదేవికి ప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణుడు సర్వ పరిపూర్ణుడు. ఆయన అందరి ఆత్మల్లో అవ్యక్తంగానూ వుంటాడు. ప్రత్యక్షంగా కూడా సంచరిస్తుంటాడు.

'కృష్' అంటే సమస్తము, 'న' అంటే 'ఆత్మ' అని కృష్ణుడు అంటే సమస్తమూ నిండిన ఆత్మ, సర్వాత్ముడు అని అర్థం. అలాగే 'కృష్' అంటే సమస్తం, 'న' అంటే 'ఆది' అనే అర్థం కూడా వుంది. దీని ప్రకారం కృష్ణ అంటే ఆదిపురుషుడని సర్వత్రావ్యాపించినవాడు అని భావించవచ్చు.

నారదా! గోలోకనాయకుడైన ఆ శ్రీకృష్ణుడే పరబ్రహ్మ. ఆయనే పరమాత్మ. ఆ పరమపురుషుడే తన అంశతో శ్వేతద్వీపంలోని వైకుంఠంలో విష్ణుమూర్తిగా అవతరించి లోకాలన్నిటినీ రక్షిస్తూ పోషిస్తున్నాడు. మేమందరం నిత్యం ఆ పరబ్రహ్మనే ధ్యానిస్తాం" అని పరమేశ్వరుడు నారద మహర్షికి పరబ్రహ్మ స్వరూపాన్ని వివరించి చెప్పాడు.

## పంచ ప్రకృతులు

పూర్వం నారదమహర్షి ప్రశ్నించగా నారాయణుడు ఆయనకి ప్రకృతి స్వరూపాన్ని పంచప్రకృతుల స్వరూప స్వభావాలని ఇలా వివరించాడు.

**ప్రకృతి :** నారదా! 'ప్రకృతి' స్వరూపం గురించి సమగ్రంగా సంపూర్ణంగా ఎవరూ చెప్పలేరు. వీలైనంతవరకూ చెబుతాను విను – 'ప్ర' అంటే శ్రేష్ఠమైన అని 'కృతి' అంటే సృష్టి అని అర్థం. 'ప్రకృతి' అంటే సృష్టిలో అందరికన్నా శ్రేష్ఠమైనదని భావం. మరోరకంగా చెప్పాలంటే 'ప్ర' అంటే సత్త్వగుణం, 'కృ'అంటే రజో గుణం, 'తి' అంటే తమోగుణం అని అర్థం. అనగా సత్త్వ రజస్తమోగుణాలనే త్రిగుణస్వరూపిణి అని ప్రకృతికి అర్థం చెప్పుకోవచ్చు. అదేవిధంగా 'ప్ర' అంటే ప్రథమం అని మరో అర్థం వుంది. 'కృతి' అంటే సృష్టి అని కదా! దీన్ని బట్టి ప్రకృతి అంటే సృష్టికి ప్రథమంలో వున్నది. అని భావించవచ్చు.

**ప్రకృతి పరిణామం :** పరబ్రహ్మ తన యోగశక్తితో రెండు రూపాల్ని ధరించాడు. ఆరెండు రూపాల్లో కుడిభాగం పురుషుడుగా, ఎడమభాగం ప్రకృతిగా మారాయి. పరమాత్మనుంచి ఆవిర్భవించిన ప్రకృతి మాయాస్వరూపిణి. సనాతనమైనది. పరబ్రహ్మ నుంచే ఆ ప్రకృతి ఆవిర్భవించింది. కాబట్టి యోగులు, మహర్షులు, తత్త్వజ్ఞులు ఈ సమస్తం బ్రహ్మ స్వరూపమే అని భావిస్తారు.

పరమపురుషుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మ సృష్టి చేయాలని భావించగా అప్పుడే పరమేశ్వరి అయిన మూల ప్రకృతి ఆయన నుంచి ఆవిర్భవించింది. శ్రీకృష్ణుడి ఆజ్ఞతో ఆ మూల ప్రకృతి భక్తుల్ని, లోకాల్ని అనుగ్రహించటానికి అయిదు దివ్యరూపాల్ని ధరించింది.

## పంచ ప్రకృతి స్వరూపాలు

ఆదిపరాశక్తి ఆ జగన్మాత శ్రీదుర్గాదేవి, శ్రీలక్ష్మీదేవి, శ్రీసరస్వతీదేవి, శ్రీగాయత్రీదేవి, శ్రీరాధాదేవి అని ఐదు దివ్యస్వరూపాల్ని ధరించింది. ఆదిప్రకృతి పూర్ణాంశతో ఏర్పడిన ఈ ఐదుస్వరూపాల్లో, మొదటి స్వరూపమైన శ్రీదుర్గాదేవి.

గణేశమాతా దుర్గాయా శివరూపా శివప్రియా ।
నారాయణీవిష్ణుమాయా పూర్ణబ్రహ్మస్వరూపిణీ ॥

*(బ్రహ్మవైవర్తం–ద్వితీయఖండం–శ్లో॥14)*

శివరూపిణిగా, శివప్రియగా, నారాయణీ స్వరూపిణిగా, విష్ణుమాయగా, గణేశుడి తల్లిగా, పూర్ణబ్రహ్మ స్వరూపిణిగా దేవతలందరిచేతా పరివిధాలుగా స్తుతించబడింది. అదేవిధంగా ఆదిప్రకృతి ధరించిన ఇతర స్వరూపాలు కూడా ఎంతో మహిమాన్వితమైన దేవతలుగా, భక్తజనులందర్నీ అనుగ్రహించే దయాస్వరూపిణులుగా, లోకంలో ప్రసిద్ధిచెందాయి. వారి దివ్యమంగళ స్వరూపాలు గురించి తెలుసుకుంటే మన పాపాలు హరిస్తాయి.

**1. శ్రీదుర్గాదేవి :** సర్వమంగళ స్వరూపిణిగా సనాతనిగా, సర్వాధిష్ఠాత్ర దేవిగా బ్రహ్మాదిదేవతలందరిచేత పూజించబడే దుర్గాదేవి ఆదిప్రకృతి ధరించిన స్వరూపాల్లో మొదటిది. ఆ దుర్గాదేవి స్వరూపం ఎలాంటిదంటే?

ధర్మసత్యాపుణ్యకీర్తి ర్యశో మంగళదాయినీ ।
సుఖమోక్షహర్షదాత్రీ శోకార్తి దుఃఖనాశినీ ॥
శరణాగతదీనార్త పరిత్రాణ పరాయణా ।
తేజఃస్వరూపాపరమా తదధిష్ఠాతృదేవతా ॥

సర్వశక్తి స్వరూపాచ శక్తిరీశస్య సంతతమ్ ।
సిద్ధేశ్వరీ సిద్ధిరూపా సిద్ధిదా సిద్ధిరీశ్వరీ ॥

బుద్ధిర్నిద్రాక్షుత్పిపాసా ఛాయాతంద్రాదయాస్మృతిః ।
జాతిఃక్షాంతిశ్చ భ్రాంతిశ్చ శాంతిఃకాంతిశ్చ చేతనా ॥

తుష్టిః పుష్టి స్తథాలక్ష్మీ ర్ధృతిర్మాయా తథైవచ ।
సర్వశక్తిస్వరూపా సా కృష్ణస్య పరమాత్మనః ॥

ఉక్తఃశృతౌ గుణశ్చాతిస్వల్పోయథాగమమ్ ।
గుణోఽ స్త్యనంతోఽ నంతాయా అపరాంచనిశామయ ॥

*(బ్రహ్మవైవర్తం-ద్వితీయఖండం-శ్లో॥16-21)*

ధర్మాన్ని పుణ్యాన్ని, కీర్తిని శుభమంగళాల్ని, సుఖాల్ని, మోక్షాన్ని, ఆనందాన్ని కలిగించి మనదుఃఖాలనన్నిటినీ నాశనం చేసేది. తనని శరణు అని వేడుకున్న దీనుల్ని, ఆర్తుల్ని నిత్యం రక్షించే దయాస్వరూపిణి, తేజోరూపంతో, అగ్నివంటి వర్ణంతో ప్రకాశించేది, శ్రీకృష్ణుని అధిష్ఠాతృదేవత, సర్వశక్తి రూపిణి, పరమేశ్వరుడి పరాశక్తి, అష్టసిద్ధులకీ ఈశ్వరీ, శ్రీ దుర్గాదేవి. అంతేకాదు ఈ సృష్టిలో సకల జీవులందరికీ సంబంధించిన బుద్ధి, నిద్రా, ఆకలి దప్పికలు, నీడలు, ఏమరుపాటు, జ్ఞాపకాలు, దయ, జాలి, భ్రాంతి, శాంతి, వెలుగు, చైతన్యం, తుష్టి, పుష్టి, ఐశ్వర్యం, ధైర్యం, మాయ ఇవన్నీ దుర్గాభవానీ స్వరూపాలే, అటువంటి దుర్గాభవానీదేవి శ్రీకృష్ణభగవానుడి స్వరూపశక్తిగా, వేదాల్లో - అనంతగుణసంపన్నగా, సంసారసాగరాన్ని దాటించే నావగా, వర్ణించబడింది.

**2. శ్రీలక్ష్మీదేవి :** శుద్ధసత్త్వ స్వరూపిణిగా, ఐశ్వర్యప్రదాయినిగా, అష్టలక్ష్మీ స్వరూపిణిగా, కీర్తించబడిన శ్రీలక్ష్మీదేవి మూలప్రకృతి ధరించిన దివ్యస్వరూపాల్లో రెండోది. శ్రీవిష్ణుహృత్కమలవాసినియైన ఆదేవి దివ్య స్వరూపం ఈవిధంగా వుంటుంది.

శుద్ధ సత్త్వస్వరూపాయా పద్మా సా పరమాత్మనః ।
సర్వసంసత్స్వరూపా సా తదధిష్ఠాతృదేవతా ॥

కాంతాఽతిదాంతా శాంతాచ సుశీలా సర్వమంగళా ।
లోభమోహ కామరోష మదాహంకారవర్జితా ॥

భక్తాఽ నురక్తా పత్యుశ్చ సర్వాభశ్చ పతివ్రతా ।
ప్రాణతుల్యా భగవతః ప్రేమపాత్రం ప్రియంవదా ॥

సర్వసస్యాత్మికాదేవీ జీవనోపాయ రూపిణీ ।
మహాలక్ష్మిశ్చ వైకుంఠే పతిసేవరతా సతీ ॥

స్వర్గేచస్వర్గలక్ష్మిశ్చ రాజ్యలక్ష్మీశ్చ రాజసు ।
గృహేషుగృహలక్ష్మిశ్చ మర్త్యానాం గృహిణాంతథా ॥

సర్వప్రాణిషుద్రవ్యేషు శోభారూపామనోహరా ।
కీర్తిరూపాపుణ్యవతాం ప్రభారూపానృపేషు చ ॥
వాణిజ్యరూపావణిజాం పాపినాంకలహాంకురా ।
దయారూపాచ కథితావేదోక్తా సర్వసమ్మతా ॥

*(బ్రహ్మవైవర్తం- ద్వితీయఖండం-శ్లో॥22-28)*

శుద్ధసత్త్వ గుణస్వరూపిణి, శ్రీకృష్ణపరమాత్మకి అధిష్ఠాతృదేవత, సర్వ సంపదలరూపంతో ప్రకాశించే పద్మాసని శ్రీలక్ష్మిదేవి. ఇంకా చెప్పాలంటే శాంతి, కాంతి, దాంతి, మంచిగుణం కలిగింది, సర్వమంగళాల్ని కలిగించేది, లోభం, మోహం, కామం, రోషం, మదం, అహంకారం, లాంటి దుర్లక్షణాలేవీ లేని, సద్గుణసంపన్నురాలైన ఈ తల్లి, భక్తుల్ని ప్రేమించేదిగా పతికి ప్రియమైనదిగా, సేవలుచేసేదిగా, పతివ్రతల్లో గొప్పదిగా, విష్ణుమూర్తికి ప్రాణ ప్రదమైనదిగా, కీర్తించబడింది.

అటువంటి శ్రీలక్ష్మీదేవి, సకలజీవుల బ్రతుకుతెరువు కోసం, వారిజీవనోపాయం కోసం, వైకుంఠంలో మహాలక్ష్మిగా, భూలోకంలో సస్య (ధాన్య) రూపంతో ధాన్యలక్ష్మిగా, స్వర్గలోకంలో స్వర్గలక్ష్మిగా, రాజ్యాల్లో రాజ్యలక్ష్మిగా, భక్తుల ఇళ్ళలో గృహలక్ష్మిగా, వివిధరూపాల్ని ధరించి ఈ సృష్టిలోని సకలప్రాణుల జీవితాల్లో వెలుగులు వెదజల్లుతూ వుంటుంది.

ప్రకాశవంతంగా వుండే సమస్తమైన వస్తువుల్లో, శోభాయమానమైన రూపంలో విరాజల్లుతూ వుంటుంది. అలాగే పుణ్యంచేసిన వారికి కీర్తిరూపంతో, రాజుల్లో తేజస్సురూపంతో, వైశ్యుల్లో వాణిజ్యరూపంతో, పాపాత్ముల ఇళ్ళలో కలహాలు, ద్వేషాలరూపంతో, పరోపకారపరాయణుల్లో దయాస్వరూపంతో ప్రకాశిస్తూ వుంటుంది.

**3. శ్రీసరస్వతీదేవి :** చదువుల తల్లిగా, జ్ఞానాన్ని ప్రసాదించే విజ్ఞానరూపిణిగా, సమస్తకళల్ని ప్రసాదించే వరదాయినిగా లోకంలో పూజించబడే శ్రీ సరస్వతీదేవి మూలప్రకృతి ధరించిన దివ్య స్వరూపాల్లో మూడవది. మంజుల వాగ్విలాసిని అయిన ఆ తల్లి ఎటువంటి స్వభావాల్ని కలిగిందంటే...

సర్వపూజ్యా సర్వవంద్యా చాన్యాం మత్తో నిశామయ ।
వాగ్బుద్ధి విద్యాజ్ఞానాధిష్ఠాత్రీచ పరమాత్మనః ॥
సర్వవిద్యా స్వరూపాయా సాచదేవీ సరస్వతీ ।
సాబుద్ధిః కవితా మేధా ప్రతిభా స్మృతికా నృణాం ॥
నానాప్రకార సిద్ధాంత భేదార్ధకలనామతా ।
వ్యాఖ్యా బోధ స్వరూపచ సర్వసందేహభంజనీ ॥
విచారకారిణీ గ్రంథకారిణీ శక్తిరూపిణీ ।
స్వరసంగీత సంధాన తాళ కారణ రూపిణీ ॥
విషయజ్ఞాన వాగ్రూపా ప్రతివిశ్వోపజీవినీ ।
వ్యాఖ్యావాదకరీ శాంతా వీణాపుస్తక ధారిణీ ॥
శుద్ధసత్త్వ స్వరూపాచ సుశీలా శ్రీహరిప్రియా ।
హిమచందన కుందేందు కుముదాంభోజ సన్నిభా ॥
సిద్ధివిద్యా స్వరూపాచ సర్వసిద్ధి ప్రదాసదా ।
యయావినాతు విప్రౌఘోమూకోమృత సమః సదాః ॥

*(బ్రహ్మవైవర్తం–ద్వితీయఖండం–శ్లో॥31–37)*

సర్వజనులందరిచేతా పూజించబడేది, నమస్కరించబడేది, పరమాత్మ యొక్క వాక్కు, బుద్ధి, జ్ఞానాలకి మూలకారణ స్వరూపిణి అయిన సరస్వతీదేవి, సకల విద్యాస్వరూపిణిగా, జనులందరి హృదయాల్లో బుద్ధిలో కొలువుండి వారందరికీ, కవిత్వం, మేధ, ప్రతిభ, స్మృతి లాంటి శక్తుల్ని కలిగిస్తుంది. వివిధరకాలుగా సిద్ధాంతాలు చేసే పండితుల వాఖ్యానార్థాల్లో కొలువుంటూ వారి సందేహాల్ని పోగొట్టి వారికి సరైన వివేచనాజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఇంకా చెప్పాలంటే కవులు పండితులు గ్రంధాల్ని రచించగలగటానికి సంగీత విద్వాంసులు స్వర, సంగీత, సంధాన, తాళ, లయ, నాదాలగురించి తెలుసుకోగలగటానికీ ఈ సరస్వతీదేవే కారణం. అలాంటి ఈ తల్లి పండితుల్లో చర్చ, విషయ, జ్ఞాన, వ్యాఖ్య, వాదన, వాక్య స్వరూపిణిగా, పరభాషామయిగా, ఈ విశ్వానికంతా భాషని ప్రసాదించే భాషారూపిణిగా, శాంత, నిర్మల సుప్రసన్న రూపంతో వీణా పుస్తకాల్ని ధరించి, శుద్ధ సత్త్వస్వరూపంతో, సుశీలగా, శ్రీహరిప్రియగా, మంచు, చందనం, చంద్రుడు, మల్లె, కమలం, లాంటి శోభలతో ప్రకాశిస్తోంది.

ఈ సరస్వతీదేవి వేదాల్లో తపఃస్వరూపిణిగా, తపస్సుచేసే వారికి తగిన జ్ఞానాన్ని అనుగ్రహించేదిగా, వేదజననిగా, సిద్ధవిద్యాస్వరూపిణిగా, సర్వసిద్ధుల్ని ప్రసాదించేదిగా, వర్ణించబడింది. అటువంటి ఈ చదువులతల్లి అనుగ్రహం లేకపోతే బ్రాహ్మణులు మూగవారితో, మరణించిన వారితో సమానంగా భావించబడతారు.

**4. శ్రీగాయత్రీదేవి :** ముక్తా విద్రుమ హేమనీల ధవళఛాయలతో ప్రకాశించే వేదమాతగా, సంధ్యావందన అధిష్టాన దేవతగా, సకలమంత్రాలకీ మూలమంత్రాధి దేవతగా లోకాలన్నిట్లో ప్రసిద్ధిపొందిన శ్రీ గాయత్రీ దేవి మూలప్రకృతి ధరించిన దివ్యస్వరూపాల్లో నాల్గవది. సమస్త శుభలక్షణ సమన్వితైన ఆ దేవి....

మాతా చతుర్ణాంవర్ణానాం వేదాంగానాంచ ఛందసాం ।
సంధ్యావందన మంత్రాణాం తంత్రాణాంచవిచక్షణా ॥

ద్విజాతి జాతిరూపాచ జపరూపాతపస్వినీ ।
బ్రాహ్మణ్య తేజోరూపాచ సర్వసంస్కార రూపిణీ ॥
పవిత్రరూపా సావిత్రీ గాయత్రీ బ్రహ్మణః ప్రియా ।
తీర్థానియస్యాః సంస్పర్శం వాంఛంతిహ్యాత్మశుద్ధయే ॥
శుద్ధ స్ఫటిక సంకాశా శుద్ధ సత్త్వ స్వరూపిణీ ।
పరమానందరూపాచ పరమాచ సనాతనీ ॥
పరబ్రహ్మ స్వరూపాచ నిర్వాణపదదాయినీ ।
బ్రహ్మ తేజోమయీశక్తిస్తదధిష్ఠాతృదేవతా ॥
యత్పాదరజసా త్పూతం జగత్సర్వంచనారద ।
దేవీచతుర్థీ కథితా పంచమీంవర్ణయామితే ॥

*(బ్రహ్మవైవర్తం-ద్వితీయఖండం-శ్లో॥39-44)*

లోకంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులనే నాలుగు వర్ణాల వారికీ తల్లివంటిది శ్రీగాయత్రీదేవి. ఆ దేవి వేదాంగాలకి, ఛందస్సులకి జననిగా నిత్య సంధ్యావందనాంతర్గత మంత్రాలన్నిటికీ, మూలమంత్రమైనదిగా, ద్విజాతి రూపిణిగా, జపరూపిణిగా, తపస్వినిగా, బ్రహ్మతేజస్సుతో ప్రకాశించేదిగా, సర్వసంస్కారరూపిణిగా, పరమ పవిత్రమైనదిగా, బ్రహ్మప్రియగా, సకలపుణ్య తీర్థాలు నిత్యం సేవింపకోరే శుద్ధస్ఫటికరూపిణిగా, వెలుగొందుతోంది. అలాగే పరమానంద రూపంతో, పరమసనాతనిగా, పరబ్రహ్మ స్వరూపిణిగా, మహా నిర్వాణ పథాన్ని ప్రసాదించేదిగా, బ్రహ్మ తేజస్సుతో సముజ్జ్వలంగా ప్రకాశిస్తూ, ఆ బ్రహ్మదేవుడికి అధిష్ఠాన దేవతగా వర్ణించబడింది.

**5. శ్రీరాధాదేవి :** గోలోకవాసియైన శ్రీకృష్ణ భగవానుడికి ప్రాణసమానురాలిగా రాసక్రీడలకి అధిష్ఠాన దేవతగా, నిత్యమధుర ప్రణయమూర్తిగా, కీర్తిగాంచిన శ్రీరాధాదేవి మూలప్రకృతి ధరించిన ప్రకృతి స్వరూపాల్లో ఐదవది. శృంగార రసాధి దేవత, ప్రేమమూర్తి అయిన ఆ రాధాదేవి. దేవీ భాగవతంలో

పంచప్రాణాధి దేవీ యాపంచ ప్రాణస్వరూపిణీ ।
ప్రాణాధిక ప్రియతమా సర్వాభ్యఃసుందరీ పరా ॥

సర్వసౌభాగ్య సంయుక్తా చ మానినీగౌరవాన్వితా ।
వామాంగార్ధ స్వరూపాచ గుణేన తేజసా సమా ॥

పరావరాసారభూతా పరమాద్యా సనాతనీ ।
పరమానంద రూపాచ ధన్యా మాన్యాచ పూజితా ॥

రాసక్రీడాధిదేవీ శ్రీకృష్ణస్య పరమాత్మనః ।
రాసమండల సంభూతా రాసమండల మండితా ॥

రాసేశ్వరీ సురసికా రాసావాస నివాసినీ ।
గోలోక వాసినీదేవీ గోపీవేష విధాయికా ॥

పరమహ్లాదరూపాచ సంతోషాఽమర్షరూపిణీ ।
నిర్గుణాచ నిరాకారా నిర్లిప్తాఽ ఽత్మ స్వరూపిణీ ॥

నిరీహా నిరహంకారాభక్తానుగ్రహవిగ్రహా ।
వేదానుసారిధ్యానేన విజ్ఞాతాసా విచక్షణైః ॥

కోటిచంద్ర ప్రభాపుష్టా సర్వశ్రీయుక్తవిగ్రహా ।
శ్రీకృష్ణ భక్తి దాస్యైక కరాచ సర్వసంపదాం ॥

అవతారేచ వారాహే వృషభానుసుతా చ యా ।
యత్పాదపద్మ సంస్పర్శా త్పవిత్రా చ వసుంధరా ॥

*(బ్రహ్మవైవర్తం-ద్వితీయఖండం-శ్లో॥46-54)*

పంచప్రాణ స్వరూపిణి, పంచప్రాణాలకీ అధిష్టాన దేవత, అందరికన్నా అధికమైన సౌందర్యం కలిగింది, శ్రీకృష్ణ పరమాత్మకి ప్రాణంకంటే ఎక్కువైన ప్రియురాలు, శ్రీరాధాదేవి. ఆదేవి సకలపదార్థాల్లో నివసించేది, సౌభాగ్యంతో ప్రకాశించేది, గౌరవర్ణంతో శ్రీకృష్ణభగవానుడి ఎడమభాగంగా వుండేది, గుణంలో, తేజస్సులో, సాటిలేనిది, నిత్యపరమానంద రూపిణిగా ధన్యగా,

మాన్యగా, నిత్యం పూజించబడేది. శ్రీకృష్ణుడి రాసక్రీడాధిదేవత, రాసమండలంలో పుట్టింది, రాసమండలం ప్రకాశించేలా చేసేది. రాసలీలల్లో రసికేశ్వరి, రసికాగ్రగణ్య, నిత్యరాసావాస విలాసిని, గోలోక నివాసిని, ఎల్లప్పుడూ పరమానందంతో, ఆహ్లాదంతో, సంతోషంతో, ప్రకాశించేది, నిర్గుణ, నిరహంకార, నిర్లిప్త, ఆత్మస్వరూపిణి, నిష్కామంతో, నిరహంకారంతో భక్తానుగ్రహదాయినిగా వేదపండితులచేత తెలుసుకోబడింది.

కోటిమంది చంద్రులతో సమానమైన వెలుగుల్ని వెదజల్లేది, సకలసౌభాగ్యదాయిని, శ్రీకృష్ణుడిమీద అచంచలమైన భక్తివిశ్వాసాలు కలిగింది, అని, సమస్తశుభలక్షణాలు కలిగిన దేవతగా దేవీభాగవతమహాపురాణంలో వర్ణించడిన రాధాదేవి, పూర్వం శ్వేత వరాహకల్పంలో వృషభానుడు అనే గోపాలకుడికి, కూతురుగా జన్మించింది. సకల సద్గుణశీల అయిన ఆరాధాదేవి పాదపద్మాల్ని తాకి భూమి పవిత్రమైంది. బ్రహ్మాదులకి కూడా కనిపించని ఆదేవి భారతకాలంలో బృందావనంలో నరులందరికీ ప్రత్యక్షంగా కనిపించింది. స్వచ్ఛమైన పవిత్ర ప్రేమమూర్తిగా లోకంలో ప్రఖ్యాతిపొందిన శ్రీరాధాదేవి నిత్యం శ్రీకృష్ణుని వక్షఃస్థలంలో కొలువుదీరి వుంటుంది.

ఇవి ఆదిప్రకృతి ధరించిన పంచప్రకృతి స్వరూపాల విశేషాలు. నారదా! ఈ అయిదు ప్రకృతిరూపాలూ మూలప్రకృతి పూర్ణాంశతో ఆవిర్భవించాయి. అలాగే అదే ప్రధానాంశతో మరికొందరు దేవతలుకూడా సృష్టించబడ్డారు. వారే 1.గంగాదేవి 2.తులసీదేవి 3.మనసాదేవి 4.దేవసేన (షష్ఠీదేవి) 5.మంగళచండీ 6.కాళీదేవి అనేవారు.

## ఆదిప్రకృతి ప్రధానాంశ దేవతలు

**1. గంగాదేవి :** సకలలోకాల్నీ సమస్త జీవుల్ని పవిత్రంచేసే గంగానది మూల ప్రకృతి ప్రధానాంశతో ఆవిర్భవించింది. ఈ గంగ విష్ణుమూర్తి పాదాలనుంచి పుట్టి పాపాత్ముల పాపాలన్నిటినీ కడిగివేస్తుంది. గంగానదిని చూసినా, తలచినా, స్నానంచేసినా గంగనీళ్ళను త్రాగినా మోక్షం సిద్ధిస్తుంది. జీవులు గోలోకాన్ని

చేరుకోవటానికి గంగానది రహదారిలా ఉపకరిస్తుంది. భూలోకంలో వున్న సమస్త నదుల్లో గంగానది ఎంతో గొప్పది. శివుడి జటాజూటంలోకి ప్రవేశించిన గంగ ఆయనతలమీద చుట్టుకున్న ముత్యాల వరుసలాగా శోభిస్తుంది. శంఖంలాగా, తెల్లని పద్మంలాగా, పాలలాగా స్వచ్ఛంగా ప్రవహించే గంగానది తపస్వులకు వెంటనే ఫలితాన్ని ప్రసాదిస్తుంది.

**2. తులసీదేవి :** ఆది ప్రకృతి ప్రధానాంశతో జన్మించిన శక్తి శ్రీతులసీదేవి. ఈమె శ్రీమహావిష్ణువుకి అత్యంత ప్రీతిపాత్రమైనది. నిర్మలమైన తులసి శ్రీహరి మెడలో హారంగా, పూజా సమయంలో ఆయన పాదాల మీద కొలువై వుంటుంది. విష్ణుపూజలో తులసికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వబడింది. తులసిదళం అన్నిటికన్నా సారవంతమైనది. పుణ్యాన్ని ప్రసాదిస్తుంది. ఎందుకంటే అది సహజంగానే పవిత్రమైంది కాబట్టి తులసి, స్పర్శ, దర్శన, సేవనాలవల్ల మోక్షం లభిస్తుంది. కలియుగంలో మానవులు చేసే పాపాలన్నిటినీ తులసి భస్మం చేస్తుంది. భూదేవి కూడా తులసిచెట్టు వేళ్ళు తనలో వుండటం వల్లనే పవిత్రమవుతోంది. సకల పుణ్యతీర్థాలూ తులసీదేవి స్పర్శనుకోరుకుంటాయి. ఇంత దివ్యమైన తులసి భూలోకంలో వృక్షం రూపంలో పూజలందుకుంటోంది.

**3. మనసాదేవి :** కశ్యపమహర్షికి మూలప్రకృతి ప్రధానాంశతో మనసాదేవి అనే పుత్రిక జన్మించింది. మనసాదేవి జ్ఞానవంతురాలు. పరమేశ్వరుడికి ప్రియమైన శిష్యురాలు. సర్పరాజైన అనంతుడు ఆమెకి సోదరుడు. సకల సర్పాలూ మనసాదేవిని నిత్యం కొలుస్తూ వుంటాయి. ఆమెకూడా సర్పాలనే ఆభరణాలుగా ధరించి వుంటుంది. మనసాదేవి గొప్ప సిద్ధయోగిని. శ్రీమహావిష్ణువు గురించి మూడు లక్షల సంవత్సరాలు కఠోరదీక్షతో తపస్సుచేసింది. ఆ తపస్సు ప్రభావంతో భూలోకంలో అందరికీ పూజ్యురాలయ్యింది. సకల మంత్రాలకే ఆమె అధిష్ఠానదేవత. నిత్యం బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోయే మనసాదేవికి 'జరత్కారూ' అనే పేరుకూడా వుంది. ఎందుకంటే ఈమె తపోధనుడైన జరత్కార మహర్షిని వివాహం చేసుకుంది. వీరిద్దరికీ గొప్ప తపస్వి అని ప్రసిద్ధి పొంది అస్తీకుడనే మహర్షి జన్మించాడు.

**4. షష్ఠీదేవి(దేవసేన) :** ఆదిప్రకృతి ఆరో అంశంతో జన్మించింది కనుక ఆశక్తికి షష్ఠీదేవి అనే పేరు వచ్చింది. ఈమెనే 'దేవసేన' అని కూడా అంటారు. ఈమె మాతృకా స్వరూపిణి కూడా. అందుకే ఈ దేవి సృష్టిలో వున్న శిశువుల్ని కాపాడుతూ వుంటుంది. తనను కొలిచే భక్తులకి పుత్రపౌత్రుల్ని ప్రసాదిస్తుంది. ఈమె తన భర్త దగ్గర నవయవ్వనవతిగా కనిపిస్తూ, శిశువుల దగ్గర పండు ముసలి యోగినిలా ఉంటుంది. షష్ఠీదేవిని సంవత్సరం మొత్తంలో ఎప్పుడైనా పూజ చేయవచ్చు. శిశివు జన్మించిన తరువాత సూతికా గృహంలో ఏడోరోజు లేక ఇరవై ఒకటో రోజున షష్ఠీదేవి పూజ చేస్తే పుట్టిన శిశువుకి ఆయువు ఆరోగ్యం పెంపొందుతాయి. మాతృరూపిణి అయిన ఈ షష్ఠీదేవిఎంతో దయకలిగింది. తనని నమ్మి కొలిచినవారి సంతానాన్ని కంటికి రెప్పలా కాపాడుతుంది.

**5. మంగళచండీ :** మూల ప్రకృతి ప్రధానాంశగా జన్మించిన మరోశక్తి స్వరూపిణి శ్రీ మంగళచండీదేవి. ఆమె ప్రకృతిముఖం నుంచి ఆవిర్భవించింది. ఆ దేవి తననుకొలిచే భక్తులకి సకల శుభమంగళాలనీ ప్రసాదిస్తుంది. ఆ దేవి సృష్టి జరిగే సమయంలో మంగళరూపిణిగా సంహార సమయంలో చండీ స్వరూపిణిగా కనిపిస్తుంది. అందుకే ఆమెను మంగళచండీ అని వ్యవహరిస్తారు. ఆదేవికి ప్రీతికరమైనవారం మంగళవారం. ఆరోజు సకలలోక వాసులూ ఆమెని పూజించాలి. అలా భక్తి శ్రద్ధలతో మంగళవారంనాడు తనని పూజించిన భక్తులకి, భోగభాగ్యాల్ని, కీర్తి ప్రతిష్ఠల్ని ప్రసాదించి, వారి భయాల్ని శోకాల్ని, దారిద్ర్యాన్ని అనారోగ్యాన్ని పోగొడుతుంది. మంగళచండీదేవి సంతోషిస్తే సమస్తవరాల్ని ప్రసాదిస్తుంది. అదే గనుక ఆమెకి కోపంవస్తే సమస్తాన్నీ దహిస్తుంది.

**6. శ్రీకాళీదేవి :** ప్రకృతి ప్రధానాంశ నుంచి జన్మించిన శక్తులలో ప్రభావవంతమైన శ్రీకాళీదేవి. పూర్వం ఆది ప్రకృతి పూర్ణాంశతో ఆవిర్భవించిన దుర్గాదేవి శుంభనిశుంభులనే అసురులతో యుద్ధంచేస్తున్నప్పుడు కోపంతో మండిపోతున్న ఆమె ముఖం నుంచి కాళికాదేవి పుట్టింది.

పరాక్రమంలో, ప్రభావంలో కాళికాదేవి దుర్గాదేవితో సమానమైన ప్రతిభకలిగింది. కోటి సూర్యుల తేజస్సుతో వెలిగే కాళీదేవి తన భక్తుల్ని ఎప్పుడూ అనుగ్రహిస్తూ వుంటుంది. ఈ కాళీదేవి శ్రీకృష్ణుడి భక్తురాలు. నిత్యం ఆయన్నే ధ్యానిస్తూ వుండటం వల్ల క్రమంగా ఈమె శరీరం నల్లగా మారిపోయింది. ఆమె కేవలం తన నిట్టూర్పుతోనే లోకాల్ని దహించేంత శక్తివంతమైనది. బ్రహ్మాది దేవతలతో, మునులతో నిత్యం పూజలందుకునే కాళి ధర్మార్థకామ మోక్షాల్ని ప్రసాదిస్తుంది.

**7. వసుంధర(భూదేవి) :** మూల ప్రకృతి ప్రధానాంశతో ఆవిర్భవించింది వసుంధర. అనగా భూమి ఈ భూమే అందరికీ ఆధారం. ఈ భూమి మీద జీవుల ఆహారం పండుతుంది. భూమి రత్నాలకి నిలయం. సప్తసముద్రాలు ఈ భూమిని ఆశ్రయించుకునే వున్నాయి. ఎంతో పవిత్రమైన ఈ భూమి నరులచేత మహారాజులచేత పూజలందుకుంటుంది. అందరూ జీవించటానికి ఈ భూమేకారణం. మానవుల సంపదని ఆహారాన్ని అందించి ఈ భూమే గనుక లేకపోతే చరాచర జగత్తంతా నశించిపోతుంది.

## మూలప్రకృతి అంశదేవతలు

1. **స్వాహాదేవి :** ఈమె అగ్నిదేవుడి భార్య యజ్ఞయాగాది క్రతువుల్లో ఈమె లేకుండా హవిస్సులు సమర్పిస్తే దేవతలు వాటిని స్వీకరించలేరు.
2. **దక్షిణాదేవి :** ఈమె యజ్ఞపురుషుడి భార్య. ఈమెగనుక లేకపోతే యజ్ఞకర్మలన్నీ నిష్ఫలమైపోతాయి.
3. **స్వధాదేవి :** ఈమె పితృదేవతల భార్య 'స్వధాకారం' లేకుండా పితృకర్మల్లో దానంచేస్తే అది వ్యర్థమైపోతుంది.
4. **స్వస్తిదేవి :** ఈమె వాయుదేవుడి భార్య ఆమె లేకుండా ఆదాన ప్రదానాలు చేయకూడదు.
5. **పుష్టిదేవి :** ఈమె గణపతి భార్య **6. తుష్టిదేవి :** ఈమె అనంతుడి పత్ని
7. **సంపత్తి :** ఈమె ఈశ్వరుడికి ఇల్లాలు **8. ధృతి :** కపిలమహర్షి భార్య

**9. క్షమ :** ఈమె యమధర్మరాజు భార్య ఈమె లేకపోతే సకల లోకాలూ కోపంతో, ఉన్మాదంతో ప్రవర్తిస్తాయి

**10. రతీదేవి :** ఈమె మన్మథుడి భార్య. సమస్త జీవుల రతికేళికి ఈమే కారణం. ఈమెలేకపోతే శృంగారమే వుండదు. సృష్టిస్తంభించిపోతుంది.

**11. ముక్తిదేవి**–సత్యానికి పత్ని

**12. దయాదేవి**–మోహానికి భార్య

**13. ప్రతిష్ఠాదేవి**–పుణ్యుడి ఇల్లాలు

**14. కీర్తిదేవి**–సకర్ముడి భార్య

**15. క్రియాదేవి**–ఉద్యోగానికి పత్ని

**16. మిథ్యాదేవి**–అధర్ముడికి ఇల్లాలు.

ఈ మిథ్యాదేవి కృత యుగంలో అసలు కనిపించదు. త్రేతాయుగంలో అత్యంత సూక్ష్మంగా, ద్వాపరయుగంలో అర్ధభాగంతో, కలియుగంలో పూర్ణరూపంతో సంచరిస్తుంది. ఆమె తన సోదరుడైన 'కపటుడు' అనేవాడితో కలిసి ప్రతి ఇంటికీ తిరిగుతుంటుంది.

**17. శాంతి లజ్జ అనే శక్తులు** – సుశీలుడనే వాడికి భార్యలు

**18. బుద్ధి, మేధ, స్మృతి** అనే ముగ్గురు శక్తులు – జ్ఞాన దేవుడి భార్యలు.

వీరితో పాటు కాలాగ్నిరుద్రుడి భార్య 'నిద్రాదేవి' కాలం భార్యలైన సంధ్య, ఉదయం, రాత్రులు, లోభదేవుడి భార్యలైన క్షుత్పిపాసలు (ఆకలిదప్పికలు), తేజస్సు భార్యలైన ప్రభా, దాహికలు, కాలుడి కుమార్తెలైన మృత్యు, జ్వరలు, సుఖదేవుడి భార్య అయిన తంద్ర, వైరాగ్యుడి ఇల్లాళ్ళైన శ్రద్ధ, భక్తి, దేవతలమాత అదితి, ఆవులకి మూలమైన సురభి, అసురుల తల్లి 'దితి', వినత, కద్రువ వీరంతా మూలప్రకృతి అంశ నుంచి ఆవిర్భవించారు.

## మూల ప్రకృతి సూక్ష్మాంశ రూపాలు

చంద్రుడి భార్య రోహిణీదేవి, సూర్యుడిభార్య సంజ్ఞాదేవి, మనువుపత్ని శతరూపా, ఇంద్రుడి భార్య శచీదేవి, బృహస్పతి ఇల్లాలు తార, వశిష్ఠపత్ని అరుంధతి, గౌతముడి భార్య అహల్య, అత్రిమహర్షి ఇల్లాలు అనసూయ, కర్దముడి భార్య దేవహూతి, దక్షుడి భార్య ప్రసూతి, పార్వతీదేవి తల్లి మేనక, అగస్త్యుడి

పత్నిలోపాముద్రా, వీరితోపాటు కుంతి, దమయంతి, గాంధారి, దేవకీదేవి, ద్రౌపది, సావిత్రి, మండోదరి, కౌసల్య, కైకేయి, రేవతి, సత్యభామ, కాళింది, జాంబవతి, సీత, రుక్మిణి, వ్యాసుడి తల్లి యోజనగంధి, బాణాసురుడి కుమార్తె ఉషాదేవి, పరశురాముడి తల్లి రేణుకాదేవి, బలరాముడితల్లి రోహిణీ, ఇంకా గ్రామదేవతైన నూకాలమ్మ, పోలేరమ్మ, ఎల్లమ్మ, మాచమ్మ, పోచమ్మ, మావుళ్ళమ్మ వంటివారు కూడా ఆదిప్రకృతి సూక్ష్మాంశ స్వరూపాలే.

నారదా! అసలు సృష్టిలోవున్న ప్రతిస్త్రీ ప్రకృతి అంశనుంచి జన్మించినదే. కనక స్త్రీలని ఎప్పుడూ అవమానించకూడదు. వారిని అవమానిస్తే ప్రకృతిని అవమానించినట్టే. వారిని పూజిస్తే ప్రకృతిని పూజించినట్టే. ఎనిమిది సంవత్సరాల స్త్రీ సాక్షాత్తు ప్రకృతి స్వరూపం అలాంటి కన్యని వస్త్రం, అలంకారం, చందనంతో పూజిస్తే సకల శుభాలూ కలుగుతాయి.

## సరస్వతీదేవి చరిత్ర

వైకుంఠవాసుడైన శ్రీహరికి పూర్వం లక్ష్మి, గంగ, సరస్వతి అని ముగ్గురు భార్యలున్నారు. వారు ముగ్గురు శ్రీహరితో చాలా అన్యోన్యంగా సంసారం చేసుకుంటున్నారు. ఒకరోజు గంగాదేవి శ్రీహరిని చూసి కామభావంతో చిన్నగా నవ్వింది. ఆయన కూడా ఆమెనిచూసి సన్నగా నవ్వాడు. ఈ దృశ్యాన్ని లక్ష్మీదేవి ముందుగా గమనించింది. అయితే ఆమె దాన్ని ఏమాత్రం పట్టించుకోలేదు. అక్కడే వున్న సరస్వతి ఆ దృశ్యాన్ని చూసి ఏమాత్రం సహించలేకపోయింది. కోపంతో, మాత్సర్యంలో ఆమె మొహం ఎరుపెక్కిపోయింది. అదిచూసి లక్ష్మీదేవి సరస్వతిని శాంత పరచబోయింది. ఆమె ప్రయత్నం సఫలం కాలేదు.

కోపాన్ని ఆపుకోలేని సరస్వతి వెంటనే అక్కణ్ణుంచి పైకి లేచి శ్రీహరితో "నాథా! భర్త తన భార్యలందర్నీ సమానంగా ప్రేమించాలి. అలాంటి వాడే ఉత్తమభర్త అవుతాడు. మరి నీవేమో గంగను మాత్రమే బాగా ప్రేమిస్తూ నన్ను దూరం పెడుతున్నావు. లక్ష్మీదేవి మీద కూడా అంతే ప్రేమ చూపిస్తున్నావు. అందుకే ఆమె గంగను సమర్థిస్తూ నన్ను వారిస్తోంది. ఇకనేను బ్రతికి

ప్రయోజనమేముంది. అని నిష్ఠూరాలాడింది. ఇదంతావిన్న శ్రీహరి అక్కడే వుంటే మరింత ప్రమాదమని భావించి వెంటనే తిరిగి వస్తానని చెప్పి అక్కణ్ణుంచి తప్పుకున్నాడు.

ఇక్కడ సరస్వతీదేవి ఆగ్రహం చల్లారలేదు. అక్కడేవున్న గంగను జుట్టుపట్టుకుని ఏమే గంగా! శ్రీహరికి నీమీదే ఎక్కువ ప్రేమ ఉందని చెప్పటానికి ప్రయత్నిస్తూ నన్ను అవమానిస్తావా! నీ గర్వాని అణుస్తాను. ఎవరేమంటారో చూస్తాను అని అరిచింది. అక్కడే వున్న లక్ష్మి, సరస్వతిని అడ్డుకోబోయింది. అప్పుడు సరస్వతి లక్ష్మితో, నీవు తప్పు చేసిన గంగను ఏమీ అనకుండా చెట్టులా నదిలా నిలబడివున్నావు కనుక "నీవు వృక్షంగా ఒక నదిగా మారిపో!" అని శపించింది. శాంతస్వభావురాలైన లక్ష్మీదేవి శాపం పొందినప్పటికీ చింతించకుండా అలానే నిల్చుంది.

అంతలో గంగాదేవికి కూడా సరస్వతి ప్రవర్తన వల్ల ఎంతో కోపం వచ్చింది. "ఓ సరస్వతీ! నీవు అకారణంగా అసూయతో నామీద నోరు చేసుకున్నావు. కలహం పెట్టుకున్నావు. పైగా నిన్ను వారించబోయిన లక్ష్మీదేవిని అనవసరంగా శపించావు. కనుక నిన్ను నేను శపిస్తున్నాను" నీవు కూడా నదిగా మారి భూలోకానికి వెళ్ళి పాపులున్న ప్రాంతంలో ప్రవహించు. నీలో స్నానం చేసిన పాపుల పాపం నీకూ కొంత అంటుతుంది' ' అని అన్నది.

గంగశాపాన్ని విన్న సరస్వతికి మరింత ఆగ్రహం కలిగి వెంటనే "ఓ గంగా! నువ్వే భూలోకానికి వెళ్ళు, అక్కడ పాపులు నీలో స్నానం చేస్తారు. తద్వారా వారి పాపాల్లో కొంతభాగం నీకూ అంటుకుంటుంది" అని తిరిగి శపించింది.

ఇలా వీరిద్దరూ ఒకర్నొకరు శపించుకున్న వెంటనే శ్రీహరి వారి దగ్గరకొచ్చాడు. జరిగిన విషయం గ్రహించాడు. సరస్వతీదేవి ఆగ్రహాన్ని చల్లార్చటానికి ఆమెని తన చేతుల్లోకి తీసుకుని శాంతపరిచాడు. వారు పరస్పరం ఇచ్చుకున్న శాపాలు తిరిగి మరలించలేనివి కాబట్టి వాటిని లోకానికి ఉపకరించే విధంగా ఇలా మలచాడు.

లక్ష్మీ! సరస్వతి నీకు ఇచ్చిన శాపఫలితంగా నీవు నీ అంశాంసరూపంలో అయోనిజవై ధర్మధ్వజుడనే మహారాజుకి కూతురుగా ఆవిర్భవించు. తరువాత దైవాపచారం చేసిన కారణంగా తులసిగా మారిపోతావు. అప్పుడు నిన్ను నా అంశతో జన్మించిన శంఖచూడుడు అనే రాక్షసుడు వివాహం చేసుకుంటాడు. అతని భార్యగా కొంతకాలం వున్న తరువాత తిరిగి నన్ను చేరతావు. ఆ తరువాత నీవు 'పద్మావతి' అనే పేరుతో ఒక నదిగా మారి భరతఖండంలో ప్రవహిస్తావు. నీవు పొందిన శాపం ఈ విధంగా నీకు పరిణమిస్తుంది అని అన్నాడు.

తరువాత గంగతో, ఓ గంగా! సరస్వతి ఇచ్చిన శాపాన్ని అనుసరించి నీవుకూడా నీ అంశాంశరూపంతో ముల్లోకాలనీ పవిత్రం చేయగల మహానదిగా మారతావు. భగీరథుడనే మహర్షి తపస్సు ఫలితంగా భూలోకానికి వెళ్ళి అక్కడున్న పాపులందరికీ పుణ్యగతులు కలిగిస్తావు. ఆ తరువాత నా అంశాంశరూపుడైన శంతనమహారాజుకి భార్యవై ఉన్నత స్థానాన్ని పొందుతావు. అని చెప్పి సరస్వతీ దేవితో –

దేవీ! నీ ఆగ్రహం ఎంతటి అనర్థానికి దారితీసిందో చూశావా! గంగ ఇచ్చిన శాపాన్ని అనుసరించి నీవుకూడా భరతఖండంలో ఒక పుణ్యనదిగా ప్రవహించు. ఎందరో మహర్షులు తపస్వులు నీ తీరంలో సాధన చేసి ముక్తిని పొందుతారు. తరువాత నీవు సరాసరి బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మదేవుడికి భార్యవికా, నీలాగానే గంగకూడా శివలోకానికి వెళ్ళి ఆయన శిరస్సుని అలంకరిస్తుంది.

ఈవిధంగా శ్రీమహావిష్ణువు తన భార్యల శాపాల్ని లోకానికి ఉపకారంగా మలచాడు. వారు పరస్పరం శపించుకున్న ఫలితంగా భూలోకంలో పరమపవిత్రమైన దైవాంశతో పద్మావతి, గంగా, సరస్వతీ నదులు ఏర్పడ్డాయి. శ్రీమహావిష్ణువు చెప్పిన విధంగా భూలోకంలో నదిగా ఆవిర్భవించిన సరస్వతి తరువాత బ్రహ్మదేవుడికి భార్యగామారి సకలలోకాలచేతా చదువుల తల్లిగా, మహావిద్వాంసురాలిగా, వాగ్దేవిగా కీర్తించబడింది.

## శ్రీసరస్వతీదేవి మంత్రం

సరస్వతీదేవికి ప్రీతికరమైనరోజు మాఘ శుద్ధపంచమి. ఆరోజు కానీ, విద్యారంభంచేసేడప్పుడు కానీ సరస్వతీ దేవిని ముందుగా ఇలా ధ్యానించి ఆ తరువాత మూలమంత్రాన్ని యధాశక్తి జపించి, ఆపై కవచాన్ని 11 సార్లు పారాయణ చేయాలి.

### సరస్వతీ ధ్యానం

సరస్వతీం శుక్లవర్ణాం సస్మితాం సుమనోహరాం ।
కోటిచంద్ర ప్రభాజుష్ణ పుష్పశ్రీయుక్త విగ్రహాం ॥

వహ్ని శుద్ధాంశుకాధానం సస్మితాం సుమనోహరాం ।
రత్నసారేంద్ర ఖచిత వరభూషణ భూషితాం ॥

సుపూజితాం సురగణైర్బ్రహ్మ విష్ణు శివాదిభిః ।
వందే భక్త్యావందితాం తాం మునీంద్రమను మానవైః ॥

*(శ్లో॥45-47, ఖండం-2)*

తెల్లని వర్ణం కలిగినది, చిరునవ్వుతో అందంగా ప్రకాశించేది, కోటి చంద్రులకాంతితో మెరిసిపోయేది. బంగారు రంగు వస్త్రాల్ని, వర్ణాభరణాలని ధరించేది, బ్రహ్మ విష్ణుశివాది దేవతల చేత నిత్యం పూజలందుకునేది, మహర్షులు, మానవులు, తదితరులతో నమస్కరించబడేది. అయిన సరస్వతీదేవికి భక్తిగా నమస్కరించి ఆ తరువాత ఆదేవి మూలమంత్రాన్ని జపించాలి.

## శ్రీసరస్వతీ అష్టాక్షర మంత్రం

### శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా

అస్య శ్రీ సరస్వతీ మహామంత్రస్య బ్రహ్మఋషిః। బృహస్పతి ఛందః। శ్రీకృష్ణ పరమాత్మ దేవతా। సర్వకార్య సిద్ధ్యర్థం కవిత్వ రచనాశక్తి సంప్రాప్త్యర్థం జపే వినియోగః అని చెప్పి పై మంత్రాన్ని యథాశక్తిజపించాలి.

**పురశ్చరణ :** ఈ సరస్వతీ మంత్రం భక్తిశ్రద్ధలతో నాలుగులక్షల సార్లు జపిస్తే సిద్ధిస్తుంది. ఇది సిద్ధించినవాడు బృహస్పతితో సమానమైన పండితుడవుతాడు.

**మంత్రవైభవం :** కవిత్వశక్తిని, వాగ్వైభవాన్ని ప్రసాదించే పరమపవిత్రమైన ఈ సరస్వతీమంత్రాన్ని మొదటిసారి నారాయణుడు గంగాతీరంలో వాల్మీకి మహర్షికి ఉపదేశించాడు. తరువాత ఇదే మంత్రాన్ని భృగుమహర్షి పుష్కరక్షేత్రంలో సూర్యగ్రహణ కాలంలో శుక్రుడికి ఉపదేశించగా, మారీచ మహర్షి అదే పుష్కర క్షేత్రంలో చంద్రగ్రహణ కాలంలో బృహస్పతికి ఉపదేశించాడు. తరువాత బదరికాశ్రమంలో బ్రహ్మదేవుడి ద్వారా తిరిగి భృగుమహర్షి ఈ మంత్రాన్ని ఉపదేశం పొందాడు. తరువాత ఎందరో మహర్షులు ఈ మహామంత్రాన్ని ఉపదేశం పొంది సాధన చేసారు. ఆదిశేషుడు పాణినిమహర్షికి, భారద్వాజ మహర్షికి, శాకటాయనుడికి, పాతాళలోకంలో ఈ దివ్యమంత్రాన్ని ఉపదేశించాడు. ఇలా ఇంతమంది చేత జపించబడ్డ ఈ సరస్వతీ మంత్రం మహా మహిమోపేతమైనదిగా లోకంలో ప్రసిద్ధి చెందింది.

## శ్రీసరస్వతీ దేవి కవచ స్తోత్రం

బ్రహ్మదేవుడు భృగుమహర్షితో వత్సా! పూర్వం గోలోకంలో శ్రీకృష్ణ పరమాత్మ నాకు ఉపదేశించిన సరస్వతీ కవచస్తోత్రాన్ని నీకు చెబుతున్నాను. ఇది ఎంతో గొప్పది. కల్పవృక్షంలాగా అన్ని కోరికల్నీ తీరుస్తుంది. శ్రద్ధగా విను అని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

అస్య శ్రీ సరస్వతీ కవచస్తోత్ర మంత్రస్య బ్రహ్మ ఋషిః, బృహస్పతి ఛందః, శ్రీకృష్ణపరమాత్మ దేవతా, మమ సకల కామ్య సిద్ధ్యర్థ్యం, విద్యాజ్ఞాన, కవిత్వరచనా శక్తి ప్రాప్త్యర్థం పారాయణే వినియోగః ।

ఓం హ్రీం సరస్వత్యై స్వాహా శిరోమే పాతు సర్వతః ।
శ్రీ వాగ్దేవతాయై స్వాహా ఫాలంమే సర్వతా ఽవతు ॥

ఓం సరస్వత్యై స్వాహేతి శ్రోతం పాతు నిరంతరం ।
ఓం శ్రీం హ్రీం భారత్యై స్వాహా నేత్రయుగ్మం సదా ఽవతు ॥

ఓం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా నాసాంమే సర్వతోఽవతు ।
హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా శ్రోతం సదాఽవతు ॥

ఓం శ్రీం హ్రీం బ్రాహ్మ్యైస్వాహేతి దంతపంక్తీః సదాऽవతు ।
ఐమిత్యేకాక్షరో మంత్రో మమ కంఠం సదాऽవతు ॥
ఓం శ్రీం హ్రీం పాతు మే గ్రీవాం స్కంధం మే శ్రీ సదాऽవతు ।
శ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా వక్షః సదాऽవతు ॥
ఓం హ్రీం విద్యాస్వరూపాయై స్వాహా మే పాతు నాభికం ।
ఓం హ్రీం హ్రీం వాణ్యైస్వాహేతి మమ పృష్ఠం సదాऽవతు ॥
ఓం సర్వ వర్ణాత్మికాయై పాదయుగ్మం సదాऽవతు ।
ఓం రాగాధిష్ఠాతృదేవ్యై సర్వాంగం మే సదాऽవతు ॥
ఓం సర్వకంఠవాసిన్యై స్వాహా ప్రాచ్యాం సదాऽవతు ।
ఓం హ్రీం జిహ్వాగ్రవాసిన్యై స్వాహాऽగ్నిదిశి రక్షతు ॥
ఓం ఐం హ్రీం శ్రీం సరస్వత్యై బుధ జనన్యై స్వాహా ।
సతతం మంత్రరాజోऽయం దక్షిణేమే సదాऽవతు ॥
ఓం శ్రీం హ్రీం త్ర్యక్షరోమంత్రో నైఋత్యాం మే సదాऽవతు ।
కవి జిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం వారుణేऽవతు ॥
ఓం సదంబికాయై స్వాహా వాయవ్యే మాం సదాऽవతు ।
ఓం గద్యపద్యవాసిన్యై స్వాహా మాముత్తరే ऽవతు ॥
ఓం సర్వశాస్త్రవాసిన్యై స్వాహైశాన్యాం సదాऽవతు ।
ఓం సర్వపూజితాయై స్వాహా చోర్ధ్వం సదాऽవతు ॥
ఐం హ్రీం పుస్తకవాసిన్యై స్వాహాऽధోమాం సదాऽవతు ।
ఓం గ్రంథబీజరూపాయై స్వాహా మాం సర్వతోऽవతు ॥
ఇతి థే కథితం విప్ర సర్వమంత్రౌఘ విగ్రహం ।
ఇదం విశ్వజయం నామ కవచం బ్రహ్మరూపకం ॥

“ఓం హ్రీం సరస్వత్యై స్వాహా” అను మంత్రము నా శిరస్సునంతయు రక్షించుగాక

“శ్రీ వాగ్దేవతాయై స్వాహా” అనునది నా నొసటిని రక్షించుగాక

"ఓం హ్రీం సరస్వత్యై స్వాహా" అనునది నా చెవులనెల్లప్పుడు రక్షించుగాక
"ఓం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా" అనునది నా నాసిక నంతట రక్షించుగాక.
"హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా' అను మంత్రము నా చెవుల్ని రక్షించుగాక.
"ఐం" అను ఏకాక్షరమంత్రము నా కంఠము నెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం శ్రీం హ్రీం" అనేది నా మెడను, "శ్రీం" అనునది నా స్కంధముల రక్షించుగాక.
"శ్రీం విద్యాధిష్ఠాతృ దేవ్యై స్వాహా" అనునది నా వక్షమునెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం హ్రీం విద్యాస్వరూపాయే స్వాహా" అనునది నా నాభిని ఎల్లప్పుడు రక్షించుగాక.
"ఓం హ్రీం హ్రీం వాణ్యైస్వాహా" అనునది నా పృష్ఠమును ఎల్లప్పుడు రక్షించుగాక.
"ఓం సర్వ వర్ణాత్మికాయై" అనునది నా పాదములనెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం రాగాధిష్ఠాతృదేవ్యై" అను మంత్రము నా సమస్తావయవములను రక్షించుగాక.
"ఓం సర్వ కంఠవాసిన్యై స్వాహా" అనునది నా తూర్పుదిక్కును రక్షించుగాక.
"ఓం హ్రీం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా" అను మంత్రము నా ఆగ్నేయదిశను రక్షించుగాక.
"ఓం ఐం హ్రీం శ్రీం సరస్వత్యై బుధ జనన్యై స్వాహా" అను మంత్రరాజం నాకు దక్షిణదిక్కును ఎల్లప్పుడు రక్షించుగాక.
"ఓం శ్రీం హ్రీం" అను మంత్రమును నా నైఋతి దిక్కును రక్షించుగాక.
"కవి జిహ్వాగ్ర వాసిన్యై స్వాహా" అను మంత్రము నా పశ్చిమదిక్కును రక్షించుగాక.
"ఓం సదంబికాయై స్వాహా" అనునది నా వాయువ్య దిక్కును రక్షించుగాక.
"ఓం గద్యవాసిన్యై స్వాహా" అనునది నా ఉత్తర దిక్కును రక్షించుగాక.
"ఓం సర్వ శాస్త్రవాసిన్యైస్వాహా" అనునది నా ఈశాన్య దిక్కును రక్షించుగాక.
"ఓం సర్వ పూజితాయై స్వాహా" అనునది నా ఊర్ధ్వ దిక్కును రక్షించుగాక.
"ఓం హ్రీం పుస్తక వాసిన్యై స్వాహా" అనునది నా అథో దిక్కును రక్షించుగాక.
"ఓం గ్రంథ బీజరూపాయై స్వాహా" అను మంత్రం నన్ను అన్ని వైపులనుండి రక్షించుగాక. *(శ్లో: 73-85, అధ్యా-4, ఖండం-2)*

**కవచపారాయణ విధి :** మహిమోపేతమైన ఈ కవచాన్ని గురుముఖతః ఉపదేశం పొందాలి. ఐదులక్షల సార్లు ఈ కవచం పారాయణ చేస్తే సిద్ధిస్తుంది. ఇది సిద్ధిపొందినవాడు బృహస్పతితో సమానమైన పాండిత్యం పొందుతాడు. మంచికవి, వక్త అవుతాడు. సర్వత్రా అతడికి విజయం లభిస్తుంది. ఈ కవచాన్ని భూర్జపత్రం మీద లేక రాగి, వెండి, బంగారు రేకుమీద లిఖించి దాన్ని తాయెత్తులో పెట్టి గంధపుష్పాలతో పూజించి కుడిచేతికి, లేక మెడలో ధరిస్తే మంచిది.

**సరస్వతీ కవచవైభవం :** ఈ దివ్యకవచాన్ని పారాయణ చేసాకే బృహస్పతికి అంతటి మేధస్సు లభించింది. శుక్రుడు కూడా దీన్ని పఠించి అసురులకి గురువయ్యాడు. వాల్మీకి మహాకవిగా మారాడు. స్వాయంభువ మనువు ప్రజాపతి అయ్యాడు. కృష్ణద్వైపాయనుడు ఈ సరస్వతీ కవచాన్ని ఉపాసించే వేదవిభాగం చేయగలిగాడు. సమస్త పురాణాల్ని రచించగలిగాడు. ఇలా ఎంతోమంది మహర్షులు ఈ కవచాన్ని శ్రద్ధగా పారాయణ చేసి అభిలషితార్థాలు పొందగలిగారు.

## సరస్వతీ స్తోత్రం

పూర్వం యాజ్ఞవల్క్యమహర్షి ప్రారబ్ధవశాన గురుశాపానికి గురయ్యాడు. ఆయన శాప ప్రభావంతో యాజ్ఞవల్క్యుడు నేర్చిన విద్యలన్నీ మరిచిపోయాడు. దానితో ఆయనకి తీవ్రమైన వేదన కలిగింది. ఎంతో దుఃఖంతో కోణార్క క్షేత్రానికి వెళ్ళి సూర్యభగవానుణ్ణి స్తుతించాడు. ఆయన వేదన గ్రహించి సూర్యుడు ప్రత్యక్షమై యాజ్ఞవల్క్యుడికి వేదవేదాంగాలని, సకల శాస్త్రాలనీ బోధించాడు. అవన్నీ ఆయనకి శాశ్వతంగా జ్ఞాపకం ఉండటంకోసం సరస్వతీ దేవిని స్తుతించమని చెప్పి అంతర్ధానమయ్యాడు. సూర్యుడి ఆజ్ఞప్రకారం యాజ్ఞవల్క్యుడు ఒక శుభముహూర్తంలో శుచిగా స్నాన సంధ్యలు అనుష్ఠించి సరస్వతీదేవిని భక్తిగా ఇలా స్తుతించాడు.

కృపాంకురు జగన్మాతః మామేవం హతతేజసం ।
గురుశాపాత్ స్మృతి భ్రష్టం విద్యాహీనం చ దుఃఖితం ॥

జ్ఞానం దేహి స్మృతిందేహి విద్యాం విద్యాధిదేవతే ।
ప్రతిష్ఠాం కవితాం దేహి శక్తిం శిష్య ప్రబోధికాం ॥

గ్రంథ నిర్మితి శక్తిం చ సచ్ఛిష్యం సుప్రతిష్ఠితం ।
ప్రతిభాం సత్సభాయాంచ విచారక్షమతాం శుభాం ॥

లుప్తాం సర్వాం దైవవశాన్నవాం కురు పునః పునః ।
యథాంకురం జనయతి భగవన్యోగమాయయా ॥

బ్రహ్మ స్వరూపా పరమా జ్యోతిరూపా సనాతనీ ।
సర్వ విద్యాధిదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥

యయావినా జగత్సర్వం శశ్వజ్జీవన్మృతం సదా ।
జ్ఞానాధిదేవీ యా తస్యై సరస్వత్యై నమో నమః ॥

యయా వినా జగత్సర్వం మూక మున్మత్తవత్సదా ।
నాగధిష్ఠాతృదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥

హిమ చందన కుందేదు కుముదాంభోజ సన్నిభా ।
వర్ణాధి దేవీ యా తస్యై చాక్షరాయై నమో నమః ॥

విసర్గబిందుమాత్రాణాం యదధిష్ఠానమేవచ ।
ఇత్థం త్వం గీయసే సద్భిః భారత్యై తే నమోనమః ॥

యయా వినాఽత్ర సంఖ్యాకృత్సంఖ్యాం కర్తుం న శక్నుతే ।
కాల సంఖ్యా స్వరూపా యా తస్యై దేవ్యై నమోనమః ॥

వ్యాఖ్యా స్వరూపా యా దేవీ వ్యాఖ్యాధిష్ఠాతృదేవతా ।
భ్రమ సిద్ధాంతరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥

స్మృతి శక్తి జ్ఞానశక్తి బుద్ధి శక్తి స్వరూపిణీ ।
ప్రతిభా కల్పనాశక్తిర్యా చ తస్యై నమో నమః ॥

*(శ్లో॥6-17,అధ్యా-5,ఖం. -2)*

యాజ్ఞవల్క్యుడు చేసిన స్తుతికి సరస్వతీ దేవి ఎంతో సంతోషించింది. నిరాహారుడై ఆయన చూపిన భక్తి శ్రద్ధల్ని గుర్తించి ఒక దివ్యజ్యోతిగా ఆయనకి

దర్శనమిచ్చింది. యాజ్ఞవల్క్యుడు ఎంతో తాదాత్మ్యంతో ఆజ్యోతికి నమస్కరించాడు. సరస్వతీదేవి ఆయన్ని అనుగ్రహించి తిరిగి అంతర్ధానమైపోయింది.

**స్తోత్రపారాయణ ఫలం :** యాజ్ఞవల్క్యకృతమైన ఈ సరస్వతీ స్తోత్రాన్ని భక్తి శ్రద్ధలతో పారాయణ చేసినవాడు గొప్ప కవీంద్రుడవుతాడు. మంచి వక్తగా ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తాడు. పరమమూర్ఖుడైనప్పటికీ ఈ స్తోత్రాన్ని నియమంగా ఒక సంవత్సరకాలం పఠిస్తే అతడు గొప్ప పండితుడవుతాడు.

**సరస్వతీ పూజకు కావలసిన ద్రవ్యాలు :** తెల్లనిపూలు, సువాసనతో వున్న తెల్ల చందనం, తెల్లని వస్త్రాలు, శంఖం, తెల్లపువ్వులమాల, ముత్యాలు, పూజలో ఉపయెగించాల్సిన ద్రవ్యాలు. సరస్వతీదేవికి నైవేద్యంగా వెన్న, పెరుగు, పాలు, పేలాలు, నువ్వుండలు, చెరకు, చెరకురసం, తెల్లబెల్లం, పంచదార, తెల్లటి బియ్యంతో వండిన అన్నం, అటుకులు, నేయి, సైంధవలవణం ఉపయోగించి చేసిన వంటకాలు, నేయికలిపిన యవలు, పరమాన్నం, కొబ్బరికాయ, కొబ్బరినీళ్ళు, అరటి, నేరేడు, రేగు పళ్ళు వంటివి నైవేద్యంగా ఉపయోగించాలి.

## పృథ్వి ఉపాఖ్యానం

భూదానం చేస్తే ఎలాంటి పుణ్యం లభిస్తుంది? దానం చేసినభూమిని ఎవరైనా అపహరించినా, భూమిని త్రవ్వినా వీర్యాన్ని భూమిమీద వదిలినా, నేలమీద దీపాలు వెలిగించినా ఎలాంటి ఫలితాలు కలుగుతాయో చెప్పమని నారదమహర్షి కోరగా నారాయణుడు ఇలా చెప్పాడు.

నారదా! భరతఖండంలో మూడు కాలాల్లో సంధ్యావందనం చేసి, గాయత్రీ మంత్రాన్ని శ్రద్ధగా జపించే బ్రాహ్మణుడు పరమ పవిత్రుడు. అలాంటి విప్రుడికి లేశమాత్రం (ఏకొంచెం) భూమిని దానంచేసినా వాడికి వైకుంఠప్రాప్తి కలుగుతుంది. గ్రామాన్ని, భూమిని, ధాన్యాన్ని దానంచేసిన వారు దానం పుచ్చుకున్నవారు ఇద్దరూ సకల పాపాలనుంచీ విముక్తి పొంది వైకుంఠానికి చేరతారు.

బ్రాహ్మణులకి ఇతరులు దానమిచ్చిన భూమిని ఎవరు అక్రమంగా స్వాధీనం చేసుకుంటారో వారు సూర్యచంద్రులున్నంతవరకూ నరకంలో శిక్షలనుభవిస్తారు. వారే కాదు వారి సంతానం కూడా భూమిని కోల్పోయి దరిద్రులవుతారు.

ఆవులు సంచరించే పచ్చిక భూముల్ని వ్యవసాయ భూములుగా మార్చేవారు, గోశాలని, చెఱువుల్ని చెడగొట్టి వేరే కార్యక్రమాలకి వినియోగించేవారు నరకంలో ఘోరమైన శిక్షలు పొందుతారు. అలాగే భూమిమీద తన వీర్యాన్ని వదిలినవాడు, ఇతరులు త్రవ్వించిన బావిని పూడ్పించేవాడు, దుష్ఫలితాల్ని పొందుతారు. పిండం పెట్టకుండా శ్రాద్ధం ఆచరించినవాడు నరకాన్ని పొందుతాడు. అదేవిధంగా భూమిమీద దీపాన్ని ఉంచితే ఏడుజన్మలదాకా గుడ్డివాడవుతాడు. భూమిమీద శంఖాన్ని ఉంచితే కుష్ఠువ్యాధితో పీడించబడతాడు.

శివలింగాన్ని, సాలగ్రామశిలని, అభిషేకం చేసిన తీర్థాన్ని, పుష్పాన్ని, తులసిని, జపమాలని, కర్పూరాన్ని, గోరోచనాన్ని, మంత్రాలున్న పుస్తకాన్ని, భూమిమీద పెట్టకూడదు. అలాగే చందనం కర్రని, రుద్రాక్షని, దర్భని భూమి మీద ఉంచితే ఒక మన్వంతరం వరకూ నరకలోకం ప్రాప్తి కలుగుతుంది. పుస్తకాన్ని, యజ్ఞోపవీతాన్ని, భూమిమీద ఉంచితే మరుజన్మలో అతడు విప్రుడుగా జన్మించడు. అలా చేస్తే అది బ్రహ్మ హత్యతో సమానమైన పాపం అవుతుంది. (పై తెలిపినవి సరాసరి భూమిమీద ఉంచకుండా క్రింద ఆకువేసి పెట్టాలి)

యజ్ఞం చేసిన తరువాత ఆ భూమిని పాలతో తడపకపోతే 'తప్తసూర్మి' అనే నరకాన్ని చేరతాడు. భూకంపం సంభవించినప్పుడు, గ్రహణ కాలంలో భూమిని ఎవరు త్రవ్వుతారో వాడు మహాపాపం చేసినవాడౌతాడు.

మరోజన్మలో అంగవికలుడిగా పుడతాడు. భూమితనలో ధనాన్ని, రత్నాల్ని(వసువులు) ధరించింది కాబట్టే దాన్ని 'వసుధ' అంటారు. ఈ భూమి శ్రీమహావిష్ణువు ఊరువుల నుంచి ఆవిర్భవించింది కాబట్టే దీన్ని 'ఉర్వి' అంటారు.

యాగం చేసే వస్తువులన్నిటినీ (హోమకుండంలో) భరిస్తోంది కాబట్టి 'ఇజ్య' అని, లయకాలంలో భూమి క్షీణించిపోతుంది కాబట్టి 'క్షోణి' అని, మహాలయకాలంలో సంపూర్ణంగా నశించిపోతుంది. కనుక 'క్షితి' అని, కశ్యపమహర్షికి సంబంధించింది కనుక 'కాశ్యపి' అని, చలనం లేకుండా ఉన్నందువల్ల 'అచల' అని, ఈ విశాల విశ్వాన్నంతా భరిస్తోంది కనుక 'విశ్వంభర' అని, పృథుమహారాజు కుమార్తె కనుక 'పృధ్వి' అని, బాగా విస్తరించి వున్నందువల్ల మహీ అని భూమి ప్రసిద్ధిచెందింది.

భూమికి అధిష్ఠాన దేవత వారాహీదేవి, ఆమె సకల దేవతలతో పూజలందుకుంటోంది. వారాహీదేవి మరెవరో కాదు, వరాహావతారాన్ని ధరించిన శ్రీమహావిష్ణువు భార్య. వీరి పుత్రుడే కుజుడు లేక మంగళుడు.

## భూదేవి మంత్రం

**ఓం హ్రీం శ్రీం వాం వసుధాయై స్వాహా** అనేది భూదేవి మంత్రం. ఈ మంత్రాన్ని యధాశక్తి జపిస్తే భూలాభం కలుగుతుంది. భూ వివాదాలు సమసిపోతాయి.

## భూదేవి ధ్యానశ్లోకం

శ్వేతచంపకవర్ణాభాం శతచంద్ర సమప్రభాం ।
చందనోత్క్షిత సర్వాంగీం సర్వభూషణ భూషితాం ॥

రత్నాధారాం రత్నగర్భాం రత్నాకర సమన్వితాం ।
వహ్నిశుద్ధాంశుకాధానం సస్మితాం వందితాం భజే ॥

*(శ్లో॥50-51, అధ్యా-8, ఖం.2)*

తెల్లటి చంపక పుష్పాల లాంటి శరీరవర్ణం కలిగినది, వందమంది చంద్రులతో సమానమైన కాంతి కలిగింది, శరీరమంతా దివ్య చందనాన్ని, ఆ శరీరంమీద దివ్యాభరణాల్ని ధరించింది, రత్నాలకి ఆధారంగా వున్నది (రత్నగర్భ) స్వచ్ఛమైన బంగారు రంగుతో మెరిసిపోయే వస్త్రాల్ని ధరించినది, చిరునవ్వులు చిందించేది అయిన భూదేవిని నేను ధ్యానిస్తాను.

## పృథివీ స్తోత్రం

యజ్ఞసూకర జాయాత్వం జయందేహి జయావహే ।
జయేఽ జయే జయధారే, జయశీలే జయప్రద ॥
సర్వాధారే సర్వబీజే సర్వశక్తి సమన్వితే ।
సర్వకామప్రదేదేవి సర్వేష్టం దేహిమే స్థిరే ॥
సర్వసస్యాలయే సర్వసస్యాఢ్యే సర్వసస్యదే ।
సర్వసస్యహరే కాలే సర్వసస్యాత్మికే క్షిత ॥
మంగళే మంగళాధారే మాంగల్యే మంగళప్రదే ।
మంగళార్థే మంగళాంశే మంగళం దేహిమేవరం ॥
భూమే భూమిన సర్వస్వే భూమిపాల పరాయణే ।
భూమి పాహంకార రూపే భూమిందేహి వసుంధరే ॥

*(శ్లో॥53-57, అధ్యా-8, ఖం.2)*

**ఫలశ్రుతి :** శ్రీమహావిష్ణువు స్వయంగా చేసిన ఈ పృధివీ స్తోత్రాన్ని పఠించి భూపూజ చేస్తే కోటిజన్మల్లో చేసిన పాపం నశిస్తుంది. ఈ స్తోత్రాన్ని నిత్యం పఠిస్తే భూదానం చేసిన ఫలం లభిస్తుంది. భూమిని అకారణంగా త్రవ్వినందువల్లన వచ్చేపాపం, భూమిమీద దీపాలు వెలిగించగా వచ్చే పాపం, తొలగిపోతుంది. అంతేకాదు దీన్నిపఠిస్తే నూరు అశ్వమేధయాగాలు చేసిన ఫలితం కూడా లభిస్తుంది.

## గంగాదేవి వృత్తాంతం

పూర్వం సూర్యవంశంలో సగరుడనే చక్రవర్తి ఉండేవాడు. ఆయనకి వైదర్భి, శైబ్యా అని ఇద్దరు భార్యలున్నారు. సత్యయుగంలో జన్మించిన ఆ సగరచక్రవర్తి, సత్య, ధర్మ నిష్ఠ కలిగిన రాజు. ఆయనకి శైబ్య అనే భార్య ద్వారా అసమంజసుడు అనే పుత్రుడు జన్మించాడు. అయితే రెండో భార్య వైదర్భికి సంతానం కలగలేదు. పుత్ర సంతానం కోసం ఎంతో పరితపించిన వైదర్భి పరమేశ్వరుణ్ణి ఆరాధించింది. శివుడి అనుగ్రహంతో ఎట్టకేలకు

ఆమె గర్భం ధరించింది. విచిత్రంగా ఆమె గర్భం వందసంవత్సరాల పాటు అలాగే ఉండిపోయింది. చివరికి ఆమె ఒక మాంసపిండాన్ని ప్రసవించింది. అదిచూసి వైదర్భికి గుండె తరుక్కుపోయింది. ఇంతకాలం మోసి ఒక మాంసంపిండాన్నా నేను కన్నది! అని తిరిగి శివుణ్ణి ప్రార్థించింది. ఆమె ప్రార్థనకి కరిగిపోయిన శివుడు ఒక విప్రుడి రూపంలో అక్కడికి వచ్చి ఆమె కన్న మాంసపిండాన్ని అరవైవేల తునకలుగా చేసి వాటికి జీవాన్ని ప్రసాదించాడు. అలా వైదర్భికి అరవైవేల మంది పుత్రులు జన్మించారు.

సగరుడి పుత్రులందరూ మహాబలపరాక్రమవంతులు, మధ్యాహ్న సూర్యకాంతిలా ప్రకాశించేవారు, అయితే వారికి దురహంకారం కూడా ఎక్కువే! ఒకనాడు తమ అనివేకపు చర్య వల్ల మహాతపోధనుడైన కపిల మహర్షికి ఆగ్రహం తెప్పించారు. ఆయన కోపంతో వారందర్నీ భస్మం చేసేసాడు. అలా సగరుడి అరవైవేల మంది కుమారులు బూడిదకుప్పల్లా మారిపోయారు. సగరుడికి ఈ వార్త తెలిసి పుత్రశోకాన్ని భరించలేక మరణించాడు. తన సోదరులందర్నీ తరింపచేయాలని సగరుడి ప్రధమపుత్రుడు అసమంజసుడు భావించాడు. అందుకోసం లక్ష సంవత్సరాలు కఠినంగా తపస్సు చేసాడు. కానీ తపస్సు ఫలించకముందే కాలంచేసాడు.

అసమంజుసుడి పుత్రుడు దిలీపుడు అతడు కూడా లక్షసంవత్సరాలు తపస్సుచేసి, ఫలించక ప్రాణం కోల్పోయాడు. ఆయన తరువాత దిలీపుని పుత్రుడు అంశుమంతుడు కూడా లక్షసంవత్సరాలు తపస్సుచేసి కాలం చెందాడు. ఆదిలీపుడికి మరో కుమారుడున్నాడు. అతనే భగీరథుడు గొప్ప విష్ణు భక్తుడు. ఎలాగైనా తమ పూర్వీకులు చేయలేని కార్యాన్ని తాను సాధించాలని, దివినుంచి గంగను భువిపైకి తేవాలని వ్రతం పూనాడు. అందుకోసం శ్రీమహావిష్ణువు గురించి లక్ష సంవత్సరాలు ఘోరమైన తపస్సు ఆచరించాడు. చివరికి అతడి తపస్సుకి మెచ్చి పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుడు దర్శనమిచ్చాడు. భగీరథుడు ఎంతో ఆనందంతో పులకరించిపోయి ఆయన్ని ఘనంగా స్తుతించాడు. తన కోరికను ఆయనకి దీనంగా విన్నవించాడు.

భగీరథుడి కోరిక విన్న శ్రీకృష్ణుడు చిరునవ్వులు చిందిస్తూ ఒక్కసారి గంగను స్మరించాడు. వెంటనే ఆమె అక్కడ ప్రత్యక్షమైంది. శ్రీకృష్ణుడు ఆమెని స్తుతించి గంగతో "ఓ గంగా! నీకు పూర్వం సరస్వతీదేవి శాపం ఇచ్చింది కదా। అది ఇప్పుడు ఫలమయ్యే సందర్భం వచ్చింది. నీవు భూలోకంలోని భరత ఖండానికి వెళ్ళి ఇదిగో ఈ భగీరథుడి పూర్వీకులైన సగరుడి పుత్రులందర్నీ పవిత్రుల్ని చెయ్యి. బూడిద రూపంలో వున్న వారంతా నీ స్పర్శతో దివ్యశరీరాల్ని ధరించి నాలోకానికి వచ్చి నా అనుచరులుగా సంచరిస్తారు.

కర్మభోగం సముచ్ఛిద్య కృతం జన్మని జన్మని ।
నానావిధం మహత్స్వల్పం పాపంస్యాత్ భారతేనృభిః ॥

గంగాయాః స్పర్శనాతేన నశ్యతీతి శ్రుతే శ్రుతం ।
స్పర్శనం దర్శనాద్దేవ్యాః పుణ్యం దశగుణం తతః ॥

మౌసల స్నానమాత్రేణ సామాన్య దివసే నృణాం ।
కోటి జన్మార్జితం పాపం నశ్యతీతి శ్రుతే శ్రుతం ॥

*(శ్లో॥26-28, అధ్యా-10, ఖం.2)*

గంగా! నీ స్పర్శతో, నీగాలితో భారతఖండంలోవున్న ప్రజలందరూ పూర్వజన్మలో తాముచేసిన పాపాలన్నిటినీ పోగొట్టుకుంటారని వేదాల్లో చెప్పబడింది.

గంగానది దర్శనంకన్నా స్పర్శనం (స్నానం) పదిరెట్లు ఎక్కువ పుణ్యాన్నిస్తుంది. గంగానదిలో సామాన్యమైన రోజు మౌసల(రోకలిలాగామునిగి లేచినా) స్నానంచేసినా కోటి జన్మల్లో చేసిన పాపం నశిస్తుంది. ఇక పుణ్యదినాల్లో చేసే గంగాస్నాన ఫలితాన్ని వేదాలు కూడా చెప్పలేవు.

**గంగాస్నాన ఫలం :** సూర్యసంక్రమణం రోజు, అమావాస్య, దక్షిణాయన, ఉత్తరాయణ పుణ్యకాలాలు, చాతుర్మాస్యకాలంలోని ఆషాఢశుద్ధ శ్రావణ శుద్ధ పూర్ణిమల్లో, సంవత్సరాదిరోజున, మాఘశుద్ధసప్తమి, భీష్మాష్టమి, అశోకాష్టమి, శ్రీరామనవమి లాంటి పుణ్యతిథుల్లో గంగాస్నానం చేస్తే

ఒకదాన్నికన్నా మరొకతిథి అత్యధికమైన పుణ్యఫలాన్నిస్తుంది. దశపాపహర తిథి అయిన విజయదశమినాడు గంగా స్నానం చేస్తే అనంతమైన పుణ్యఫలం ప్రాప్తిస్తుంది. సూర్య చంద్ర గ్రహణాల సమయంలో చేసే గంగాస్నానం మరీ మంచింది.

ఈవిధంగా గంగాదేవి గొప్పతనాన్ని వైభవాన్ని గంగ ఎదురుగానే వివరించి చెప్పటంతో గంగాదేవి ఎంతోసంతోషించింది. శ్రీకృష్ణుడి ఆజ్ఞ ననుసరించి భూలోకానికి వెళ్ళటానికి సిద్ధపడింది. ఒక్కసారి భక్తిగా ఆయనకి నమస్కరించి "స్వామీ! సరస్వతీదేవి శాపాన్ననుసరించి నేను భూలోకానికి వెళతాను అయితే ఎందరో పాపాత్ములు నాలోమునిగి తమ తమ పాపాల్ని పోగొట్టుకుంటారు సరే! వారి పాపాలన్నీ నాకంటుకుంటాయి కదా! మరి వాటిని నెనెట్లా పోగొట్టుకోవాలి? భరతభూమిలో నేను ఎంతకాలం ఉండాలి? తిరిగి నీలోకానికి ఎప్పుడు వస్తాను? దయచేసి చెప్పండి స్వామీ! అని ప్రార్థించింది.

గంగమాటలు విన్న కృష్ణపరమాత్మ "దేవీ! నీమనోరథాన్ని నేను గ్రహించాను. భూలోకంలో రుద్రరూపుడు, నాఅంశస్వరూపుడు అయిన సముద్రుడు నీకు భర్త అవుతాడు. సరస్వతిలాంటి ఇతర నదులున్నిటికన్నా సముద్రుడు నిన్నే ఎక్కువ ప్రేమిస్తాడు. నేటినుంచి నీవు కలియుగంలో ఐదువేల సంవత్సరాలవరకూ భరతభూమిలో ప్రవహిస్తావు. భారతీయులందరూ నిన్ను భగీరథుడు చేసే స్తోత్రంతో స్తుతించి నిన్ను సంతోషపెడతారు. వందయోజనాల దూరం నించి గంగా అని తలచినా చాలు వాడు పాపాలనుంచి విముక్తుడై విష్ణులోకానికి చేరుకుంటాడు.

వేలాదిమంది పాపాత్ములు నీలో స్నానం చేసినా నాభక్తులు నీలో స్నానం చేస్తే చాలు నీకు తగిలిన పాపాలన్నీ తొలగిపోతాయి. వేలాది పాపాత్ములశవాలు నీలో పడేసినా వాటి ద్వారా నీకు వచ్చిన పాపం నా మంత్రాన్ని జపించే సాధకులు నీలో స్నానం చేస్తే చాలు, ఆపాపం నశించిపోతుంది. అజ్ఞాని అయినా సరే నానామం ఉచ్ఛరించి నీలో స్నానంచేస్తే వాడికి నా సారూప్యముక్తిని

ప్రసాదిస్తాను” అని గంగకు ధైర్యం చెప్పాడు. తిరిగి భగీరథుడితో “భగీరథా! నీ కోరిక ప్రకారం గంగను పంపిస్తున్నాను. ఈమెని భక్తి శ్రద్ధలతో పూజించి నీ కోరికని సఫలం చేసుకోఅని చెప్పాడు.

## గంగాదేవి వర్ణన

శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన ప్రకారం భగీరథుడు గంగాదేవిని భక్తి శ్రద్ధలతో ఈవిధంగా ధ్యానించి, ఆమెగొప్పతనాన్ని ఘనంగా ఇలా వర్ణించాడు.

శ్వేత చంపకవర్ణాభాం గంగాం పాపప్రణాశినీం ।
కృష్ణవిగ్రహ సంభూతాం కృష్ణతుల్యాం పరాం సతీం ॥

వహ్నిశుద్ధాంశుకాధానాం రత్నభూషణ భూషితాం ।
శరత్పూర్ణేందు శతక ప్రభాజుష్ట కళేబరాం ॥

ఈషద్దాస ప్రసన్యాసాం శశ్వత్ సుస్థిర యౌవనాం ।
నారాయణ ప్రియాం శాంతాం సత్సౌభాగ్యసమన్వితాం ॥

బిభ్రతీం కబరీభారం మాలతీ మాల్య సంయుతాం ।
సిందూరబిందులలితాం సార్ధం చందన బిందుభిః ॥

కస్తూరీ పత్రకం గండే నానాచిత్ర సమన్వితం ।
పక్వ బింబ సమానైక చార్వోష్ఠపుటముత్తమం ॥

ముక్తాపంక్తి ప్రభాజుష్ట దంతపంక్తి మనోహరాం ।
సుచారు వక్త్రనయనాం సకటాక్ష మనోరమాం ॥

కఠినం శ్రీఫలాకారం స్తనయుగ్మం చ బిభ్రతీం ।
బృహచ్ఛ్రోణీం సు కఠినాం రంభాస్తంభపరిష్కృతాం ॥

స్థలపద్మ ప్రభాజుష్ట పాదపద్మయుగం ధరాం ।
రత్నాభరణ సంయుక్తాం కుంకుమాక్తాం సయావకాం ॥

దేవేంద్రమౌళి మందార మకరందకణారుణాం ।
సురసిద్ధమునీంద్రాది దత్తార్ఘ్యై సంయుతాం సదా ॥

తపస్విమౌళి వికర భ్రమరశ్రేణి సంయుతాం ।
ముక్తి ప్రదాం ముముక్షూణాం కామినాం స్వర్గభోగదాం ॥
వరాం వరేణ్యాం వరదాం భక్తానుగ్రహ కాతరాం ।
శ్రీవిష్ణోః పదదాత్రీం చ భజే విష్ణునదీం సతీం ॥

*(శ్లో. 97-107, అధ్యా-10, ఖం-2)*

ఈవిధంగా గంగాదేవిని ధ్యానించి తరువాత షోడశోపచారాలతో ఆమెని పూజించాలి. ఆసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనీయం, స్నానం, అనులేపనం, వస్త్రం, భూషణం, మాల్యం, గంధం, ధూపం, దీపం, నైవేద్యం, శీతలజలం, తాంబూలం శయ్య అనేవి షోడశోపచారాలు. ఈవిధంగా గంగాదేవిని పూజిస్తే అశ్వమేధయాగం చేసిన ఫలం లభిస్తుంది.

## భగీరథకృత గంగాదేవి స్తోత్రం

శివసంగీత సంముగ్ధ శ్రీ కృష్ణాంగద్రవోద్భవాం ।
రాధాంగద్రవసంభూతాం తాం గంగాం ప్రణమామ్యహం ॥
యాజన్మ సృష్టేరాదౌచ గోలోకే రాసమండలే ।
సన్నిధానే శంకరస్య తాం గంగాం ప్రణమామ్యహం ॥
గోపైర్గోపీభిరాకీర్ణే శుభేరాధామహోత్సవే ।
కార్తికీ పూర్ణిమా జాతాం తాం గంగాం ప్రణమామ్యహం ॥
కోటియోజన విస్తీర్ణా దైర్ఘ్యే లక్షగుణా తతః ।
సమావృతా యాగోలోకం తాం గంగాం ప్రణమామ్యహం ॥
షష్టిలక్షైర్యోజనైర్యో తతో దైర్ఘ్యే చతుర్గుణా ।
సమావృతా యా వైకుంఠం తాం గంగాం ప్రణమామ్యహం ॥
వింశల్లక్షైర్యోజనైర్యాతతో దైర్ఘ్యేచతుర్గుణా ।
ఆవృతా బ్రహ్మలోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
త్రింశల్లక్షై ర్యోజనైర్యా దైర్ఘ్యే పంచగుణా తతః ।
ఆవృతా శివలోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥

షడ్యోజన సువిస్తీర్ణా దైర్ఘ్యే దశగుణా తతః ।
మందాకినీ యేంద్రలోకే తాం గంగాం ప్రణమామ్యహం ॥
లక్షయోజన విస్తీర్ణా దైర్ఘ్యే సప్తగుణా తతః ।
ఆవృతా ధ్రువలోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
లక్షయోజన విస్తీర్ణా దైర్ఘ్యే షడ్గుణితా తతః ।
ఆవృత చంద్రోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
యోజనైష్షష్టి సాహస్రైః దైర్ఘ్యే దశగుణా తతః ।
ఆవృతా సూర్యలోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
లక్షయోజన విస్తీర్ణా దైర్ఘ్యే షడ్గుణితా తతః ।
ఆవృతా సత్యలోకం యా  తాం గంగాం ప్రణమామ్యహం ॥
దశలక్షైర్యోజనైర్యా దైర్ఘ్యే పంచగుణా తతః ।
ఆవృతా యాతపోలోకం తాం గంగాం ప్రణమామ్యహం ॥
సహస్రయోజనాఽయాచ దైర్ఘ్యే పంచగుణా తతః ।
ఆవృతా జనలోకం యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
సహస్రయోజనాయామే దైర్ఘ్యే సప్తగుణా తతః ।
ఆవృతా యా చ కైలాసం తాం గంగాం ప్రణమామ్యహం ॥
పాతాళే యా భోగవతీ విస్తీర్ణా దశయోజనే ।
తతో దశగుణా దైర్ఘ్యేతాం గంగాం ప్రణమామ్యహం ॥
క్రోశక మాత్ర విస్తీర్ణా తతః క్షీణా నకుత్రచిత్ ।
క్షితౌ చాలకనందా యా తాం గంగాం ప్రణమామ్యహం ॥
సత్యే యాక్షీరవర్ణా త్రేతాయామిందు సన్నిభా ।
ద్వాపరే చందనాభా చ తాం గంగాం ప్రణమామ్యహం ॥
జలప్రభా కలౌ యా చ నాన్యత్ర పృథివీతలే ।
స్వర్గే చ నిత్యం క్షీరాభా చ తాం గంగాం ప్రణమామ్యహం ॥
యస్యాః ప్రభావ అతులః పురాణే చ శ్రుతౌ శ్రుతః ।
యా పుణ్యదా పాపహర్త్రీ తాం గంగాం ప్రణమామ్యహం ॥

**గంగాస్తోత్ర పారాయణ ఫలం :** భగీరథుడు పరమభక్తితో చేసిన ఈ గంగాస్తోత్రాన్ని ప్రతిరోజు పఠించేవాడు, గంగాస్నానఫలితాన్ని పొందుతాడు. పుత్రులు లేనివాడికి పుత్రులు, భార్యలేని వారికి భార్య, అనారోగ్య వంతుడికి ఆరోగ్యం, మూర్ఖుడికి పాండిత్యం, దరిద్రుడికి ఐశ్వర్యం లాంటి శుభఫలితాలు లభిస్తాయి.

ఈవిధంగా భగీరథుడు కఠోరదీక్షతో శ్రీకృష్ణుణ్ణి మెప్పించి గంగాదేవిని భూమిమీదకి తెచ్చాడు. గంగాదేవి భగీరథుడి వెంట ప్రవహించి సగరపుత్రుల భస్మాలున్న ప్రాంతానికి చేరి వారందరినీ స్పర్శించింది. గంగాదేవి స్పర్శతో సగరపుత్రులందరూ వైకుంఠధామానికి చేరుకున్నారు. భగీరథుడు భూమిమీదకి గంగను తెచ్చిన కారణంగా నాటినుంచి ఆమెకి భాగీరథి అనేపేరు వచ్చింది.

## తులసీ మాహాత్మ్యం

పవిత్రమైన దేవతార్చనలో తులసికి ఎంతో ప్రాధాన్యముంది. శ్రీకృష్ణుడి అత్యంత ప్రీతిపాత్రమైనది తులసీదళం. ఈ తులసీ దళాలనే మాలగా చేసి శ్రీకృష్ణుడు ఎప్పుడూ మెడలో ధరిస్తాడు. పుణ్యప్రదమైన తులసీ వృక్షం కింద సమస్త దేవతలూ నివసిస్తారు. తులసి ఆకులు పడిన ప్రదేశం కూడాఎంతో పవిత్రమైనదే. తులసీపత్రాలు వేసిన నీళ్ళతో స్నానంచేసిన వాడు పవిత్రుడవుతాడు. సమస్త తీర్థాలలో పుణ్యస్నానం ఆచరించిన ఫలితం అతడికి లభిస్తుంది. అలాగే సమస్తయజ్ఞాలు చేసిన ఫలం కూడా ప్రాప్తిస్తుంది. తులసీపత్రాలతో నారాయణుణ్ణి అర్చిస్తే ఆయన ఎంతో సంతోషిస్తాడు. అలాచేసినవాడికి లక్షగోవుల్ని దానం చేసిన ఫలితం లభిస్తుంది.

మానవుడు మృతిచెందే సమయంలో తులసీతీర్థం ఇస్తే మరణించాక ఆవ్యక్తి తనపాపాలన్నిటినీ తొలగించుకుని విష్ణులోకానికి వెళతాడు. అలాగే ప్రతిరోజూ తులసి తీర్థాన్ని భక్తితో త్రాగే మానవుడికి జీవన్ముక్తి లభిస్తుంది. అంతేకాదు పవిత్రమైన గంగానదిలో స్నానంచేసిన ఫలితం కలుగుతుంది.

ప్రతిరోజూ తులసీదళాలతో కృష్ణ పరమాత్మని పూజించినవాడు లక్ష అశ్వమేధయాగాలు చేసినంతపుణ్యం ప్రాప్తిస్తుంది. తులసీదళం చేతిలో వుండగా

మరణించినవాడు సరాసరి వైకుంఠానికి చేరుకుంటాడు. తులసిమాలను ధరించినా అనంతమైన పుణ్యం మానవులకి లభిస్తుంది. ఎవడైతే తులసీ పత్రాన్ని చేత్తోతాకి తిరస్కరిస్తాడో, వాడు సూర్యచంద్రులు ఉన్నంత వరకూ నరకంలోనే వుంటాడు. అలాగే తులసీ పత్రాన్ని తాకి తప్పుడు ప్రమాణం చేస్తే కుంభీపాక నరకంలో పడతాడు.

పౌర్ణమినాడు గానీ, అమావాస్య, ద్వాదశి, సూర్య సంక్రమణం, తైలాభ్యంగనం చేసేప్పుడు, స్నానం చేయకుండా, మధ్యాహ్న సమయంలో, రాత్రిపూట, ఉదయసాయం సంధ్యల్లో, అశుచిగా వున్నప్పుడు, జాతా, మృతాశౌచ సమయాలలో, రాత్రి ధరించిన వస్త్రాలు అలాగే వంటిమీద ఉన్నప్పుడు తులసీదళాన్ని తెంచకూడదు. అలా తెంపితే శ్రీమహావిష్ణువు తలని ఛేదించినంత పాపం కలుగుతుంది.

శ్రాద్ధకాలంలో, వ్రతాలు ఆచరించేడప్పుడు, దానం చేసేప్పుడు, దేవతావిగ్రహాల ప్రతిష్ఠాకాలంలో, దేవతార్చనలో ఉపయోగించిన తులసీదళం మూడు రోజులదాకా పవిత్రంగానే వుంటుంది. విష్ణువుకి సమర్పించిన తులసీదళం భూమిమీద పడినప్పటికీ దాన్ని కడిగి ఇతర కార్యాలకి ఉపయోగించవచ్చు. ఇలా పరమపవిత్రమైన తులసి గండకీనదికి అధిష్ఠాన దేవతగా వుండి భారతీయులందరి చేతా పూజలందుకుంటుంది.

## శ్రీకృష్ణుడు చేసిన తులసీస్తుతి

బృందారూపాశ్చ వృక్షాశ్చ యదైకత్ర భవంతి హి ।
విదుర్బుధాస్తేన బృందాం మత్ప్రియాం తాం భజామ్యహం ॥
పురా బభూవ యా దేవీ హ్యాదౌ బృందావనే వనే ।
తేన బృందావనీ ఖ్యాతా తాం సౌభాగ్యాం భజామ్యహం ॥
అసంఖ్యేషు చ విశ్వేషు పూజితా యా నిరంతరం ।
తేన విశ్వపూజితాఖ్యాం జగత్పూజ్యాం భజామ్యహం ॥
అసంఖ్యాని చ విశ్వాని పవిత్రాణి యయా సదా ।
తాం విశ్వపావనీం దేవీం విరహేణ స్మరామ్యహం ॥

దేవా నతుష్టాః పుష్పాణాం సమూహేన యయా వినా ।
తాం పుష్పసారాం శుద్ధాం చ ద్రష్టుమిచ్ఛామి శోకతః ॥
విశ్వే యత్ప్రాప్తి మాత్రేణ భక్త్యానందో భవేత్ ధ్రువం ।
నందినీ తేన విఖ్యాతా సా ప్రీతా భవితా హి మే ॥
యస్యా దేవ్యాస్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషు చ ।
తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియే ॥
కృష్ణజీవన రూపా యా శశ్వత్ప్రియతమా సతీ ।
తేన కృష్ణజీవనీతి మమ రక్షతు జీవనం ॥

*(శ్లో. 18-25, అధ్యా-22, ఖం-4)*

పూర్వం సరస్వతీదేవి వల్ల అవమానం పొందిన తులసి కోపంతో శ్రీహరి దగ్గర్నుంచి అంతర్ధానమై వెళ్ళిపోయింది. అప్పుడాయన తులసీవనానికి వెళ్ళి తులసిని ఘనంగా ఇలా స్తుతించాడు. ఆ తరువాత

**తులసీమంత్రం : 'శ్రీం హ్రీం క్లీం ఐం బృందావన్యై స్వాహా'** అనే మంత్రంతో తులసీదేవిని శాస్త్రోక్తంగా పూజించాడు. ఆవిధంగా శ్రీహరి చేసిన స్తోత్రానికి, పూజకి కోపం కరిగిపోయిన తులసి వెంటనే అక్కడికి వచ్చి శ్రీహరి పాదాలు మీద పడి క్షమించమని ప్రార్థించింది. అప్పుడు శ్రీహరి ఆమెని అనునయించి. "నేటినుంచి నిన్ను నా తలమీద, హృదయంమీద ఎల్లప్పుడూ ధరిస్తాను, అలాగే దేవతలు, మానవులు కూడా నిన్ను పవిత్రంగా పూజిస్తారు" అని వరమిచ్చాడు.

## సాలగ్రామ మాహాత్మ్యం

శ్రీమన్నారాయణుడు ఒకప్పుడు తులసీదేవిని శంఖచూడుడి రూపంతో వెళ్ళి మోసగించాడు. అంతేకాదు అదే రూపంతో ఆమెతో సంభోగించాడు. శంఖచూడుడు తులసి భర్త శ్రీహరి మారురూపంలో రాకముందే అతడు శివుడిచేతిలో మరణించాడు. సంభోగానంతరం వచ్చింది తన భర్త శంఖచూడుడు కాదని గ్రహించింది తులసి వెంటనే ఆగ్రహంతో అతన్ని ఎవరునీవు వెంటనే చెప్పలేకపోతే ఇప్పుడే శపిస్తా అని ఆగ్రహంగా అన్నది. ఆమె మాటుల విని శ్రీహరి కంగారుగా తన నిజరూపాన్ని ధరించాడు. ఒక్కసారిగా ఆయన్ని చూసి తులసి మూర్ఛపోయింది. కొద్ది సేపటికి తిరిగి తెలివి తెచ్చుకుని ఆయనతో ఇలా అన్నది.

"నారాయణా! నీకుదయన్నదే లేదు. అన్యాయంగా నా భర్తని మోసగించి అధర్మపద్ధతిలో చంపావు. నీలాంటి కఠినాత్ముడు ఇంకెవరూ ఉండరు. కనుక నీవు భూలోకంలో పాషాణ రూపాన్ని పొందు. ఇదే నేను నీకిచ్చే శాపం. అజ్ఞానులైన కొందరు నిన్ను దయామయుడని అంటారు. కానీ నీవు పాషాణుడివి. నీకు ఇతరుల దుఃఖాలతో పనిలేదు" అని శపించి తిరిగి ఆయన పాదాల మీద పడి దుఃఖించ సాగింది.

శ్రీహరి నెమ్మదిగా ఆమెని లేవనెత్తి "దేవీ! నీవేమీ దుఃఖించకు. జరిగినదానిలో నీతప్పేమీలేదు. పూర్వం నీవు నన్ను భర్తగా పొందాలని ఎన్నో వందల సంవత్సరాలు తపస్సు చేసావు. అలాగే శంఖచూడుడు కూడా నీ కోసం తపస్సు ఆచరించాడు. అతడు తపస్సు ఫలించి ముందుగా అతడికి భార్యవయ్యావు. నీభర్తకి ఆయువు తీరింది మరణించాడు. ఇకనీవు చేసిన తపస్సు ఫలితం ఇప్పుడు లభించింది. నీవు ఈ శరీరాన్ని వదిలి దివ్యదేహాన్ని ధరించి లక్ష్మీదేవితో పాటు నన్ను సేవించుకో, ప్రస్తుతం వున్న నీ పార్థివశరీరం 'గండకీ' అనే పేరుతో ఒక నదిగా మారి భరతఖండంలో ప్రవహిస్తుంది. నీతల వెంట్రుకలు పుణ్యవృక్షాలై తులసిచెట్లు అన్న పేరుతో ప్రసిద్ధి చెందుతాయి" అని ఆమెని ఓదార్చాడు.

"ఓ తులసీ! నేను నీ శాపాన్ని అనుసరించి భరతఖండంలో గండకీ నదిలో సాలగ్రామ శిలారూపాన్ని ధరిస్తాను. వజ్రాల్లాంటి పళ్ళువున్న వజ్రకీటకాలు ఆశిలల్లోకి ప్రవేశించి, చక్రాల్లాంటి ఆకారాన్ని రూపొందిస్తాయి. ఇవి వివిధరకాలుగా ఏర్పడి నాభక్తుల చేత పూజలందుకుంటాయి" అని చెప్పాడు.

## సాలగ్రామ శిలలు

1. **లక్ష్మీనారాయణం :** గండకీనదీ తీరంలో లభించే సాలగ్రామ శిలలో ఒకేరంధ్రం ఉండి, అందులో నాలుగు చక్రాలుంటే దాన్ని లక్ష్మీనారాయణ సాలగ్రామం అంటారు. ఇది నల్లగా వుంటుంది.

**2. లక్ష్మీజనార్దనం :** ఒకే రంధ్రంలో నాలుగు చక్రాలుండి వనమాలలేని నల్లటి శిలని లక్ష్మీ జనార్దన సాలగ్రామం అంటారు.

**3. రఘునాథసాలగ్రామం :** రెండు రంధ్రాలలో నాలుగు చక్రాలు గోష్పాదం వుండి, వనమాలలేకుండా వుండే శిలని రఘునాథ సాలగ్రామం అంటారు.

**4. దధివామనం :** నల్లగా, రెండు చక్రాలతో చిన్నదిగా వుండే శిలని దధివామన సాలగ్రామం అని పిలుస్తారు. ఈ సాలగ్రామాన్ని గృహస్థులు ఆచరిస్తే శుభం జరుగుతుంది.

**5. శ్రీధరం :** రెండు చక్రాలు, వనమాల కలిగిన చిన్న శిలని శ్రీధరసాలగ్రామం అంటారు. ఇదికూడా సంసారుల్ని తరింపచేస్తుంది.

**6. దామోదరం :** గుండ్రంగా లావుగా వుండి రెండు చక్రాలు లేక వనమాల స్పష్టంగా కనిపిస్తే దాన్ని దామోదర సాలగ్రామం అంటారు.

**7. రణరామం :** బాణాలు లేకుండా, రెండు చక్రాలతో, గుండ్రంగా వుండి, మరీపెద్దది, మరీచిన్నది కాక మధ్యస్థంగా వుండే శిలని రణరామ సాలగ్రామం అంటారు.

**8. రాజేశ్వరం :** ఏశిలలో ఏడు చక్రాలు, ఒక ఛత్రం, బాణం కలిగి అది మధ్యమాకారంలో వుంటుందో దాన్ని రాజేశ్వర సాలగ్రామం అని పిలుస్తారు. ఈ సాలగ్రామాన్ని పూజిస్తే రాజ్యం, సంపదలు కలుగుతాయి.

**9. అనంతం :** పద్నాలుగు చక్రాలతో నల్లగా, లావుగా వుండే శిలని అనంతసాలగ్రామం అంటారు. ఇది ధర్మార్థకామమోక్షాల్ని ప్రసాదిస్తుంది.

**10. మధుసూదనం :** లక్ష్మీరూపాన్ని, రెండు చక్రాల్ని, గోష్పాదాన్ని కలిగి చక్రాకారంతో మధ్యమంగా వున్న నల్లటి శిలని మధుసూదన సాలగ్రామం అని సంబోధిస్తారు.

**11. హయగ్రీవం :** రెండు చక్రాలతో శుద్ధ స్ఫటికకాంతితో వుండే శిలని హయగ్రీవ సాలగ్రామం అంటారు.

**12. సుదర్శనం :** ఒకే చక్రం వున్న సాలగ్రామాన్ని సుదర్శనం అంటారు

**13. గదాధరం :** ఏశిలలోనైతే ఒక్క చక్రం కూడా వుండదో దాన్ని గదాధర సాలగ్రామం అని పిలుస్తారు.

**14. నారసింహం :** వెడల్పైన రంధ్రాలతో, రెండు చక్రాలు కలిగి, వికటంగా వుండేశిలని నారసింహ సాలగ్రామం అని వ్యవహరిస్తారు. ఈ సాలగ్రామాన్ని ఆరాధిస్తే వైరాగ్యం కలుగుతుంది.

**15. లక్ష్మీనృసింహం :** వెడల్పైన రంధ్రాలు, వనమాల, రెండుచక్రాలు కలిగి వున్న శిలని లక్ష్మీ నృసింహసాలగ్రామం అనిపిలుస్తారు. ఇది లక్ష్మీ ప్రదమైనది. దీన్ని పూజించే గృహస్థులకి సుఖసంపదలు కలుగుతాయి.

**16. వాసుదేవం :** ఏశిలకి రంధ్రం మొదట్లోనే రెండు చక్రాలు సమానంగా, లక్ష్మితో కలిసి వుంటాయో దాన్ని వాసుదేవసాలగ్రామం అంటారు దీన్ని పూజిస్తే సమస్త సంపదలూ లభిస్తాయి.

**17. ప్రద్యుమ్నం:**సూక్ష్మంగా చక్రం వుండి రంధ్రంలో ఎక్కువ ఛిద్రాలుంటే ఆశిలని ప్రద్యుమ్న సాలగ్రామం అంటారు. ఇది సంసారుల చేత పూజించ తగింది.

**18. సంకర్షణం :** రెండు చక్రాలు ఒకదానితో ఒకటి తగులుకొని, దాని క్రింది భాగం విశాలంగా వుంటే ఆశిలని సంకర్షణ సాలగ్రామం అని వ్యవహరిస్తారు. ఇదికూడా గృహస్థులకు శుభాన్ని కలిగించేదే.

**19. అనిరుద్ధం :** పచ్చటి కాంతితో గుండ్రంగా వుండే శిలనే అనిరుద్ధ సాలగ్రామం అంటారు. దీన్ని పూజించిన వారికి సుఖశాంతులు లభిస్తాయి. ఈ సాలగ్రామం ఉన్నచోట శ్రీహరి కొలువుంటాడు. అక్కడ లక్ష్మీదేవి సకల పుణ్యతీర్థాలతో నివసిస్తుంది.

## సాలగ్రామ పూజాఫలం

పరమపవిత్రమైనవి, విష్ణుస్వరూపమైనవి సాలగ్రామాలు. వీటిని పూజించిన వారికి బ్రహ్మహత్యాది పాపాలు కూడా సమూలంగా నశించిపోతాయి.

సాలగ్రామం ఛత్రాకారంలో వుంటే అది రాజ్యాన్ని ప్రసాదిస్తుంది. గుండ్రంగా వున్న సాలగ్రామాన్ని పూజిస్తే అధికంగా సంపదలు కలుగుతాయి. రథం ఆకారంలో వున్న సాలగ్రామం దుఃఖాన్నిస్తుంది. శూలంచివరి మొనలాగా వాడిగా వున్న సాలగ్రామం మరణాన్ని కలిగిస్తుంది. అలాగే వికృతంగా కనిపించే సాలగ్రామం దారిద్ర్యాన్ని, నలుపు పసుపురంగు కలిసిన సాలగ్రామం కష్టాల్ని, విరిగిన చక్రంతో వున్న సాలగ్రామం వ్యాధుల్ని, పగిలిపోయిన సాలగ్రామం ఇంటి యజమానికి అరిష్టాల్ని కలిగిస్తుంది. కనుక సాలగ్రామాన్ని జాగ్రత్తగా పరిశీలించి ఎన్నుకోవాలి.

సాలగ్రామ పూజ ఏ ఇంటిలో నిత్యం జరుగుతూవుందో, ఆ ఇంట్లో చేసిన వ్రతాలు, దానాలు, ధర్మాలు, పూజలు, శ్రాద్ధాలు సత్వరమే ఫలిస్తాయి. సాలగ్రామాన్ని నిత్యం అభిషేకించాలి. ఆ అభిషేక జలాన్ని తలపై చల్లుకోవాలి. అలా ఎవడైతే చేస్తాడో అలాంటివాడి స్పర్శని పుణ్యతీర్థాలన్నీ కోరుకుంటాయి. సాలగ్రామాన్ని అర్చించిన వాడికి సకల వేదాలు పురాణాలు శాస్త్రాలు చదివిన ఫలితం, లభిస్తుంది. సాలగ్రామ తీర్థాన్ని మృత్యు సమయంలో సేవిస్తే అతడు వైకుంఠానికి చేరుకుంటాడు.

సాలగ్రామాన్ని చేతిలో పెట్టుకుని అబద్ధం చెబితే నరకానికి వెళతాడు. సాలగ్రామాన్ని దూషిస్తే లక్షమన్వంతరాల వరకూ 'అసిపత్రం' అనే నరకంలో బాధలు అనుభవిస్తాడు. సాలగ్రామం మీద తులసి ఆకుల్ని తుంచి వేయకూడదు. అలావేసిన వాడికి మరుజన్మలోభార్యావియోగం సంభవిస్తుంది.

శంఖంమీద కూడా తులసీ పత్రాల్ని తెంపి వేయకూడదు. అలావేస్తే ఏడుజన్మల పాటు దీర్ఘవ్యాధిని అనుభవిస్తాడు. భార్యాహీనుడవుతాడు కనుక చాలా జాగ్రత్తగా సాలగ్రామ పూజని ఆచరించాలి. సాలగ్రామాన్ని తులసీ దళాన్ని శంఖాన్ని ఒకచోట ఉంచి పూజించినవాడికి అనంతమైన జ్ఞానం లభిస్తుంది. శ్రీహరి దివ్యానుగ్రహం కూడా కలుగుతుంది.

## సావిత్రి చేసిన యముడి అష్టకం

పరమపతివ్రత అయిన సావిత్రి తన భర్త సత్యవంతుణ్ణి తిరిగి బ్రతికించుకోవటం కోసం యమధర్మరాజుని దివ్యంగా స్తుతించింది. సావిత్రి చేసిన ఈ స్తుతివల్ల యముడు సంతోషించి ఆమె భర్త సత్యవంతుడి ప్రాణాల్ని తిరిగి ప్రసాదించాడు.

తపసా ధర్మమారాధ్య పుష్కరే భాస్కరః పురా ।
ధర్మాంశం యం సుతం ప్రాప ధర్మరాజం మామ్యహం ॥

సమతా సర్వభూతేషు యస్య సర్వస్య సాక్షిణః ।
అతో యన్నాను శమనమితి తం ప్రణమామ్యహం ॥

యేనాంతశ్చ కృతో విశ్వే సర్వేషాం జీవినాం పరం ।
కర్మానురూపకాలేన తం కృతాంతం నమామ్యహం ॥

భిభర్తి దండం దండ్యాయ పాపినాం శుద్ధిహేతవే ।
నమామి తం దండధరం యః శాస్తా సర్వ కర్మణాం ॥

విశ్వే యః కలయత్యేవ సర్వాయుశ్చాపి సంతతం ।
అతీవ దుర్నివార్యం చ తం కాలం ప్రణమామ్యహం ॥

తపస్వీ వైష్ణవో ధర్మీ సంయమీ విజితేంద్రియః ।
జీవినాం కర్మఫలదం తం యమం ప్రణమామ్యహం ॥

స్వాత్మారామం చ సర్వజ్ఞో మిత్రం పుణ్యకృతాం భవేత్ ।
పాపినాం క్లేశదో యశ్చ పుణ్యం మిత్రం నమామ్యహం ॥

యజ్జన్మ బ్రహ్మణో వంశే జ్వలంతం బ్రహ్మ తేజసా ।
యో ధ్యాయతి పరం బ్రహ్మ బ్రహ్మవంశం నమామ్యహం ॥

*(శ్లో॥8-15,అధ్యా-24,ఖం-2)*

**స్తోత్రఫలం :** పరమభక్తితో సావిత్రిచేసిన ఈ యమాష్టకం ఎంతో మహిమోపేతమైనది. ఈ స్తోత్రపఠనం వల్ల యమధర్మరాజు ఎంతో సంతోషిస్తాడు. ప్రతిరోజూ ఉదయం నిద్రలేచాక ఈ యమాష్టకాన్ని భక్తి శ్రద్ధలతో పఠించిన వాడికి యమబాధలు ఉండవు. అతడి పాపాలన్నీ నశించిపోతాయి.

# 86 నరక కుండాలు

యమధర్మరాజు సావిత్రికి నరకలోకంలో వుండే వివిధరకాల కుండాల గురించి, వివరించాడు. పురాణాలలో నరకాల పేర్లు కొంత వైవిధ్యంగా కనిపిస్తాయి. జీవులు చేసిన పాపాల్ని అనుసరించి వారు నరకకుండాల్లో పడుతుంటారు. ఈ కుండాలు చాలాభయంకరంగా, ఘోరంగా వుంటాయి. వీటిలో కొన్ని మహానీచంగా వుంటాయి. యమలోకంలో వుండే నరకకుండాలు మొత్తం ఎనభైఆరు. వారి పేర్లు ఇవి –

వహ్నికుండం, తప్తకుండం, క్షమకుండం, మలకుండం, మూత్రకుండం, సహించలేని శ్లేష్మకుండం, గరళ(విష)కుండం, దూషికాకుండం, వసాకుండం, శుక్రకుండం, రక్తకుండం, అశ్రుకుండం, శరీరమలకుండం, చెవిలోని మలకుండం, మజ్జాకుండం, మాంసకుండం, నఖ(గోర్లు)కుండం, కోమకుండం, కేశకుండం, అస్థికుండం, భరించరానివేడితో వున్న తామ్రకుండం, లోహకుండం, వాడిముళ్ళు గల కుండం, విషకుండం, ధర్మకుండం, బాగామరుగుతున్న సురా(సారాయి)కుండం అనేవి.

ఇంకా మరికొన్ని ఘోరమైన కుండాలున్నాయి. ప్రతప్తతైలకుండం, దంతకుండం, కృమికుండం, పూయకుండం, సర్పకుండం, మశక(దోమల) కుండం, దంశకుండం, వజ్రదంష్ట్రకుండం, ఖడ్గకుండం, గోళకుండం, నక్రకుండం, కాకకుండం, సంచాలకుండం, వాజకుండం, బంధకుండం, తప్తపాషాణకుండం, తీక్షణపాషాణకుండం, లాలాకుండం, అసకుండం, చూర్ణకుండం, చక్రకుండం, వజ్రకుండం, కూర్మకుండం, జ్వాలాకుండం, భస్మకుండం, తప్తసూర్యకుండం, అసిపత్రకుండం, క్షురధారకుండం, సూచీముఖకుండం, గోముఖకుండం, నక్రముఖకుండం, గజదంశకుండం, గోముఖకుండం, కుంభీపాకకుండం, కాలసూత్ర కుండం

అవటోదకుండం, అరుంతుదకుండం,పాంశుభోజకుండం, పాశవేష్టకుండం, శూలప్రోతకుండం, ప్రకంపనకుండం, ఉల్కాముఖకుండం,

అంధముఖకుండం, వేదనకుండం, దంతతాడన కుండం, జలాబంధకుండం, దేహచూర్ణకుండం, దశనశోషణకుండం, సర్పజ్వాలాముఖకుండం, జహ్మకుండం, ధూమాంధకుండం, నాగావేష్టనకుండం, అనేవి నరకంలో వున్న ప్రధానమైన కుండాలు. ఈ కుండాలన్నీ నరకానికి చేరిన పాపాత్ముల్ని అతిభయంకరంగా శిక్షిస్తాయి.

పై నరకాలన్నిటిలో దండాన్ని, శూలాన్ని, పాశాన్ని, శక్తిని, గదిని కలిగిన యమకింకరులుంటారు. వారు భయంకరమైన తమోగుణంతో నిండిపోయిన కింకరులు. వారికళ్ళు పింగళ వర్ణంతో వుంటాయి. జీవులకి మృత్యువు సంభవించినప్పుడే వారు కనిపిస్తారు. తమ తమ ధర్మాల్ని సక్రమంగా ఆచరిస్తున్న శివభక్తులకి, శక్తి భక్తులకి, విష్ణుభక్తులకి, సూర్యభక్తులకి, గణపతి భక్తులకి, మహాపుణ్యం చేసే సిద్ధులకి వీరు ఎప్పుడూ కనిపించరు.

## మహాలక్ష్మీదేవి చరిత్ర

పూర్వం సృష్టి ప్రారంభంలో ఆది పురుషుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మ ఎడమభాగం నుంచి ఒక దేవి కుడిభాగం నుంచి మరోదేవి ఆవిర్భవించారు. వారిద్దరూ నవయవ్వనంతో, తెల్లని చంపకపుష్పాలకాంతితో, శరత్కాలచంద్రుడు లాంటి దివ్యమైన ముఖసౌందర్యంతో, పద్మాల్లాంటి కళ్ళతో వెలుగొందుతున్నారు. కృష్ణపరమాత్మ నుంచి వెలసిన ఆ ఇద్దరి రూపం, రుస, కాంతి, వయసు, వస్త్రాలు, ఆభరణాలు, గుణాలు, హావభావ విన్యాసాలు, నడక, మాట వంటి లక్షణాలన్నీ సమానంగా ఉన్నాయి.

వీరిలో కృష్ణపరమాత్మకుడి భాగం నుంచి ఆవిర్భవించిన దేవి 'రాధ' కాగా ఎడమభాగం నుంచి ఉదయించిన దేవి 'మహాలక్ష్మి' ఆది పురుషుడైన శ్రీకృష్ణుడు వీరిద్దరికీ న్యాయం చేయాలని భావించి తన నుంచి చతుర్భుజుడైన నారాయణుణ్ణి సృష్టించాడు. అప్పుడు రాధా దేవి శ్రీకృష్ణుణ్ణి వరించగా మహాలక్ష్మి నారాయణుణ్ణి వరించింది.

తన చల్లని చూపుల్తో సకలలోకాలనీ ఎప్పుడూ రక్షించేది, దేవతా స్త్రీలందరి కన్నా శ్రేష్ఠురాలు కాబట్టి ఆమె మహాలక్ష్మి అయ్యింది. అటువంటి లక్ష్మీదేవిని నారాయణుడు స్వీకరించి వైకుంఠానికి వెళ్ళగా, ద్విభుజుడైన శ్రీకృష్ణపరమాత్మ రాధాదేవితో, గోపికలతో కలిసి గోకులంలోనే ఉండిపోయాడు.

వైకుంఠాన్ని చేరిన మహాలక్ష్మి తనయోగ శక్తితో ఎన్నో రూపాలుగా మారింది. ఆదేవి వైకుంఠ ధామంలో శ్రీమన్నారాయణుడి పత్నిగా శుద్ధ సత్త్వస్వభావంతో ఉంటుంది. ఆమె సకల సౌభాగ్యాలనీ ప్రసాదించే చల్లని తల్లి. స్త్రీలందరిలో ప్రేమ మూర్తిగా ఆమె కొలువుంటుంది.

ఈ మహాలక్ష్మీదేవి, స్వర్గంలో ఇంద్రుడి రాజ్య సంపద అయిన స్వర్గలక్ష్మిగా రూపొందింది. అదేవిధంగా భూలోకంలో, పాతాళలోకంలో వున్న రాజులకి రాజ్యలక్ష్మిగా మారింది. అందరి ఇళ్ళలో గృహలక్ష్మిగా, ఇంటి యజమానులకు ఐశ్వర్యలక్ష్మిగా, ఆవుల్లో గోమాత అయిన సురభి(కామధేనువు)గా, యజ్ఞపురుషుడి భార్య అయిన దక్షిణాదేవిగా, క్షీరాబ్ధి కన్యగా, చంద్రుడిలో, సూర్యుడిలో సమస్త ఆభరణాలలో, జలాలలో శోభారూపిణిగా నెలకొంది. అంతేకాదు సస్యరూపంలో ధాన్యలక్ష్మిగా, దేవప్రతిమల్లో కళాలక్ష్మిగా, రత్నాలలో మాణిక్యాలలో వైభవలక్ష్మిగా, అందమైన వృక్షాలలో వనలక్ష్మిగా కూడా రూపొందింది.

మహావైభవంతో విలసిల్లే లక్ష్మీదేవిని నారాయణుడు మొదటి సారిగా వైకుంఠంలో పూజించాడు. తరువాత బ్రహ్మదేవుడు ఆదేవిని శ్రద్ధగా పూజించగా, ఆతరువాత శంకరుడు ఆమెని అర్చించాడు. ఇక క్రమంగా సకల సంపదల్ని సుఖాల్ని ప్రసాదించే ఆమహాలక్ష్మిని భూలోకంలో, మానవులు, మహారాజులు, ఋషులు, మునులు, గృహస్థులు ఆనాటి నుంచీ పూజిస్తున్నారు. వీరితో పాటు దేవలోకవాసులైన యక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, పాతాళలోకవాసులైన నాగులు తదితర జాతులవారు లక్ష్మీదేవిని భక్తితో ఆరాధిస్తున్నారు.

భాద్రపద శుద్ధ అష్టమినుంచి వరుసగా పదిహేనురోజులు బ్రహ్మదేవుడు లక్ష్మీపూజచేసాడు. అలాగే శ్రీమహావిష్ణువు చైత్ర, పుష్య, భాద్రపద మాసాల్లో ప్రతిమంగళవారం లక్ష్మీపూజచేయగా మనువు లక్ష్మీదేవని ఫాల్గుణ, పుష్యమాసాలలో అర్చించాడు. (అనగా ఈ తెలిపిన రోజులన్నీ లక్ష్మీదేవికి అత్యంత ప్రీతి పాత్రమైన తిధులు, మాసాలు, అని గ్రహించాలి)

పూర్వం ఈ లక్ష్మీ దేవిని 'మంగళుడు' అనే మహారాజు పూజించటం వల్ల ఆమెకి 'మంగళ' అనే పేరు వచ్చింది. కాలక్రమంలో కేదారుడు, నీలుడు, నలుడు, సుబలుడు, ధ్రువుడు, ఉత్తానపాదుడు, ఇంద్రుడు, బలిచక్రవర్తి, కశ్యప ప్రజాపతి, దక్షుడు, సూర్యుడు, కర్దమముని, ప్రియవ్రతుడు, చంద్రుడు, కుబేరుడు, వాయువు, యముడు, అగ్ని వరుణులు మహాలక్ష్మీ దేవిని పూజించి తరించారు.

ఈవిధంగా శ్రీకృష్ణ పరబ్రహ్మ నుంచి ఆవిర్భవించి నారాయణుణ్ణి పతిగా చేసుకున్న మహాలక్ష్మీదేవి నాటినుంచి నేటి వరకూ అందరిచేతా పూజలందుకుంటోంది. సమస్త ఐశ్వర్యాలకీ అధిష్ఠాత్రి అయిన లక్ష్మిని పూజిస్తే సకల సంపదలూ వారివశమవుతాయి.

## మహాలక్ష్మీదేవి పూజావిధి

పూర్వం దేవేంద్రుడు మహాలక్ష్మీదేవిని వివిధ ఉపచారాలతో శాస్త్రోక్తంగా పూజించి ఆమె అనుగ్రహాన్ని పొందాలనుకున్నాడు. వెంటనే క్షీరసముద్రానికి వెళ్ళి స్నాన సంధ్యాదికాలు ముగించుకుని, నూతన వస్త్రాలు ధరించి, ఆ సముద్ర తీరంలో ఒక పూజా కలశాన్ని స్థాపించాడు. ముందుగా గణపతి సూర్య, అగ్ని, విష్ణు, శివులని, దుర్గాదేవిని ధ్యానించి తరువాత ఆ కలశంలోకి మహదైశ్వర్య స్వరూపిణి అయిన మహాలక్ష్మిని ఆవాహన చేసాడు. లక్ష్మీదేవి స్థిరంగా కొలువున్న ఆ కలశాన్నే లక్ష్మీస్వరూపంగా భావించి పారిజాత పుష్పాలతో ధ్యాన ఆవాహనాది ఉపచారాలు సమర్పిస్తూ భక్తిగా పూజించటం ప్రారంభించాడు. ముందుగా శ్రీహరి బ్రహ్మదేవుడికి ఉపదేశించిన మహాలక్ష్మి ధ్యానశ్లోకంతో పూజని ప్రారంభించాడు.

## శ్రీమహాలక్ష్మీ ధ్యానం

సహస్రదళ పద్మస్య కర్ణికావాసినీ పరాం ।
శరత్పార్వణ కోటీందు ప్రభాజుష్టకరాం వరాం ॥
స్వతేజసా ప్రజ్వలంతీం సుఖదృశ్యాం మనోహరాం ।
ప్రతప్త కాంచననిభాం శోభా మూర్తిమతీం సతీం ॥
రత్నభూషణ భూషాఢ్యాం శోభితాం పీతవాససా ।
ఈషద్ధాస్య ప్రసన్నాస్యాం రమ్యాం సుస్థిర యౌవనాం ॥
సర్వ సంపత్ప్రదాత్రీం చ మహాలక్ష్మీం భజే శుభాం ॥

శ్రీ మహాలక్ష్మి సహస్ర దళములుగల పద్మంలోని కర్ణిక మీద నివసిస్తుంది. శరత్కాలమందలి కోటి పున్నమి చంద్రుల కాంతితో గొప్పదైన తన తేజస్సుతో ప్రకాశిస్తుంది. ఆమె ఎంతో అందమైనది. మనోహరముగా ఉండేది. బంగారు రంగు వంటి శరీరం కలిగింది. అనేక రత్నాభరణాలని, పీతాంబరాన్ని ధరించి, చిరునవ్వుతో భక్తులకు సమస్త సంపదలను ఇస్తుంది. అటువంటి సుస్థిరమైన యౌవనము గల ఆ మహాలక్ష్మీదేవిని సేవిస్తాను.

**ఆసన మంత్రము :**

అమూల్య రత్నఖచితం నిర్మితం విశ్వకర్మణా ।
ఆసనం చ విచిత్రం చ మహాలక్ష్మీ ప్రతిగృహ్యతాం ॥

ఓ మహాలక్ష్మి! అమూల్యమైన రత్నములచే విశ్వకర్మ నిర్మించిన విచిత్రమైన ఈ ఆసనమును స్వీకరించుము.

**గంగాజల (అర్ఘ్య) మంత్రము :**

శుద్ధం గంగోదకమిదం సర్వవందితమీప్సితం ।
పాపేధ్మ వహ్నిరూపం చ గృహ్యతాం కమలాలయే ॥

పాపములను ఇధ్మములను అగ్నివలె కాల్చునది, పరిశుద్ధమైనది, అందరిచే నమస్కరింపబడినది, ఇష్టమైనది అగు ఈ గంగోదకమును నీవు స్వీకరించుము.

**శంఖజల (పాద్య) మంత్రము :**

పుష్పచందన దూర్వాది సంయుతం జాహ్నవీ జలం ।
శంఖగర్భస్థితం శుద్ధం గృహ్యతాం పద్మవాసిని ॥

ఓ పద్మవాసినీ । పువ్వులు, చందనము, గరిక మొదలైన వస్తువులు కల గంగాజలము శంఖమున ఉన్నది. ఇది మిక్కిలి పరిశుద్ధమైనది. ఈ శంఖ జలమును నీవు స్వీకరించుము.

**ఆమలకీ జలమంత్రము :**

సుగంధియుక్త తైలం చ సుగంధామలకీజలం ।
దేహసౌందర్య బీజం చ గృహ్యతా శ్రీహరిప్రియే ॥

ఓ శ్రీహరిప్రియా। శరీర సౌందర్యమును పెంచునది, సువాసనా భరితమైన తైలముగల ఉసిరిక ముద్దగల నీటిని నీకు సమర్పించుచున్నాను.

**ధూపమంత్రము :**

వృక్షనిర్యాస రూపం చ గంధద్రవ్యాది సంయుతం ।
కృష్ణకాంతే పవిత్రో వై ధూపోఽయం ప్రతిగృహ్యతాం ॥

ఓ శ్రీకృష్ణకాంతా! చెట్లయొక్క సారమనదగు జిగురునకు సుగంధ ద్రవ్యములు చేర్చబడినవి. పవిత్రము, సువాసనా భరితమైన ధూపమును నీవు స్వీకరించుము.

**చందనమంత్రము :**

మలయాచల సంభూత వృక్షసారం మనోహరం ।
సుగంధియుక్తం సుఖదం చందనం దేవి గృహ్యతాం ॥

ఓ మహాలక్ష్మి! ఈ చందనము మలయపర్వతమున పుట్టిన వృక్షముల యొక్క సారరూపమైనది. పరమ సుగంధభరితము, సుఖమును, ఆహ్లాదమునిచ్చు ఈ చందనమును నీకు సమర్పించుచున్నాను.

**దీపమంత్రము :**

జగచ్చక్షు స్వరూపం చ ధ్వాంతప్రధ్వంస కారణం ।
ప్రదీపం శుద్ధరూపం చ గృహ్యతాం పరమేశ్వరి ॥

ఓ పరమేశ్వరీ! ప్రపంచమునకంతయు కంటివంటిది, చీకటిని పారద్రోలునది, శుద్ధమైన ఈ దీపమును నీకు సమర్పించుచున్నాను.

**నైవేద్యమంత్రము :**

నానోపహార రూపం చ నానా రస సమన్వితం ।
నానాస్వాదుకరం చైవ నైవేద్యం ప్రతిగృహ్యతాం ॥

అన్నం బ్రహ్మ స్వరూపం చ ప్రాణరక్షణ కారణం ।
తుష్టిదం పుష్టిదం చాన్నం మధురం ప్రతిగృహ్యతం ॥

శాల్యక్షత సుపక్వం చ శర్కరాగవ్యసంయుతం ।
సుస్వాదు రమ్యం పద్మే చ పరమాన్నం ప్రతిగృహ్యతాం ॥

శర్కరాగవ్యపక్వం చ సుస్వాదు సుమనోహరం ।
మయానివేదితం లక్ష్మి స్వస్తికం ప్రతిగృహ్యతాం ॥

నానావిధాని రమ్యాణి పక్వాని చ ఫలాని తు ।
స్వాదురస్యాని కమలే గృహ్యంతాం ఫలదాని చ ॥

ఓ దేవి! అనేక రసములు కలది, మిక్కిలి రుచికలది, అనేక ఉపాహార రూపములతో నున్న ఈ నైవేద్యమును స్వీకరించుము. అట్లే బ్రహ్మస్వరూపము, ప్రాణములను నిలుపునది, తుష్టిని, పుష్టిని కలిగించునది, మధురమైనది అగు ఈ అన్నమును నీకు నివేదించుచున్నాను. అట్లే బాగుగా వండిన అన్నము, చక్కర, ఆవుపాలు కలిసినది ఇది మిక్కిలి రుచికలది, కంటికి ఇంపైనది. ఈ పరమాన్నమును నీవు స్వీకరించుము. ఆవుపాలు చక్కర కలిపి వండిన ఈ స్వస్తికమను దానిని నీవు స్వీకరించుము. బాగుగా పండినవి, అందమైనవి, మంచి రుచిగల రసముకల ఈ అనేక విధములైన పండ్లను నీవు ఆస్వాదింపుము.

**క్షీరమంత్రము :**

సురభిస్తన సంభూతం సుస్వాదు సుమనోహరం ।
మర్త్యామృతం చ గవ్యం వై గృహ్యతామచ్చుతప్రియే ॥

అచ్యుతునకు ప్రియురాలవగు ఓ దేవి! సురభి స్తనముల నుండి తీయబడినది, మంచి రుచికలది, మనోహరమైనది, మానవులకు అమృతము వంటిదగు ఈ ఆవుపాలను నీవు స్వీకరించుము.

**గుడ మంత్రము :**

సుస్వాదురస సంయుక్త మిక్షు వృక్షరసోద్భవం ।
అగ్నిపక్వమపక్వం నా గుడం వై దేవి గృహ్యాతాం ॥

ఓ దేవి! చెరుకు నుండి పుట్టిన మధుర రసమును అగ్నిపక్వము చేయగా నేర్పడిన గుడమును, పక్వము చేయని ఇక్షురసమును నీవు ఆరగింపుము.

**మిష్టాన్న మంత్రము :**

యవగోధూమ సస్యానాం చూర్ణరేణు సముద్భవం ।
సుపక్వ గుడ గవ్యాక్తం మిష్టాన్నం దేవి గృహ్యాతాం ॥

యవలు, గోధుమపిండితో సిద్ధము చేయబడినది, బాగుగా పక్వమైన గుడము, ఆవుపాలు కల మిష్టాన్నమును స్వీకరించుము.

**పిష్టక మంత్రము :**

సస్యచూర్ణోద్భవం పక్వం స్వస్తికాది సమన్వితం ।
మయా నివేదితం దేవి పిష్టకం ప్రతిగృహ్యాతాం ॥

బియ్యపుపిండి స్వస్తికము కలిపి సిద్ధము చేయబడిన ఈ పిండిని ఓ దేవీ నీవు స్వీకరించుము.

**ఇక్షుమంత్రము :**

పార్థివం వృక్షభేదం చ వివిధద్రవ్యకారకం ।
సుస్వాదు రస సంయుక్తం ఐక్షవం ప్రతిగృహ్యాతాం ॥

ఈ చెరకు భూమిలోనుండు ఒక వృక్షము. దీనివలన బెల్లము మొదలగు అనేక విధ ద్రవ్యములు ఉత్పత్తియగును. ఇది మంచి రుచిగల రసము కలది. అట్టి ఈ చెరుకును స్వీకరించుము.

**వ్యజన మంత్రము :**

శీతవాయుప్రదం చైవ దాహే చ సుఖదం పరం ।
కమలే గృహ్యతాం చేదం వ్యజనం శ్వేతం చామరం ॥

ఓ దేవీ! ఎండకాలమున మిక్కిలి సుఖమును కలిగించునది. చల్లని వాయువు నిచ్చునది, తెల్లని చమరీమృగముల తోకల కుచ్చులచే నిర్మితము అగు వ్యజనమును (చామరమును) స్వీకరించుము.

**తాంబూల మంత్రము :**

తాంబూలం చ వరం రమ్యం కర్పూరాది సువాసితం ।
జిహ్వాజాడ్యచ్ఛేదకరం తాంబూలం దేవి గృహ్యతాం ॥

ఓ మహాలక్ష్మీ! ఈ తాంబూలము కర్పూరము మొదలగు ద్రవ్యములు కలది. నాలుకను ఉత్తేజపరుచును. ఇట్టి తాంబూలమును నీకు సమర్పిస్తున్నాను.

**జల మంత్రము :**

సువాసితం శీతలం చ పిపాసా నాశకారణం ।
జగజ్జీవనరూపం చ జీవనం దేవి గృహ్యతాం ॥

ఓ లక్ష్మీదేవీ! దప్పిని పోగొట్టునది, ప్రపంచంలోని జీవులు జీవించు కారణమైనది, చల్లనిది, మంచివాసన కలదియగు ఈ జలమును నీవు స్వీకరించుము.

**వస్త్ర మంత్రము :**

దేహ సౌందర్యబీజం చ సదా శోభా వివర్ధనం ।
కార్పాసజం చ క్రిమిజం వసనం దేవి గృహ్యతాం ॥

అమ్మా! నేను సమర్పించుచున్న వస్త్రమును స్వీకరించుము. ఇది దేహమునకు అందమును తెచ్చును. శోభను పెంచుచుండును. దీనిని పత్తితోగాని, పట్టుపురుగులతోగాని నేయుదురు. అట్టి వస్త్రమును స్వీకరించుము.

**భూషణ మంత్రము**

రత్నస్వర్ణవికారం చ దేహసౌఖ్య వివర్ధనం ।
శోభాధానం శ్రీకరం చ భూషణం ప్రతిగృహ్యతాం ॥

రత్నములు బంగారము కలిపి నిర్మింపబడినది, శరీర సౌఖ్యమును, శరీరమునకు శోభను కలిగించునది అగు భూషణమును స్వీకరించుము.

**మాల్య మంత్రము :**

నానా కుసుమ సందర్భం బహుశోభాప్రదం పరం ।
సురలోకప్రియం శుద్ధం మాల్యం దేవి ప్రగృహ్యతాం ॥

అమ్మా! అనేక విధములైన పుష్పములు కలది, చక్కని శోభను కలిగించేది, దేవతలకందరకు ప్రియమైనది అగు ఈ పుష్పమాలను నీకు అర్పించుచున్నాను.

**గంథ మంత్రము :**

శుద్ధిదం శుద్ధిరూపం చ సర్వమంగళమంగళం ।
గంధవస్త్వోద్భవం రమ్యం గంధం దేవి ప్రగృహ్యతాం ॥

ఓ దేవి! సమస్త మంగళ వస్తువులలో శ్రేష్ఠమైనది, పరమశుద్ధమైనది, రమ్యమైనది, గంధపు చెక్కనుండి ఏర్పడిన ఈ గంధమును స్వీకరించుము.

**ఆచమనీయ మంత్రము :**

పుణ్యతీర్థోదకం చైవ విశుద్ధం శుద్ధిదం సదా ।
గృహాణ కృష్ణకాంతే త్వం రమ్యమాచమనీయకం ॥

శ్రీకృష్ణకాంతవైన లక్ష్మీదేవీ! పవిత్రమైన తీర్థములకు చెందిన ఉదకమిది. ఇది చాలా పరిశుద్ధమైనది. ఇతరులను కూడ పవిత్రము చేయునది. ఇట్టి ఆచమనీయమును నీవు స్వీకరించుము.

**శయ్యా మంత్రము :**

రత్నసారైః సంగ్రథితం పుష్పచందన సంయుతం ।
రత్నభూషాఢ్యం సుతల్పం ప్రతిగృహ్యతాం ॥

మంచి విలువగల రత్నములు, పువ్వులు, చందనము, రత్నాలంకారములు కల ఈ శయ్యను స్వీకరించుము.

**దక్షిణ మంత్రము :**

యుద్యద్ద్రవ్యమపూర్వం చ పృథివ్యామస్తి దుర్లభం ।
దేవి భూపాఢ్యభోగ్యం చ తద్ద్రవ్యం దేవి గృహ్యతాం ॥

ఓ మహాలక్ష్మి! ఈ భూమిలో అరుదుగా దొరుకునది, చాలా విచిత్రమైనది, రాజులు, ధనవంతులు మాత్రము అనుభవించునదియగు ద్రవ్యమును నీకు సమర్పిస్తాను. *(శ్లో॥10-41, అధ్యా-39, ఖం-2)*

## శ్రీమహాలక్ష్మి ద్వాదశాక్షర మంత్రం

దేవేంద్రుడు భక్తిశ్రద్ధలతో మహాలక్ష్మీదేవిని పూజించిన తరువాత బ్రహ్మదేవుడు అతడి దగ్గరకి వచ్చి కల్పవృక్షంలాగా అన్ని కోర్కెలనూ తీర్చే మహాలక్ష్మి ద్వాదశాక్షరమంత్రాన్ని ఉపదేశించాడు.

**శ్రీం హ్రీం క్లీం ఐం కమలవాసిన్యై స్వాహా।**

బ్రహ్మ ఉపదేశించిన ఈ దివ్యమంత్రాన్ని నిష్ఠతో పదిలక్షల సార్లుజపించి ఆ మంత్రాన్ని సిద్ధిపొందాడు. ఈ మహాలక్ష్మి మంత్రాన్ని జపించే కుబేరుడు సకల సంపదలకీ ప్రభువయ్యాడు. అలాగే రాజేశ్వరుడు, దక్షుడు, సావర్ణిమనువు, మంగళుడు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు వంటి మహాత్ములు కూడా ఈ మంత్రాన్ని ఉపాసించారు.

దేవేంద్రుడు చేసిన మంత్రజపానికి సంతుష్ఠురాలైన మహాలక్ష్మీదేవి ఆయన ముందు ప్రత్యక్షమైంది. కోటిచంద్రుల కాంతితో ప్రకాశించే ఆ దేవిని దర్శించే తన శరీరం పులకించిపోగా, ఆనందభాష్పాల్ని రాలుస్తూ ముందుగా లక్ష్మీదేవికి నమస్కరించాడు ఇంద్రుడు. వెంటనే మనసుని స్థిరంచేసుకుని బ్రహ్మదేవుడు తనకి ఉపదేశించిన మహాలక్ష్మి స్తోత్రాన్ని ఆమె ముందు ఇలా పఠించాడు.

## మహిమోపేతమైన మహాలక్ష్మి స్తుతి

ఓం నమః కమల వాసిన్యై నారాయణ్యై నమో నమః ।
కృష్ణప్రియాయై సారాయై పద్మా యై చ నమో నమః ॥

పద్మపత్రేక్షణాయై చ పద్మాస్యాయై నమో నమః ।
పద్మాసనాయై పద్మిన్యై వైష్ణవ్యై చ నమో నమః ॥
సర్వసంపత్స్వరూపాయై సర్వదాత్ర్యై నమో నమః ।
సుఖదాయై మోక్షదాయై సిద్ధిదాయై నమో నమః ॥
హరిభక్తి ప్రదాత్ర్యై చ హర్షదాత్ర్యైనమో నమః ।
కృష్ణవక్షస్థితాయై చ కృష్ణేశాయై నమో నమః ॥
కృష్ణశోభా స్వరూపాయై రత్నాఢ్యాయై నమో నమః ।
సంపత్త్యధిష్ఠాతృ దేవ్యై మహాదేవ్యై నమో నమః ॥
సస్యాధిష్ఠాతృ దేవ్యై చ సస్యలక్ష్మ్యై క్షీరోద సాగరే ।
స్వర్గలక్ష్మీరింద్ర గేహే రాజలక్ష్మీః నృపాలయే ॥
గృహలక్ష్మీశ్చ గృహిణాం గేహేచ గృహ దేవతా ।
సురభిస్సా గవాం మాతా దక్షిణా యజ్ఞకామినీ ॥
ఆదితిర్దేవమాతా త్వం కమలా కమలాలయే ।
స్వాహా త్వం చ హవిర్దానే కవ్యదానే స్వధాస్మృతా ॥
త్వం హి విష్ణుస్వరూపా చ సర్వధారా వసుంధరా ।
శుద్ధసత్వస్వరూపా త్వం నారాయణ పరాయణా ॥
క్రోధహింసావర్జితా చ వరదా చ శుభానవా ।
పరమార్థప్రదా త్వం చ హరిదాస్య ప్రదాపరా ॥
యయా వినా జగత్సర్వం భస్మీభూతమసారకం ।
జీవన్మృతం చ విశ్వం చ శవతుల్యం యయావినా ॥
యయా వినా న సంభాష్యో బాంధవైర్బాంధవః సదా ॥
త్వయాహీనో బంధుహీనస్త్వయా యుక్తః సబాంధవః ।
ధర్మార్థకామ మోక్షాణాం త్వం చ కారణరూపిణీ ॥
స్తనంధయానాం త్వం మాతా శిశూనాం శైశవే యథా ।
తథా త్వం సర్వదా మాతా సర్వేషాం సర్వవిశ్వతః ॥
త్యక్తస్తనో మాతృహీనః స చోజ్జీవతి దైవతః ।
త్వయా హీనో జనః కో పి నజీవత్యేవ నిశ్చితం ॥

సుప్రసన్న స్వరూపా త్వం మే ప్రసన్నా భవాంబికే ।
వైరిగ్రస్తం చ విషయం దేహి మహ్యాం సనాతని ॥
వయం యావత్త్వయా హీనా బంధుహీనాశ్చ భిక్షుకాః ।
సర్వసంపద్విహీనాశ్చ తావదేవ హరిప్రియే ॥
రాజ్యం దేహి శ్రియం బలం దేహి సురేశ్వరి ।
కీర్తిం దేహి ధనం దేహి పుత్రాన్మహ్యాం చ దేహి వై ॥
కామం దేహి మతిం భోగాన్దేహి హరిప్రియే ।
జ్ఞానం దేహి చ ధర్మం చ సర్వసౌభాగ్య మీప్సితం ॥
సర్వాధికారమేవం వై ప్రభావం చ ప్రతాపకం ।
జయం పరాక్రమం యుద్ధే పరమైశ్వర్యమేవ చ ॥

*(శ్లో.52-72, అధ్యా-39, ఖం-2)*

ఈవిధంగా ఇంద్రుడు చేసిన ప్రార్ధన విని ఆనందించిన లక్ష్మీదేవి అతడు కోల్పోయిన ఇంద్ర పదవిని తిరిగి ప్రసాదించింది.

**స్తోత్రం ఫలశ్రుతి :** బ్రహ్మదేవుడి కృతమైన ఈ దివ్యస్తోత్రాన్ని ప్రతిరోజూ మూడు సంధ్యల్లో పారాయణ చేసినవాడు కుబేరుడితో సమానమైన సంపదల్ని పొందుతాడు. ఈ స్తోత్రాన్ని ఐదులక్షల సార్లు జపిస్తే (పఠిస్తే) సిద్ధిస్తుంది. సిద్ధిపొందినవాడు తానే కల్పవృక్షంలాగా ఇతరుల కోరికల్ని తీర్చగలిగే సామర్థ్యాన్ని పొందుతాడు. మంత్రసిద్ధిపొందాక, ఈ స్తోత్రాన్ని నిష్ఠగా ఒక నెలరోజులు పారాయణ చేస్తే రాజపదవి లభిస్తుంది.

## స్వాహాదేవి వృత్తాంతం

బ్రహ్మ సృష్టి చేసిన తరువాత దేవతలందరికీ నిత్యం ఆహారం కావలసి వచ్చింది. వారంతా బ్రహ్మ దగ్గరకి వెళ్ళి తమ సమస్యను ఆయనకి విన్నవించారు. బ్రహ్మదేవుడు వారి ప్రార్ధనవిని సరాసరి వైకుంఠానికి చేరి నారాయణా! వైకుంఠవాసా నేను సృష్టించిన దేవతలందరూ ఆహారంకోసం అలమటిస్తున్నారు ప్రభూ! నీవే వారికి ఏదోదారి చూపించాలి"అని వేడుకున్నాడు. అప్పుడు మహావిష్ణువు తానే ఒక అంశతో యజ్ఞరూపుడుగా మారిపోయాడు.

అదిచూసి బ్రహ్మదేవుడు ఎంతో సంతోషించి ఆయజ్ఞకుండంలో ఆహుతుల్ని సమర్పించాడు. అవన్నీ దేవతలు స్వీకరించి కొంతవరకు సంతృప్తి పడ్డారు. అయితే భూలోకవాసులైన, బ్రాహ్మణులు, మునులు, ఋషులు ఇచ్చిన హవిస్సులు దేవతలకు చేరటం లేదు. దానితో దేవతలంతా వచ్చి తిరిగి బ్రహ్మతో తమకి ఆహారం దొరకటంలేదని చెప్పారు.

బ్రహ్మదేవుడు వారిని శాంతపరిచి శ్రీకృష్ణ పరమాత్మని ధ్యానించాడు. ఆధ్యానంలో కృష్ణుడు చెప్పిన విధంగా ఆదిప్రకృతిని పూజించాడు. వెంటనే సర్వశక్తి, స్వరూపిణి అయిన ప్రకృతి మాత తన అంశ అయిన స్వాహా దేవి రూపంతో ఆవిర్భవించింది. ఆమె అగ్ని దాహక శక్తి. గ్రీష్మకాల సూర్యుడిలా వెలుగొందుతున్న స్వాహాదేవి బ్రహ్మని వరం కోరుకోమంది. బ్రహ్మదేవుడు సంతోషంతో ఆమెకి నమస్కరించి, అమ్మా! స్వాహాదేవి దేవతలందరూ భూలోకంలో మానవులు, మహర్షులు హోమకుండంలో వేసే హవిస్సుల్ని పొందలేకపోతున్నారు. నీవులేకపోతే అగ్నిదేవుడు తనలో వేసిన హవిస్సుల్ని దగ్ధం చేసుకోలేడు. కనుక నీవు అగ్నిని వివాహం చేసుకుని, దేవతలందరికీ హవిస్సులు అందేలా చేయి ఇదే నా కోరిక" అని ప్రార్థించాడు.

బ్రహ్మ కోరికని మన్నించిన 'స్వాహా' దేవి శాస్త్రోక్తంగా అగ్నిదేవుణ్ణి వివాహం చేసుకుంది. తరువాత అగ్ని స్వాహా ఇద్దరూ వంద సంవత్సరాలు హాయిగా విహరించారు. కొంతకాలానికి స్వాహాదేవి గర్భం ధరించింది. దివ్యమైన ఆ గర్భాన్ని 12సంవత్సరాలు మోసి చివరికి 1.దక్షిణాగ్ని 2.గార్హపత్యాగ్ని 3.ఆహవనీయాగ్ని అనే ముగ్గురు పుత్రుల్ని కన్నది.

ఇక ఆనాటి నుంచి భూలోకంలో హోమం చేసే వారంతా మంత్రంచివర స్వాహా కారాన్ని చేర్చి ఉచ్చరిస్తూ దేవతలకి హవిస్సుల్ని సమర్పిస్తున్నారు. స్వాహాకారంతో ఉన్న మంత్రమే ప్రశస్తమైనది. దానివల్లనే సమస్త సిద్ధులూ లభిస్తాయి. ఈ విషయం తెలుసుకున్న ద్విజులందరూ స్వాహాకారమంత్రాలతో యజ్ఞయాగాది క్రతువుల్ని నిర్విరామంగా చేస్తూ దేవతలకి ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నారు.

## స్వాహాదేవి మంత్రం

### ఓం హ్రీం శ్రీం వహ్నిజాయాయై దేవ్యై స్వాహా

ఈ మంత్రాన్ని నిత్యం జపించిన వాడికి హోమం చేసిన ఫలితం లభిస్తుంది. స్వాహాదేవి దయవల్ల దివ్యతేజస్సు లభిస్తుంది.

## స్వాహాదేవి స్తోత్రం

స్వాహాஉ ద్యా ప్రకృతే రంశా మంత్ర తంత్రాంగరూపిణీ ।
మంత్రాణాం ఫలదాత్రీచ ధాత్రీచ జగతాంసతీ ॥
సిద్ధిస్వరూపా సిద్ధాచ సిద్ధిదా సర్వదానృణాం ।
హుతాశ దాహికాశక్తిః తత్ప్రాణాధికరూపిణీ ॥
సంసార సార రూపాచ దేవపోషణకారిణీ ॥ *(శ్లో॥51-53,అధ్యా-40,ఖం-3)*

స్వాహాదేవి పేర్లతో కూడిన ఈ దివ్యస్తోత్రాన్ని పఠించినవారికి సమస్త సిద్ధులూ కలుగుతాయి. అన్ని కార్యక్రమాలూ దిగ్విజయంగా జరుగుతాయి. సంతానంలేనివారికి పుత్రసంతానం కలుగుతుంది. పెళ్ళికాని వారికి వివాహం జరుగుతుంది. ఈ స్తోత్రం సాక్షాత్తు అగ్నిదేవుడు చెప్పింది.

## స్వధాదేవి వృత్తాంతం

బ్రహ్మదేవుడు తనసృష్టిలో భాగంగా దేవతలతో పాటు పితృదేవతల్ని కూడా సృష్టించాడు. వారు మొత్తం ఏడుగురు. వీరిలో నలుగురుకి శరీరం ఉండగా, మిగిలిన ముగ్గురూ శరీరం లేక కేవలం తేజోరూపంలో వుంటున్నారు. బ్రహ్మదేవుడు తన ఏడుగురు కుమారులకీ శ్రాద్ధ తర్పణాల ద్వారా ఆహారం లభించే ఏర్పాటు చేసాడు.

భూలోకంలో బ్రాహ్మణుడన్నవాడు త్రికాల సంధ్యావందనాన్ని, ఆహ్నిక కర్మని, శ్రాద్ధాన్ని తర్పణాన్ని, బలిని, స్వాధ్యాయం (వేదపఠనం) తప్పకుండా చేయాలి. అలా చేయని విప్రుడు విషంలేని పాములాంటివాడు. బ్రహ్మదేవుడి ఆదేశం ప్రకారం భూలోకంలో బ్రాహ్మణులు పితృదేవతల కోసం నిత్యం శ్రాద్ధ తర్పణాలు సమర్పిస్తున్నారు. అయితే అవి పితృదేవతలకి చేరటంలేదు. దానితోవారు ఆకలిబాధ తాళలేక బ్రహ్మదేవుడి దగ్గరకి వెళ్ళి తమ బాధని మొరపెట్టుకున్నారు.

వారందరి మొరవిన్న బ్రహ్మ వెంటనేతన మనసునుంచి అందమైనది, శరత్కాల చంద్రుడు లాంటి వెలుగుకలది, విద్య, సుగుణాలరాశి, రత్నాభరణాలు ధరించినది, పరిశుద్ధమైనది అయిన 'స్వధా' అనే కన్యని సృష్టించి ఆమెని పితృదేవతలకి భార్యగా ఇచ్చాడు. తరువాత బ్రహ్మ మంత్రం చివర 'స్వధా' కారాన్ని ఉచ్చరించి శ్రాద్ధ తర్పణ కర్మల్ని ఆచరించమని విప్రుల్ని ఆదేశించాడు. బ్రహ్మ ఆనతి ప్రకారం నాటి నుంచి విప్రులు 'స్వధా' కారాన్ని ఉచ్చరించి శ్రాద్ధ క్రియని నిర్వహించటంతో పితృదేవతలకి ఆహారం లభించింది.

దేవతలకి హోమం ద్వారా ఆహారాన్ని సమర్పించేప్పుడు స్వాహాకారాన్ని పితృదేవతలకి పిండం ద్వారా ఆహారాన్నందించేప్పుడు స్వధాకారాన్ని ఉచ్చరించాలి. మానవులు తప్పనిసరిగా దేవ, పితృయజ్ఞాలలో అవిచేసినవాడికి దక్షిణ ఇవ్వాలి. అలా ఇవ్వకపోతే అవి సఫలంకావు.

## స్వధాదేవి మంత్రం

### ఓం హ్రీం శ్రీం క్లీం స్వధా దేవ్యై స్వాహా

శరదృతువులో ఆశ్వయుజ కృష్ణ త్రయోదశినాడు గానీ లేక మఖానక్షత్రం నాడుగానీ లేక శ్రాద్ధ పెట్టేరోజునగానీ స్వధాదేవిని పూజించి, ఈ మంత్రాన్ని యథాశక్తి జపిస్తే చాలామంచిది. స్వధాదేవిని పూజించకుండా శ్రాద్ధం పెట్టినవాడికి దాని ఫలితం లభించదు. 'స్వధా' అన్న పదం ఉచ్చరిస్తేనే చాలు సకలపాపాలూ తొలగిపోతాయి. వాజపేయ యాగం చేసిన ఫలితం లభిస్తుంది.

## స్వధాదేవి స్తోత్రం

స్వధోచ్చారణమాత్రేణ తీర్థస్నాయీ భవేన్నరః ।
ముచ్యతే సర్వపాపేభ్యో వాజపేయ ఫలం లభేత్ ॥
స్వధాస్వధా స్వధేత్యేవం యదివారత్రయం స్మరేత్ ।
శ్రాద్ధస్యఫలమాప్నోతి కాలతర్పణయోస్తథా ॥
శ్రాద్ధకాలే స్వధాస్తోత్రం యః శ్రుణోతి సమాహితః ।
లభేత్ శ్రాద్ధశతానాం చ పుణ్యమేవ న సంశయః ॥

స్వధాస్వధా స్వధేత్యేవం త్రిసంధ్యం యః పఠేన్నరః ।
ప్రియాం వినీతాం స లభేత్సాధ్వీం పుత్రగుణాన్వితాం ॥
పితౄణాం ప్రాణతుల్యా త్వం ద్విజ జీవన రూపిణీ ।
శ్రాద్ధాదిష్ఠాతృదేవీ చ శ్రాద్ధాదీనాం ఫలప్రదా ॥
బహిర్మన్మసో గచ్ఛ పితౄణాం తుష్టిహేతవే ।
సంప్రీతయే ద్విజాతీనాం గృహిణాం వృద్ధిహేతవే ॥
నిత్యా నిత్యస్వరూపాఽసి గుణరూపాఽసి సువ్రతే ।
ఆవిర్భావస్తిరోభావః సృష్టౌ చ ప్రళయే తవ ॥
ఓం స్వస్తి చ నమః స్వాహా స్వధా త్వం దక్షిణా తథా ।
నిరూపితాశ్చతుర్వేదే షట్ ప్రశస్తాశ్చకర్మిణాం ॥
పురాఽసీస్త్వం స్వధా గోపీ గోలోకే రాధికా సఖీ ।
ధృతా స్వోరసి కృష్ణేన యతస్తేన స్వధా స్మృతా ॥

*(శ్లో॥27-35,అధ్యా-41,ఖం-2)*

**ఫలశ్రుతి :** పవిత్రమైనది బ్రహ్మదేవుడు స్వయంగా స్తుతించినది అయిన ఈ స్వధాస్తోత్రాన్ని ఎవడైతే భక్తి శ్రద్ధలతో పఠిస్తాడో వాడికి సకల తీర్థాలలో స్నానం చేసిన ఫలితం లభిస్తుంది.

## దక్షిణాదేవి వృత్తాంతం

గోలోకంలో రాసమండలాధీశుడై రాసకేళి జరుపుతున్న శ్రీకృష్ణుడికి 'సుశీల' అనేగోపిక ప్రియురాలిగా వుండేది. ఆ సుశీల గోలోక నాయిక రాధాదేవికి చెలికత్తె. ఎంతో గొప్ప అందగత్తె కూడా, ఆమె నవయవ్వనంతో మిసమిసలాడుతూ చూసేవారికి నయనమనోహరంగా కనిపిస్తోంది. కామశాస్త్రంలో దిట్ట, గొప్పరసికురాలు అలాంటి సుశీల శ్రీకృష్ణుడి మనసుని ఆకర్షించింది.

ఒకనాడు సుశీల కృష్ణులు ఆనందంతో మైమరచివుండగా ఆదృశ్యాన్ని దూరం నుంచి చూసింది రాధాదేవి. వెంటనే కోపంతో పతిని నిలదీయాలని అక్కడికి వేగంగా వస్తోంది. అది గమనించిన శ్రీకృష్ణుడు, ఆయన వెనకాలే సుశీల ఇద్దరూ అక్కణ్ణుంచి అంతర్ధానమయ్యారు. పరుగున వచ్చిన రాధాదేవికి

అక్కడ వారిద్దరు కనిపించలేదు. దానితో ఆమెకి సుశీలమీద ఆగ్రహం కలిగి "ఓ సుశీలా! నీవు నా భర్తని మాయోపాయంతో లోబరుచుకున్నావు. కనుక నేటినుంచీ నువ్వు గోలోకంలో ఉండరాదు. ఉంటే భస్మమైపోతావు" అని కఠినంగా శపించింది.

రాధాదేవి శాపంవిన్న సుశీల అనే దక్షిణాదేవి గోలోకంనుంచి బైటికి వచ్చి, లక్ష్మీదేవి శరీరంలో లీనమైపోయింది. అలా దక్షిణా (సుశీల) దేవి అదృశ్యమైపోవటంతో దేవతలు ఎంతో గొప్పగా యజ్ఞం చేసినా దానిఫలితాన్ని పొందలేక తమబాధను బ్రహ్మదేవుడి దగ్గరకి వెళ్ళి మొరపెట్టుకున్నారు. బ్రహ్మ నారాయణుణ్ణి స్మరించాడు. విషయం గ్రహించిన నారాయణుడు మహాలక్ష్మి శరీరంలో లీనమైన దక్షిణాదేవిని బైటికి తీసి ఆమెని బ్రహ్మదేవుడికిచ్చాడు. బ్రహ్మ ఆమెని యజ్ఞదేవతకి సమర్పించగా, ఆయన సర్వాలంకార సంశోభిత అయిన దక్షిణాదేవిని చూసి, ఆమెపై మోహాన్ని పొందాడు. తరువాత బ్రహ్మదేవుడి ఆదేశం మేరకు ఆమెని శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నాడు.

యజ్ఞపురుషుడు, దక్షిణాదేవి ఇద్దరూ కలిసి ఎన్నో సంవత్సరాలు సంతోషంగా విహరించారు. కొంత కాలం తరువాత దక్షిణాదేవి గర్భాన్ని ధరించింది. పన్నెండు సంవత్సరాలుగర్భాన్ని మోసాక ఒక శుభముహూర్తంలో కర్మఫలాల్ని ఇచ్చే పుత్రుణ్ణి కన్నది.

ఆవిధంగా దక్షిణాదేవి సర్వకర్మల ఫలితాల్ని ప్రసాదించే పుత్రుణ్ణి పొంది, నాటినుంచీ వైదిక కర్మలు సక్రమంగా ఆచరించేవారికి ఫలితాల్ని ప్రసాదిస్తుంది. అలా దక్షిణాదేవి పుత్రుడివల్ల దేవతలు కూడా తాముచేసే యజ్ఞయాగాది క్రతువుల వల్ల లభించే సత్ఫలితాల్ని పొందుతున్నారు.

ఎవరైనా సరే యజ్ఞయాగాది సత్క్రతువుల్ని నిర్వహించినప్పుడు ఆకార్యక్రమాల్ని చేసిన ఋత్విక్కులకు దక్షిణ ఇవ్వకపోతే వారు చేసినవన్నీ వృధా అయిపోతాయి. దక్షిణ ఇవ్వనివాడు కుంభీపాకనరకంలో పడతాడు. కనుక యజ్ఞయాగాది క్రతువుల్లో దక్షిణ లోపంలేకుండా జాగ్రత్తపడాలి.

## దక్షిణాదేవి మంత్రం

**ఓం శ్రీం క్లీం హ్రీం దక్షిణాయై స్వాహా ।**

దక్షిణాదేవిని ఈ మంత్రంతో పూజించాలి. ఈ దివ్యమంత్రాన్ని శ్రద్ధగా యధాశక్తి జపించిన వాడికి ధనం, ధాన్యం, భూలాభం కలుగుతాయి. తలపెట్టిన అన్ని పనులూ సక్రమంగా జరుగుతాయి.

## దక్షిణాదేవి స్తుతి

పురా గోలోకగోపీ త్వం గోపీనాం ప్రవరాపరా ।
రాధాసమా తత్సఖీ చ శ్రీకృష్ణప్రేయసీ ప్రియే ॥
కార్తికీ పూర్ణిమాయాంతు రాసేరాధా మహోత్సవే ।
ఆవిర్భూతా దక్షిణాంశాత్ కృష్ణస్యాతో హి దక్షిణా ॥
పురా త్వం చ సుశీలాఖ్యా శీలేన సుశుభేన చ ।
కృష్ణ దక్షాంశవాసాచ్చ రాధాశాపాచ్చ దక్షిణా ॥
గోలోకాత్త్వం పరిధ్వస్తా మమభాగ్యాదుపస్థితా ।
కృపాం కురుత్వమేవాద్య స్వామినం కురు మాం ప్రియే ॥
కర్తౄణాం కర్మణాం దేవీ త్వమేవ ఫలదా సదా ।
త్వయా వినా చ సర్వేషాం సర్వం కర్మ చ నిష్ఫలం ॥
ఫలాశాఖా విహీనశ్చ యథావృక్షో మహీతలే ।
త్వయా వినా తథా కర్మ కర్తౄణాం న చ శోభతే ॥
బ్రహ్మావిష్ణు మహేశాశ్చ దిక్పాలాదయ ఏవ చ ।
కర్మణశ్చ ఫలం దాతుం న శక్తాశ్చ త్వయా వినా ॥
కర్మరూపీ స్వయం బ్రహ్మా ఫలరూపీ మహేశ్వరః ।
యజ్ఞరూపీ విష్ణురహం త్వమేషాం సారరూపిణీ ॥
ఫలదాతా పరం బ్రహ్మా నిర్గుణః ప్రకృతేః పరః ।
స్వయం కృష్ణశ్చ భగవాన్ న చ శక్తస్త్వయా వినా ॥
త్వమేవ శక్తిః కాంతే మే శశ్వజ్జన్మని జన్మని ।
సర్వకర్మణి శక్తో ఽహం త్వయాసహ వరాననే ॥

*(శ్లో॥72-81, అధ్యా-42, ఖం-2)*

**ఫలశ్రుతి :** యజ్ఞయాగాది క్రతువులు జరిగే సందర్భంలో ఈ దక్షిణాదేవి స్తోత్రాన్ని పఠిస్తే వారికి సమస్త యజ్ఞాలు చేసిన ఫలం లభిస్తుంది. రాజసూయ, వాజపేయ, అశ్వమేధమహావిష్ణుయాగాల ప్రారంభంలో ఈ స్తోత్రాన్ని పఠించాలి. అలాపఠిస్తే ఎలాంటి విఘ్నాలు లేకుండా ఆయాగాలు పరిసమాప్తమవుతాయి.

## షష్ఠీదేవి వృత్తాంతం

షష్ఠీదేవి ప్రకృతి ఆరోఅంశ. అందుకే ఆమెని షష్ఠీ అనిపిలిచారు. ఈమె పసిపిల్లలకి అధిష్ఠాన దేవత.సంతాన ప్రదాయిని కూడా. ఈ షష్ఠీదేవే షణ్మాతృకలలో ఒకతెగా 'దేవసేన' అనేపేరుతో కూడా ప్రసిద్ధురాలయ్యింది. కాలక్రమంలో దేవసేన శివుడి కుమారుడైన కార్తికేయుడికి భార్యగామారి దేవతల పూజలందుకుంది. షష్ఠీదేవిలోకంలో పసిపిల్లలందర్నీ రక్షిస్తూ, ఆర్తత్రాణ పరాయణగా కీర్తిగాంచింది. ఈదేవిని పూజిస్తే పూజించిన వారికి సంతానానికి ఎలాంటి కష్టాలు రాకుండా కాపాడుతుంది.

పూర్వం స్వాయంభువమను మహారాజుకి ప్రియవ్రతుడనే కుమారుడు జన్మించాడు. అతడు పుట్టినప్పట్నుంచీ వైరాగ్య భావంతో వుంటూ వివాహం చేసుకోలేదు. అయితే బ్రహ్మదేవుడు అతన్ని వివాహం చేసుకోమని ఒకనాడు ఆజ్ఞాపించాడు. ఆయన మాటను కాదనలేక ప్రియవ్రతుడు వివాహం చేసుకున్నాడు. వివాహమైతే చేసుకున్నాడు గానీ ఎంతకాలానికీ అతడికి సంతానం కలగలేదు. ఆయన వెళ్ళి కశ్యప ప్రజాపతిని శరణు వేడుకున్నాడు. కశ్యపుడు ఒక శుభముహూర్తంలో ప్రియవ్రతుడితో పుత్రకామేష్టి యాగాన్ని చేయించి యజ్ఞప్రసాదాన్ని అతడి భార్య మాలినీదేవికి ఇచ్చాడు.

యజ్ఞప్రసాదం స్వీకరించిన మాలినీదేవి దాని ప్రభావంతో గర్భాన్ని ధరించి, పన్నెండు సంవత్సరాలు ఆ గర్భాన్ని భరించి చివరికి అందమైన కుమారుణ్ణి కన్నది. అయితే ప్రారర్ధవశాన ఆశిశువు పుట్టిన వెంటనే కనుపాపలు తిరిగి పోయి మరణించాడు. ఆవిషయం తెలిసిన మాలినీదేవి తీవ్రంగా రోధించి రోధించి మూర్ఛపోయింది. ఆ సంఘటన రాజమందిరంలో వారందరినీ

శోకకతుప్తుల్ని చేసింది. ప్రియవ్రతుడు దుఃఖాన్ని ఎలాగో దిగమింగుకుని తన మృత శిశువుని శ్మశానానికి తీసుకువచ్చాడు. కడసారి బాలుణ్ణి చూసుకుని దుఃఖం ఆపుకోలేక తానుకూడా ప్రాణత్యాగం చేయటానికి సిద్ధపడ్డాడు.

హఠాత్తుగా ఆకాశంలో మెరుపులు మెరిసాయి. అదే సమయంలో ఒక దివ్య విమానం అక్కడికి వచ్చింది. అది శుద్ధ స్ఫటికంలా ప్రకాశిస్తోంది. పట్టువస్త్రాలతో, వివిధరకాల ఆభరణాలు పూలమాలలతో అలంకరించబడి వుంది. ఆదివ్య విమానంలో సర్వాంగసుందరంగా దేవసేనాదేవి కూర్చునివుంది. ఆమెని చూసి భక్తి భావంతో ప్రియవ్రతుడు తన కుమారుణ్ణి క్రిందకి దింపి ఆమెకి నమస్కరించాడు. ఆమెతో "అమ్మా ఎవరునీవు? చూస్తుంటే ఎవరో దేవతా స్త్రీలాగా వున్నావు? నిన్ను చూస్తేనే భక్తి భావం పొంగుకొస్తుంది. అని అడిగాడు" అందుకామె రాజా! నేను బ్రహ్మదేవుడి మానసపుత్రికని, నేను ఆదిప్రకృతి ఆరో అంశగా జన్మించటంతో నన్ను అందరూ షష్ఠీదేవి అంటారు. దేవతలకు నేను సేనగామారి వారికి విజయాన్ని చేకూర్చిన కారణంగా దేవతలు నన్ను దేవసేన అంటారు. షణ్మాతృకలలో వున్నందున నన్ను స్కందసేన అనికూడా పిలుస్తారు. అలాగే ప్రేయసి లేని వారికి ప్రేయసిని, దరిద్రులకి ధనాన్ని అనుగ్రహిస్తాను. జీవులందరూ వారుచేసిన కర్మల కారణంగానే రూపవంతుడుగా రోగిగా, మృతజీవుడిగా, చిరంజీవిగా అవుతున్నారు. నీ కుమారుడు కూడా కర్మప్రారబ్ధం వల్ల మరణించాడు.కానీ పుణ్య కర్మ ప్రభావం వల్ల అతడు తిరిగి జీవిస్తాడు" అని పలికి ఆ బాలుణ్ణి తన చేతిలోకి తీసుకుని అతన్ని బ్రతికించింది.

షష్ఠీదేవి ప్రియవ్రతుడి పుత్రుణ్ణి బ్రతికించి, వెంటనే ఆ బాలుణ్ణి తీసుకుని అక్కడ నుంచి ఆకాశంలోకి ఎగిరిపోవటానికి ఉద్యుక్తురాలయ్యింది. అదిచూసి ఆందోళన చెందిన ప్రియవ్రతుడు షష్ఠీదేవిని మరల దీనంగా తన పుత్రుణ్ణి తనకి తిరిగి ఇమ్మని దీనంగా ప్రార్థించాడు. షష్ఠీదేవి సంతోషించి ఆ బాలుణ్ణి ప్రియవ్రతుడికి అందించి రాజా! నీవు నీ తండ్రి స్వాయంభువమనువు స్వయంగా నా పూజను చేయండి. అంతేకాదు నీ రాజ్యంలో అందరి చేతా నాపూజను చేయించు. మీ అందరికీ శుభం జరుగుతుంది.

నీ పుత్రుడు 'సువ్రతుడు' అనే పేరుతో ఉత్తమోత్తముడుగా కాలాంతరంలో ప్రసిద్ధి చెందుతాడు. వంద అశ్వమేధయాగాలు చేసి భూలోకంలో క్షత్రియులందరి చేతా ప్రశంసలందుకుంటాడు. నీకు శుభమగుగాక" అని ఆశీర్వదించి అదృశ్యమయ్యింది. ప్రియవ్రతుడు ఎంతో సంతోషంతో పునర్జన్మ పొందిన తన కుమారుణ్ణి తీసుకుని అంతఃపురానికి వచ్చాడు. షష్ఠీదేవికిచ్చిన మాట ప్రకారం ఎంతో వైభవంగా తన మందిరంలో రాజ్యంలో ఆమె పూజల్ని జరిపించాడు.

## షష్ఠీదేవి మంత్రం

### ఓం హ్రీం షష్ఠీదేవ్యై స్వాహా

షష్ఠీదేవి అష్టాక్షరీ దివ్యమంత్రం ఇది. ఈ మంత్రాన్ని లక్షసార్లు జపిస్తే సత్సంతానం కలుగుతుంది. ఇది బ్రహ్మ చెప్పిన మాట. ఈ మంత్రాన్ని షష్ఠీతిథినాడు జపిస్తే శుభప్రదంగా వుంటుంది.

**షష్ఠీదేవి పూజ :** ప్రతినెలలో వచ్చే శుద్ధ షష్ఠినాడు గానీ పిల్లలు పుట్టిన ఆరోరోజు గానీ, ఇరవై ఒకటో రోజుగానీ, అన్నప్రాశన చేసేరోజు గానీ షష్ఠీ (దేవసేనా) దేవిని పూజించాలి.

## షష్ఠీదేవి స్తోత్రం

నమోదేవ్యై మహాదేవ్యై సిద్ధ్యైశాంత్యై నమోనమః ।
సుఖదాయై మోక్షదాయై షష్ఠీదేవ్యై నమోనమః ॥
వరదాయై పుత్రదాయై ధనదాయై నమోనమః ।
సుఖదాయై మోక్షదాయై షష్ఠీదేవ్యై నమోనమః ॥
శక్తేః షష్ఠాంశ రూపాయై సిద్ధాయై చ నమో నమః ।
మాయాయై సిద్ధయోగిన్యై షష్ఠీదేవ్యై నమోనమః ॥
పరాయై పారదాయై చ షష్ఠీదేవ్యై నమోనమః ।
సారాయై సారదాయై చ పారాయై సర్వకర్మణాం ॥
బాలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీదేవ్యై నమోనమః ।
కళ్యాణదాయై కళ్యాణ్యై ఫలదాయై చ కర్మణాం ॥

ప్రత్యక్షాయై చ భక్తానాం షష్ఠీదేవ్యై నమోనమః ।
పూజ్యాయై స్కందకాంతాయై సర్వేషాం సర్వకర్మసు ॥
దేవరక్షణ కారిణ్యై షష్ఠీదేవ్యై నమోనమః ।
శుద్ధ సత్వ స్వరూపాయై నందితాయై నృణాంసదా ॥
హింసా క్రోధైర్వర్జితాయై షష్ఠీదేవ్యై నమోనమః ।
ధనం దేహి ప్రియాం దేహి పుత్రం దేహి సురేశ్వరి ॥
ధర్మం దేహి యశోదేహి షష్ఠీదేవ్యై నమోనమః ।
భూమిం దేహి ప్రజాం దేహి దేహి విద్యాం సుపూజితే ॥
కళ్యాణం చ జయం దేహి షష్ఠీ దేవ్యై నమోనమః ।
ఇతిం దేవీం చ సంస్తూయ లేభే పుత్రం ప్రియవ్రతః ॥
యశస్వినం చ రాజేంద్రం షష్ఠీదేవీ ప్రసాదతః ॥

*(శ్లో.57-66, అధ్యా-43, ఖం-2)*

**ఫలశ్రుతి :** ఈవిధంగా ప్రియవ్రతుడు షష్ఠీదేవిని స్తుతించి మరణించిన తన పుత్రుణ్ణి తిరిగిపొందాడు. ఎవరైతే ఈ దివ్యస్తోత్రాన్ని ఒక సంవత్సరం పాటు శ్రద్ధగా వింటారో, స్త్రీ ఎంత గొడ్రాలైనప్పటికీ ప్రతి షష్ఠీతిథినాడు క్రమం తప్పక ఒక సంవత్సరం ఈ స్తోత్రాన్ని పారాయణ చేస్తే సంతానవతి అవుతుంది. ఎవరి పిల్లలైనా దీర్ఘకాలంగా అనారోగ్యంతో పీడించబడుతూవుంటే వారి తల్లి తండ్రులు షష్ఠీదేవి స్తోత్రాన్ని పఠించాలి. తద్వారా, వారి పిల్లలు ఆరోగ్యం పొంది ఆనందంగా జీవిస్తారు. పసిపిల్లలు రోగ విముక్తి కోసం ఈదివ్య స్తోత్రాన్ని ఒక నెలరోజులు నియమంగా పఠించాలి.

## మంగళాదేవి వృత్తాంతం

మంగళాదేవినే మంగళచండీ అనికూడా అంటారు. ఆదేవి ఎన్నో మంగళకార్యాలకి కారకురాలు. అందుకే ఆమెని మంగళా అంటారు. అలాగే క్రతువుల్ని చీల్చిచెండాడే సమయంలో ఆమె చండప్రచండంగా వుంటుంది. కనుక ఆమెనే చండీ అనికూడా పిలుస్తారు. ఇలా రెండు స్వభావాలూ ఆ దేవిలో ఉండటం వల్ల ఆమె మంగళచండి అని లోకంలో విఖ్యాతి పొందింది.

కుజుడికి మంగళుడు అనేపేరు వుంది. మంగళుడికి ఇష్టదేవత కనుక ఆమె మంగళా అని కుజుడిచేత పిలువబడింది.

పూర్వం మనువంశంలో మంగళుడు అనే రాజు భూమండలాన్నంతా పాలించేవాడు. ఆ మంగళుడు ఈదేవిని భక్తిశ్రద్ధలతో ఎంతోకాలం పూజించాడు. మంగళాదేవి మరోరూపమే దుర్గ. ఈ దుర్గాదేవి ఆదిప్రకృతి పూర్ణాంశ స్వరూపిణి. స్త్రీలందరికీ ఎంతో ఇష్టమైన దేవత. మంగళాదేవిని మొదటిసారిగా త్రిపురాసురవథ సమయంలో శంకరుడు స్తుతించాడు. శంకరుడికి త్రిపురాసురులకి ఘోరంగా యుద్ధం జరుగుతున్న సమయంలో ఆదానవులు శంకరుణ్ణి రథం మీద నుంచి క్రిందకి పడేసారు. ఆ సమయంలో బ్రహ్మ విష్ణుల సూచన విని శంకరుడు మంగళ చండిని స్తుతించాడు. దుర్గాదేవి రూపభేదమే మంగళచండి.

## మంగళచండీ ధ్యానం

దేవీం షోడశ వర్షీయాం రమ్యాం సుస్థిర యౌవనాం ।
సర్వరూపా గుణాఢ్యాం చ కోమలాంగీం మనోహరాం ॥
శ్వేత చంపక వర్ణాభాం చంద్రకోటి సమప్రభాం ।
వహ్నిశుద్ధాంశుకాధారాం రత్న భూషణ భూషితాం ॥
బిభ్రతీం కబరీభారం మల్లికా మాల్య భూషితం ।
బంబోష్ఠీం సుదతీం శుద్ధాం శరత్పద్మని భావనాం ॥
ఈషద్ధాసన ప్రసన్నాస్యాం సునీలోత్పల లోచనాం ।
జగద్ధాత్రీంచ దాత్రీం చ సర్వేభ్యః సర్వసంపదాం ॥
సంసార సాగరే ఘోరే పోతరూపాం వరాం భజే ॥

*(శ్లో॥23-27,అధ్యా-44,ఖం-2)*

## మంగళచండీ మూలమంత్రం

**ఓం హ్రీం శ్రీం క్లీం సర్వపూజ్యే దేవి మంగళ చండికే**
**ఐం క్రీం ఫట్ స్వాహా ॥**

21 అక్షరాల ఈ మంగళ చండీ మంత్ర కల్పవృక్షంలాంటిది. మంగళచండీ దేవిని ధ్యానించి ఈ దివ్యమంత్రాన్ని పదిలక్షల సార్లు జపిస్తే మంత్రం సిద్ధిస్తుంది.

## మంగళచండీ స్తోత్రం

రక్షరక్ష జగన్మాతః దేవి మంగళ చండికే ।
సంహర్త్రి విపదాం రాశే దేవి మంగళ చండికే ॥
హర్షమంగళదక్షే చ హర్ష మంగళ చండికే ।
శుభే మంగళదక్షే చ శుభమంగళ చండికే ॥
మంగళే మంగళార్హే చ సర్వమంగళ మంగళే ।
సతాం మంగళదే దేవి సర్వేషాం మంగళాలయే ॥
పూజ్యా మంగళవారే చ మంగళాభీష్ట దైవతే ।
పూజ్యే మంగళభూపస్య మనువంశస్య సంతతం ॥
మంగళాధిష్ఠాతృదేవి మంగళానాం చ మంగళే ।
సంసారే మంగళాధారే మోక్షమంగళదాయిని ॥
సారే చ మంగళాధారే పారే త్వం సర్వకర్మణాం ।
ప్రతిమంగళవారం చ పూజ్యే త్వం మంగళప్రదే ॥
స్తోత్రేణానేన శంభుశ్చ స్తుత్వా మంగళ చండికాం ।
ప్రతి మంగళవారే చ పూజాం కృత్వా గతః శివః ॥
దేవ్యాశ్చ మంగళస్తోత్రం యః శ్రుణోతి సమాహితః ।
తన్మంగళం భవేత్ శశ్వత్ న భవేత్తదమంగళం ॥

*(శ్లో॥29-36,అధ్యా-44,ఖం-2)*

సాక్షాత్తు శంకరుడు చేసిన ఈ మంగళచండీ స్తుతిని ఎవరైతే శ్రద్ధగా వింటారో వారికి అశుభాలన్నవే కలగవు. ఎప్పుడు మంగళాలే ప్రాప్తిస్తాయి. మంగళచండీదేవిని మొదట శంకరుడు పూజించాడు. ఆ తరువాత మంగళుడనే కుజుడు ఆమెని సేవించాడు. క్రమంగా ప్రతి మంగళవారంనాడు సౌభాగ్యాన్ని కోరుకునే స్త్రీలందరూ ఆమెని అర్చించారు. ప్రతి మంగళవారం నియమంగా మంగళాదేవి స్తోత్రాన్ని పఠించినవారికి అన్నిటా విజయం లభిస్తుంది. ఆయురారోగ్య ఐశ్వర్యాలు వృద్ధి చెందుతాయి.

# మనసాదేవి వృత్తాంతం

పూర్వం భూలోకంలో మానవులంతా సర్పాలచేత బాధలు పడుతుండేవారు. సర్పాలు మానవుల్ని కాటువేసి వారి మరణానికి కారకులయ్యేవి. అలా ఎంతోమంది సర్పాల వల్ల మరణించారు. వారిలో దివ్యశక్తి కలిగిన కొంతమంది మహర్షులు బ్రహ్మ దగ్గరకి వెళ్ళి సర్పాల బారి నుంచి మానవుల్ని రక్షించమని ప్రార్థించారు. అప్పుడాయన కశ్యపమహర్షిని పిలిచి మానవులుపడుతున్న బాధల్ని వివరించాడు. వెంటనే కశ్యపప్రజాపతి తన దివ్యశక్తితో నాగులకి నాగమంత్రాలకీ అధిష్టాన దేవత అయిన మనసాదేవిని సృష్టించాడు.

కశ్యపుడి మనస్సు నుంచి పుట్టింది కాబట్టి ఆమె మనసాదేవి అని విఖ్యాతి చెందింది. ఆమె జన్మించగానే కైలాస పర్వతానికి వెళ్ళి వంద సంవత్సరాలు మహాదేవుణ్ణి పూజించంది. ఆమె పూజకి సంతోషించిన పరమేశ్వరుడు మనసాదేవికి సామవేదాన్ని నేర్పి, దివ్యమైన శ్రీకృష్ణ అష్టాక్షర మంత్రాన్ని ఉపదేశించాడు.

**"శ్రీం హ్రీం క్లీం కృష్ణాయనమః"** అనేది అష్టాక్షర మంత్రం. ఈ మంత్రంతో పాటు శ్రీకృష్ణ కవచాన్ని పూజావిధానాన్ని, ఆయన దివ్యస్తోత్రాల్ని కూడా ఉపదేశించి, అందరికీ అలభ్యమైన మృతసంజీవనీ విద్యనికూడా ఆమెకి ప్రసాదించాడు.

శంకరుడి ద్వారా ఉపదేశం పొందిన శ్రీకృష్ణుడి మంత్రాన్ని, పుష్కరక్షేత్రానికి వెళ్ళి అక్కడ మూడు యుగాలు తపస్సు చేసింది మనసాదేవి. ఆమె చేసిన ఘోరమైన తపస్సుకి మెచ్చిన శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై రాబోయేకాలంలో భూలోకంలో అందరిచేతా పూజించబడతావు అని వరాన్నిచ్చాడు.

ఆవిధంగా గొప్పతపశ్శక్తితో వరాలు పొందిన మనసాదేవిని ఆమెతండ్రి కశ్యపుడు జరత్కారుమహర్షికిచ్చి వివాహం చేసాడు. వారిద్దరూ హాయిగా సంసారం చేస్తూ కాలం గడపసాగారు. ఒకనాడు జరత్కారుడు మనసాదేవి ఒడిలో తలపెట్టుకుని హాయిగా ఆదమరిచి నిద్రపోతున్నాడు. సాయంత్రమయ్యింది.

ఆయన సంధ్యావిధి ఆచరించాల్సిన సమయం మించిపోతోంది. ఈవిషయాన్ని గ్రహించి మనసాదేవి, ధర్మలోపంజరగకూడదని భావించి, వెంటనే తన భర్తని నిద్రలేపింది. హఠాత్తుగా తనకి నిద్రాభంగం కలిగించటంతో జరత్కారుమహర్షికి ఆగ్రహం కలిగి ఆమెని నిందించి, ఇకనేను నీతో ఉండను నువ్విప్పుడే వెళ్ళిపో లేదా నేనే ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయి తపస్సు చేసుకుంటాను అని కఠినంగా పలికాడు.

భర్త మాటలువిన్న మనసాదేవి ఎంతోదుఃఖిస్తూ "ప్రభూ! తమకు ధర్మలోపం కలగకూడదనే నేను తమర్ని నిద్రలేపాను. కావాలని మీకు నిద్రాభంగం చేయలేదు దయచేసి నన్ను క్షమించండి". అని ప్రాధేయపడింది. అయినా ఆ మహర్షి శాంతించలేదు. అప్పుడు మనసాదేవి భయంతో తన గురువైన శంకరుణ్ణి, తండ్రి కశ్యపుణ్ణి, బ్రహ్మ విష్ణువుల్ని స్మరించింది. వెంటనే వారంతా అక్కడ ప్రత్యక్షమయ్యారు. వారంతా నచ్చచెప్పినా జరత్కారు వినలేదు. తాను ఆడిన మాట తప్పనన్నాడు. ఇకచేసేదేమీలేక బ్రహ్మదేవుడు ఆయనతో "మహర్షీ! నీవు తపస్సుకి వెళ్ళేముందు నీభార్యకి ఒక కుమారుణ్ణి ప్రసాదించి వెళ్ళు! అది ధర్మం అని తెలియచెప్పాడు.

అందుకంగీకరించిన జరత్కారుడు మనసాదేవి నాభిమీద చేయివేశాడు. ఆయన తపఃశక్తితో మనసాదేవి వెంటనే గర్భాన్ని ధరించింది. జరత్కారుడు ఆమెతో "మనసా! నేను నిన్ను విడిచి వెళ్ళటం అనేది విధి నిర్ణయం– నీకు పుట్టబోయే బిడ్డ మహావిష్ణుభక్తుడై, గొప్ప తపస్విగా పేరు పొందుతాడు. వంశాన్ని ఉద్ధరిస్తాడు" అని ఆమెతో ప్రేమగా చెప్పాడు.

మనసాదేవి భర్తమాటలు విని జరిగిందంతా కర్మప్రారబ్ధమని గ్రహించి బాధను దిగమింగుకుంది. వెళ్ళిపోబోతున్న భర్తతో "స్వామీ! తమరు నేను ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు రావాలి ఈ కోరికని మన్నించండి" అని ప్రార్థించింది. జరత్కారువు అలాగే తప్పక వస్తానని మాట ఇచ్చి శ్రీకృష్ణ పరమాత్మను గురించి తపస్సుచేసుకోవటానికి వెళ్ళిపోయాడు.

కొంతకాలానికి మనసాదేవి నారాయణాంశ సంభూతుడైన ఒక పుత్రుణ్ణి కన్నది. అతడికి అస్తీకుడు అన్నపేరు పెట్టింది. పరమేశ్వరుడు స్వయంగా

ఆ పిల్లవాడికి అక్షరాభ్యాసంచేసి వేదాలు శాస్త్రాలు బోధించాడు. మృత్యువుని జయించే తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించాడు. అస్తీకుడు శివుడి బోధలతో మహాజ్ఞానిగా మారిపోయాడు. శంకరుడి ఆజ్ఞతో అస్తీకుడు పుష్కర క్షేత్రానికి వెళ్ళి లక్ష దివ్య సంవత్సరాలు శ్రీమహావిష్ణువు గురించి తపస్సుచేసాడు.

ఇలా సకల శాస్త్రాలూ అభ్యసించి మహాతపస్విగా ఎన్నో సిద్ధ శక్తులు సంపాదించిన అస్తీకుడు కాలాంతరంలో జనమేజయుడు చేస్తున్న సర్పయాగాన్ని ఆపించి, దేవతలకి సర్పజాతికి మహోపకారం చేసాడు. మనసాదేవి ఆజ్ఞతో అస్తీకుడు దేవతల్ని సర్పాల్ని రక్షించినందుకు కృతజ్ఞతగా దేవేంద్రుడు మనసాదేవిని షోడశోపచారాలతో పూజించి, ఆమె మంత్రాన్ని జపించి ఆ తరువాత ఘనంగాస్తుతించాడు.

## మనసాదేవి మంత్రం

### ఓం హ్రీం శ్రీం మనసాదేవ్యై స్వాహా

## మనసాదేవి ద్వాదశనామ స్తోత్రం

జరత్కారుర్జగద్గేరి మనసా సిద్ధయోగినీ ।
వైష్ణవీ నాగభగినీ శైవీ నాగేశ్వరీ తథా॥
జరత్కారు ప్రియాఽ స్తీకమాతా విషహారీతి చ ।
మహాజ్ఞాన యుతాచైవ సాదేవీ విశ్వపూజతా॥
ద్వాదశైతాని నామాని పూజాకాలేచయః పఠేత్ ।
తస్యనాగ భయం నాస్తి తస్యవంశోద్భవస్యచ ॥
ఇదుస్తోత్రం పఠిత్వాతు ముచ్యతే నాత్ర సంశయః ।
నాగభీతేచ శయనే నాగగ్రస్తేచ మందిరే ॥
నాగక్షతే నాగదుర్గే నాగవేష్టిత విగ్రహే॥ *(శ్లో॥13-18, అధ్యా.46, ఖం.2)*

1.జరత్కారు 2.జగద్గౌరీ 3.మనసా 4.సిద్ధయోగినీ 5.వైష్ణవీ 6.నాగభగినీ 7.శైవీ 8.నాగేశ్వరీ 9.జరత్కారుప్రియా 10.అస్తీకమాతా 11.విషహారీ 12.మహాజ్ఞానయుతా, అనే ఈ పన్నెండు పేర్లు. మనసాదేవిని ఎవరైతే ఈ దివ్య నామాల్ని నిత్యం పఠిస్తారో వారికి సర్ప భయం అనేదే వుండదు. అతని వంశంలో పుట్టబోయేవారికి కూడా సర్పభయం వుండదు.

నిద్రలో పాముకలలోకి వస్తున్నా, తరచూ ఇంటిలోని సర్పాలు వస్తున్నా, పాముకాటు వేయటానికి ప్రయత్నించేడప్పుడు, సర్పాల మధ్యలో చిక్కుకు పోయినప్పుడు ఈ నామస్తోత్రాన్ని గానీ నామాల్ని గానీ పఠిస్తే సర్పాలు దూరంగా వెళ్ళిపోతాయి. ఈ స్తోత్రాన్ని శ్రద్ధగా నిత్యం పారాయణ చేసే వాడిని చూస్తే పాములు భయపడి పారిపోతాయి. పదిలక్షల సార్లు ఈ స్తోత్రాన్ని జపిస్తే సిద్ధిస్తుంది. సిద్ధి పొందినవాడు పాముల్ని ఆభరణాలుగా మెడలో ధరించగలడు.

## మనసాదేవి స్తోత్రం

దయారూపా చ భగినీ క్షమారూపాయథా ప్రసూః ।
త్వయా మే రక్షితాః ప్రాణాః పుత్రదారాః సురేశ్వరి ॥

అహం కరోమి త్వాం పూజ్యాం మమప్రీతిశ్చ వర్ధతే ।
నిత్యం యద్యపి పూజ్యాత్వం భవేఽత్ర జగదంబికే ॥

తథాఽపి తవపూజాం వైవర్ధయామి పునః పునః ।
యే త్వామాషాఢ సంక్రాంత్యాం పూజయిష్యంతి భక్తితః ॥

పంచమ్యాం మనసాఖ్యాయాం మాసాంతేవా దినేదినే ।
పుత్రపౌత్రాదయః తేషాం వర్ధంతే చ ధనాని చ ॥

యశస్వినః కీర్తిమంతో విద్యావంతో గుణాన్వితాః ।
యే త్వాం న పూజయిష్యంతి నిందంత్యజ్ఞానతో జనాః ॥

లక్ష్మీ హీనా భవిష్యంతి తేషాం నాగభయం సదా ।
త్వం స్వర్గలక్ష్మీః స్వర్గే చ వైకుంఠే కమలా కళా ॥

నారాయణాంశో భగవాన్ జరత్కారుర్మునీశ్వరః ।
తపసా తేజసా త్వాం చ మనసా ససృజే పితా ॥

అస్మాకం రక్షణాయైవ తేన త్వం మనసాభిధా ।
మనసా దేవితుం శక్తా చాత్మనా సిద్ధయోగినీ ॥

తేన త్వం మనసాదేవీ పూజితా వందితా భవే ।
యాం భక్త్యా మనసా దేవా పూజయంత్యనిశం భృశం ॥

తేన త్వాం మనసాం దేవీం ప్రవదంతి పురావిదః ।
సత్వరూపా చ దేవీ త్వం శశ్వత్సత్య నిషేవయా ॥
యో హి యద్భావయేన్నిత్యం శతం ప్రాప్నోతి తత్సమం ॥

*(శ్లో॥131-140, అధ్యా-46, ఖం-2)*

ఈ విధంగా మహేంద్రుడు మనసాదేవిని స్తుతించి తన ప్రాణాలు కాపాడిన ఆసోదరిని స్వర్గలోకానికి తీసుకువెళ్ళాడు. యధోచితంగా ఆమెని సత్కరించాడు. మనసాదేవి ఇంద్రుడి కోరిక మేరకు కొన్నాళ్ళు అక్కడే వుండి దేవతలందరికి జ్ఞానోపదేశం చేసింది.

**స్తోత్ర ఫలశ్రుతి :** పుణ్యప్రదమైన మనసాదేవి స్తోత్రాన్ని, మంత్రాన్ని పఠించినవాడికి, వారి వంశంలోవారికి ఎప్పటికీ సర్పభయం ఉండదు. ఈస్తోత్రం 5 లక్షల సార్లు పఠిస్తే సిద్ధిస్తుంది. సిద్ధిపొందిన వాడికి పాము విషం అమృతమవుతుంది.

## సురభి వృత్తాంతం

సురభి గోవులన్నిటికీ అధిష్ఠాన దేవత. గోవులకి తల్లిలాంటిది. అన్ని గోవులకన్నాగొప్పది. అలాంటి సురభిపుట్టింది గోలోకంలో.

ఒకనాడు శ్రీకృష్ణుడు రాధాదేవితో మరికొందరు గోపికలతో కలిసి బృందావనానికి వెళ్ళాడు. అక్కడ ఆనందంగా రాధాదేవితో విహరించసాగాడు. అలావారిద్దరూ ఏకాంతంగా సంచరిస్తున్న సమయంలో హఠాత్తుగా శ్రీకృష్ణుడికి పాలుత్రాగాలనిపించింది. వెంటనే ఆయన ఎడమభాగం నుంచి దూడతో సహా చక్కటి పాలనిచ్చే సురభి ఆవిర్భవించింది.

అందంగా నిండు పాలకుండలావున్న సురభిని చూసి శ్రీకృష్ణుడు ఎంతో సంతోషించాడు. రత్న భాండంలో ఉన్న వెచ్చని సురభిపాలని ఆనందంగా త్రాగాడు. ఆపాలు అమృతంలాంటివి, జన్మ మృత్యువుల్ని పోగొట్టేవి. శ్రీకృష్ణుడు ఆ పాలుత్రాగుతున్నప్పుడు ఆ బాండం చేయిజారి అందులో వున్న పాలు నేలమీదకి ఒలికిపోయాయి. అలా ఒలికిన పాలు వందయోజనాల విస్తీర్ణంలో

క్షీరసరోవరంలా మారిపోయింది. ఆక్షీరసరోవరం రాధాదేవి గోపికలు ఆడుకోవటానికి ఉపయోగపడింది. ఆక్షీరసాగరం చుట్టూ రత్నాలతో మెట్లని నిర్మించారు. శ్రీకృష్ణుడికే పాలను అందించి ఆయన్ని తృప్తి పరిచింది సురభి. ఆ గోమాత రోమకూపాలనుంచి ఎన్నో లక్షల కోట్ల ధేనువులు దూడలతో సహా ఆవిర్భవించాయి. ఆకామధేనువులు, వాటిదూడలు, దూడల దూడలు ఇలా అసంఖ్యాకమైన గోవులతోగోలోకం ఏర్పడింది.

ముందుగా సురభిని శ్రీకృష్ణ పరమాత్మ పూజించాడు. తరువాత కాలంలో శ్రీకృష్ణుడి ఆజ్ఞని అనుసరించి దీపావళి మర్నాడు ఉదయం సురభి పూజచేయటం ఆచారంలోకి వచ్చింది. ఆనాటి నుంచి నేటి వరకూ ఆ ఆచారం భూలోకంలో ఆచరించబడుతోంది.

## సురభి మంత్రం

### ఓం సురభ్యై నమః

ఇది షడక్షరమంత్రం ఈ దివ్యమంత్రాన్ని ఒక లక్షసార్లు జపిస్తే మంత్రం సిద్ధిస్తుంది. ఈ మంత్రం సాధకులకి కల్పవృక్షంలా అన్నిటినీ ప్రసాదిస్తుంది.

సురభిని పూజించి ఆ ధేనువు మంత్రాన్ని జపించటం వల్ల బుద్ధి, వృద్ధి, ముక్తి మానవులకు లభిస్తాయి. సమస్త కోరికల్నీ తీర్చేదే సురభి. ఈ సురభి లక్ష్మీ స్వరూపిణి సకల శుభాల్నీ కలిగిస్తుంది.

సురభిని కలశంలోగానీ, ఆవునుదిటి మీదగానీ, ఆవుల్ని కట్టేసే స్తంభాలమీదగానీ, సాలగ్రామం మీదగానీ, నీరు, అగ్ని వీటిలో దేనిమీదైనా ఆవాహన చేసి పూజించవచ్చు.

ఒకప్పుడు వరాహకల్పంలో శ్రీమహావిష్ణువు ఆజ్ఞననుసరించి సురభిపాలు ఇవ్వటం ఆపేసింది. అప్పుడు దేవతలందరూ పాలు లభించక అల్లాడిపోయారు. అందరూ కలిసి దేవేంద్రుణ్ణి ప్రార్థించగా, ఆయన సురభి అనుగ్రహించటం కోసం ఆమెనిలా భక్తిగా స్తుతించాడు.

## సురభిస్తోత్రం (ఇంద్రకృతం)

నమోదేవ్యై మహాదేవ్యై సురభ్యై చనమో నమః ।
గవాంబీజ స్వరూపాయై నమస్తే జగదంబికే ॥
నమోరాధా ప్రియాయైచ పద్మాంశాయై నమోనమః ।
నమః కృష్ణ ప్రియాయైచ గవాం మాత్రే నమోనమః ॥
శ్రీదాయై ధనదాయైచ బుద్ధిదాయై నమోనమః ।
శుభదాయై ప్రసన్నాయై గోప్రదాయై నమోనమః ॥
యశోదాయై సౌఖ్యదాయై ధర్మజ్ఞాయై నమోనమః ।
స్తోత్రశ్రవణ మాత్రేణ తుష్టాహృష్టా జగత్ప్రసూః ॥

*(శ్లో॥24-27,అధ్యా-48,ఖం-2)*

మహేంద్రుడు చేసిన ఈ స్తోత్రం విని సురభి సంతోషించి తిరిగి పాలను దేవతలకి ప్రసాదించటం ప్రారంభించింది. పాలవలన పెరుగు, వెన్న, నేయి లభించి యజ్ఞయాగాలు విరివిగా జరగటంతో దేవతలందరికీ నిత్యం ఆహారం లభిస్తోంది.

**ఫలశ్రుతి :** ఎంతో పుణ్యప్రదమైన సురభిస్తోత్రాన్ని ప్రతిరోజూ శ్రద్ధగా పఠించినవాడు. గోసంపదకి యజమాని అవుతాడు. కీర్తి ప్రతిష్ఠలు అతడి సొంతమవుతాయి. సకల పాపాలూ నశించి, సమస్త పుణ్య తీర్థాలలో స్నానం చేసిన ఫలితం అతడికి లభిస్తుంది. సురభిస్తోత్రాన్ని, మంత్రాన్ని పఠించినవాడు ఇహలోకంలో సకల సుఖాలు అనుభవించి మరణానంతరం గోలోకానికి చేరుకుంటాడు.

## రాధాదేవి వృత్తాంతం

ఒకనాడు పార్వతీదేవి, పరమేశ్వరుడు ప్రశాంతంగా, ఆనందంగావున్న సమయంలో, రాధాదేవి జన్మవృత్తాంతం, ఆమెధ్యానం కవచం, పూజ, స్తోత్రం వీటి గురించి చెప్పమని ఆయన్ని కోరింది. పార్వతి కోరికని మన్నించి పరమరహస్యమైన రాధాదేవి దివ్య చరిత్రని ఆమెకి ఇలా సవివరంగా బోధించాడు.

దేవీ! పూర్వం బృందావనంలో వున్న రాసమండలంలో శ్రీకృష్ణ పరమాత్మ దివ్య సింహాసనంమీద ఆసీనుడైవున్నాడు. అప్పుడు ఆయనకి హఠాత్తుగా రమించాలనే కోరిక కలిగింది. అలా ఆయనకి సంకల్పం కలిగిందో లేదో వెంటనే తన శరీరం రెండు రూపాలుగా ఏర్పడింది. అందులో కుడిభాగం శ్రీకృష్ణుడుగా, ఎడమభాగం రాధాదేవిగా ఏర్పడ్డాయి.

శరత్కాలపూర్ణిమలాంటి అందమైన ముఖంతో, అమూల్యమైన దివ్యాభరణాల్ని బంగారు రంగు జరీచీరని ధరించి రత్నసింహాసనంమీద కూర్చున్న రాధాదేవి కృష్ణుడికి కనిపించింది. జగన్మోహనాకారమైన ఆమె సౌందర్యం చూసి కృష్ణుడి మనసు చలించింది. వెంటనే ఆమెని అక్కున చేర్చుకున్నాడు. రాధాదేవి కూడా జగదేక సుందరుడైన కృష్ణుణ్ణి ఆనందంగా వరించింది. అలా రాధాదేవినామాన్నే నిత్యం స్మరిస్తూ ఆమెతోనే లోకంగా విహరించసాగాడు కృష్ణపరమాత్మ.

'రా' అంటే ఇవ్వటం అని 'ధా' అంటే ముక్తి అని అర్ధం రాధా అనగా ముక్తిని ఇచ్చేది అని భావం. ఆవిధంగా శ్రీకృష్ణుడి పార్శ్వం నుంచి రాధాదేవి ఆవిర్భవించగా ఆమె రోమకూపాలనుంచి ఎందరో గోపికలు ఆవిర్భవించారు. అదేవిధంగా అటు శ్రీకృష్ణుడి దివ్య శరీరం మీది రోమకూపాల నుంచి కూడా అసంఖ్యాకంగా గోపకులు ఉదయించారు.

రాధాదేవి ఎడమభాగం నుంచి మహాలక్ష్మీదేవి ఆవిర్భవించింది. ఆమె వైకుంఠనాధుడైన చతుర్భుజ నారాయణుడికి భార్య అయ్యింది. ఆమె అంశతోనే తిరిగి 'రాజ్యలక్ష్మి' ఉదయించింది. ఈ రాజ్యలక్ష్మి రాజులందరికీ ఆనందాన్ని కలిగిస్తుంది. ఈ రాజ్యలక్ష్మి రాజులందరికీ ఆనందాన్ని కలిగిస్తుంది. ఈ రాజ్యలక్ష్మి అంశతో 'మర్త్యలక్ష్మి' ఆవిర్భవించింది. ఈ దేవి భూలోకంలోని మానవుల ఇళ్ళలో దీపానికి అధిష్ఠానదేవతగా పూజలందుకుంటోంది.

రాధాదేవి కృష్ణపరమాత్మ ప్రాణపత్ని,ఎప్పుడూ ఆయన హృదయాన్నే అంటిపెట్టుకుని ఉంటుంది. శ్రీమహావిష్ణువుకి ఆమె తల్లి. సత్పురుషులు,

బ్రహ్మాది దేవతలు సైతం ఆమెని నిత్యం ఆరాధిస్తూవుంటారు. అలాంటి రాధాదేవి సుదాముడు అనేవాడి శాపం వల్ల భూలోకంలో వృషభానుడికి కూతురుగా జన్మించింది.

**సుదాముడి శాపం :** ఒకనాడు రాధాదేవి ప్రాణ సఖుడైన శ్రీకృష్ణుడు. 'విరజ' అనే అందమైన గోపకన్యతో శృంగారం జరుపుతున్నాడు. గోలోకంలో వున్న శతశృంగ పర్వత ప్రాంతంలో అమూల్యమైన రత్నాల మంచంమీద వారిద్దరూ ఎన్నో సంవత్సరాలు ఆనందంలో మునిగితేలారు. జరామరణాలులేని ఆ గోలోకంలో ఎన్నివేల సంవత్సరాలైనా అది కొద్దికాలంగానే ఉంటుంది. ఆ విషయాన్ని గమనించిన రాధాదేవి చెలికత్తెలు వెంటనే ఆమె దగ్గరికి వచ్చి "కృష్ణపరమాత్మ విరజాదేవితో సుఖిస్తున్నాడని" చెప్పారు. ఆ మాటవినగానే రాధాదేవి ముఖం కోపంతో ఎరుపెక్కిపోయింది. వెంటనే తన చెలికత్తెల్ని వెంటబెట్టుకుని వాళ్ళిద్దరూ ఉన్న ప్రదేశానికి బయలుదేరింది.

శ్రీకృష్ణుడు దూరం నుంచి రాధాదేవి రాకను గమనించాడు. వెంటనే విరజాదేవిని వదిలి అక్కణ్ణుంచి హఠాత్తుగా అదృశ్యమయ్యాడు. ఇక ఒంటరిగా ఉన్న విరజాదేవి కూడా రాధాదేవి ఆగ్రహానికి గురౌతానని భయపడి ఒకనదిగా మారిపోయింది. ఆమెతో పాటు ఆమె చెలులుకూడా చిన్న చిన్న నదులుగా మారిపోయారు.

ఎంతో ఆగ్రహంతో ఆగమేఘాలమీద అక్కడికి వచ్చిన రాధాదేవికి కృష్ణుడూ కనిపించలేదు. విరజాదేవి జాడా తెలియలేదు. ఇకచేసేదేమిలేక విచారంగా తన గృహానికి తిరిగి వెళ్ళింది రాధాదేవి. రాధాదేవి గృహానికి వచ్చిన కొంత సమయం తరువాత శ్రీకృష్ణుడు ఎనిమిదిమంది సహచర గోపకులతో రాధాదేవి మందిరంలోకి ప్రవేశించాడు. అక్కడున్న ద్వారపాలకులు "రాధాదేవి చాలా కోపంగా వుంది స్వామీ! లోపలికి వెళ్ళద్దు" అని కృష్ణణ్ణి వారించారు. అయినావారి మాటలు లెక్క చేయకుండా ఆయనలోపలికి వెళ్ళాడు.

కృష్ణణ్ణి చూసే సరికి ఒక్కసారిగా రాధాదేవికి కోపం పెరిగి పోయింది. ఎన్నో పరుషమైన మాటలతో ఆయన్ని నిందించటం ప్రారంభించింది.

శ్రీకృష్ణుడు మౌనంగా ఆమె మాటల్ని భరిస్తున్నాడు. అయితే ఆయనతో వచ్చిన సుదాముడు మాత్రం తన తండ్రి అయిన శ్రీకృష్ణుణ్ణి రాధాదేవి నిందించటం సహించలేకపోయాడు. వెంటనే కోపంగా తాను కూడా రాధాదేవిని దూషించటం మొదలుపెట్టాడు. సుదాముడి మాటలు విన్న రాధాదేవికి ఆగ్రహం పెల్లుబికింది. "ఓరి సుదామా! నీవు కూడా నన్ను దూషిస్తావా! ఎంతధైర్యం పెద్దా చిన్నా తారతమ్యం రాక్షసంగా ప్రవర్తించావు కాబట్టి నీవు రాక్షసుడిగా భూలోకంలో జన్మించు" అని శపించింది.

రాధాదేవి శాపం విన్న సుదాముడు కూడా అంతే ఆగ్రహంతో "రాధాదేవి! నీవు కూడా నీ చెలికత్తెలతో సహా భరతఖండంలో జన్మించు. అక్కడ నీవు శ్రీకృష్ణుడితో వందసంవత్సరాలు వియోగం ప్రాప్తిస్తుంది. నీతోపాటు శ్రీకృష్ణుడు కూడా భూలోకంలో జన్మించి, అసుర సంహారం ద్వారా భూభారాన్ని తగ్గిస్తాడు" అని ప్రతిశాపం ఇచ్చాడు.

కొద్దిసేపటికి రాధా-సుదాములిద్దరికీ కోపం తగ్గిపోయింది. సుదాముడు తన తల్లి అయిన రాధాదేవిని శపించినందుకు ఎంతో పశ్చాత్తాపపడ్డాడు. తీవ్రంగా దుఃఖిస్తూ భూలోకానికి బయలుదేరాడు. ఇక రాధాదేవికూడా తనకుమారుణ్ణి శపించినందుకు ఎంతో బాధపడింది. నాయనా! సుదామా! నన్ను విడిచి ఎక్కడివెళుతున్నావు అని విలపించింది. అప్పుడు కృష్ణుడు రాధాదేవిని ఓదార్చి! దేవీ! బాధపడవద్దు త్వరలోనే నీ కుమారుడు తిరిగి వస్తాడు" అని చెప్పి ఆమెని ఊరడించాడు.

పార్వతీ! ఆ సుదాముడే శంఖచూడుడనే రాక్షసుడుగా భూలోకంలో జన్మించాడు. తులసీదేవి అతణ్ణి వివాహంచేసుకుంది. చివరికి ఆ శంఖచూడుడు నాశూలం ద్వారా మరణించి తిరిగి గోలోకాన్ని చేరుకున్నాడు.

**భూలోకంలో రాధాదేవి జననం :** ఇక సుదాముడికిచ్చిన శాపాన్ని అనుసరించి వరాహకల్పంలో రాధాదేవి తన చెలికత్తెలతో కలిసి భూలోకానికి వచ్చింది. అక్కడ వృషభాను మహారాజుకి కూతురుగా జన్మించింది. అయోనిజ అయిన రాధాదేవి వృషభానుడి భార్య కళావతికి వాయురూపంలో జన్మించింది.

రాధాదేవికి పన్నెండు సంవత్సరాల వయసు వచ్చే సరికి వృషభానుడు ఆమెని 'రాయాణుడు' అనే వైశ్యపుత్రుడుకిచ్చి వివాహం జరిపించాలనుకున్నాడు. అది తెలిసిన రాధాదేవి అక్కడ తన ఛాయారూపాన్ని ఉంచి అదృశ్యమయ్యింది. అది తెలియని రాయాణుడు ఛాయా రాధాదేవినే వివాహం చేసుకున్నాడు.

రాధాదేవి పద్నాలుగు సంవత్సరాల ప్రాయంలోకి అడుగుబెట్టింది. అదే సమయంలో శ్రీకృష్ణుడు గోకులానికి వచ్చాడు. శ్రీకృష్ణుడికి యశోదతల్లి అయితే రాయాణుడు యశోదాదేవికి సోదరుడు. ఆవిధంగా అతడు శ్రీకృష్ణుడికి మేనమామ అయ్యాడు. ఈ రాయాణుడే పూర్వం గోలోకంలో శ్రీకృష్ణాంశతో జన్మించిన గోపుడు.

ఇక్కడ రాధాదేవి ఛాయారూపంలో రాయాణుడికి భార్యగా, నిజస్వరూపంతో శ్రీకృష్ణుడి వక్షస్థలంలో కొలువై వుంది. గోలోక నాథుడైన శ్రీకృష్ణుడు బృందావన ధామంలో రాధాదేవితో కొన్నాళ్ళు ప్రత్యక్షంగా కాలం గడిపాడు. తరువాత సుదాముడి శాపం ప్రకారం వారిద్దరి మధ్యా వియోగం సంభవించింది. శ్రీకృష్ణుడు ఎంతోమంది అసురుల్ని అసురాంశ సంభూతుల్ని వధించి భూభారాన్ని తగ్గించాడు. అలా వంద సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకనాడు కృష్ణుడు తీర్ధయాత్రలు చేసే సందర్భంలో రాధాదేవిని కలుసుకున్నాడు.

తరువాత శ్రీకృష్ణుడు రాధాదేవిని తీసుకుని గోలోకానికి వెళ్ళాడు. వీరితో పాటే కృష్ణుడి వల్ల యశోదాదేవి, రాధాదేవి తల్లి కళావతి, వృషభానుడు, నందుడు వారివెంట గోపికలు, గోపకులు అందరూ గోలోకానికి చేరుకున్నారు.

భూలోకంలో శ్రీకృష్ణుణ్ణి పెంచిన 'నందుడు' పూర్వ జన్మలో 'ద్రోణుడు' అనే ప్రజాపతి. నందుడి భార్య యశోదా దేవి 'భూదేవి' అంశ. వీరిద్దరూ పూర్వజన్మలో తపస్సుచేసిన కారణంగా కృష్ణపరమాత్మకు తల్లి తండ్రులయ్యారు. అలాగే శ్రీకృష్ణుడి కన్న తండ్రి అయిన వసుదేవుడు పూర్వజన్మలో కశ్యపప్రజాపతికాగా, తల్లి దేవకీదేవి 'అదితి' అంశతో జన్మించింది. ఈ కశ్యప – అదితులిద్దరూ ప్రతికల్పంలో పరమాత్మకి తల్లితండ్రులుగానే ఉంటారు.

ఇక భూలోకంలో రాధాదేవికి తల్లిగా వున్న 'కళావతి' పూర్వజన్మలో పితృదేవతల మానసీకన్యకాగా, గోలోకంలో వున్న వసుదాముడే రాధాదేవి తండ్రి వృషభానుడుగా అవతరించాడు.

**రాధాదేవివైభవం :** ఉపాసకులు ముందుగా రాధాదేవి పేరుని ఉచ్చరించి ఆ తరువాతే శ్రీకృష్ణుడి నామాన్ని ఉచ్ఛరించాలి. 'రాధాకృష్ణ' అని. అలాకాక ముందుగా శ్రీకృష్ణ నామాన్ని తరువాత రాధాదేవినామాన్ని ఉచ్ఛరిస్తే బ్రహ్మహత్యా పాపం చుట్టుకుంటుంది.

శ్రీకృష్ణుడు గోలోకం చేరాక ఒక కార్తీక పౌర్ణమినాడు మహావైభవంగా రాధాదేవిని పూజించాడు. ఆ పూజని అంగరంగ వైభవంగా, గోలోకంలో ఒక ఉత్సవంగా జరిపించాడు. రాధాదేవి కవచాన్ని రచించి దాన్ని తన కంఠంలో, కుడిభుజానికి స్వయంగా ధరించాడు. కేవలం తాను ధరించటమే కాకుండా తన అనుచర గోపకులందరి చేతా ధరింపచేసాడు. తరువాత మహిమాన్వితమైన రాధాదేవి ధ్యానాన్ని చేసి ఆమె స్తోత్రాన్ని కూడా పఠించాడు. ఇలా రాధాదేవి మీద శ్రీకృష్ణుడు అంతులేని గౌరవాన్ని చూపించాడు. ఇద్దరుగా కనిపిస్తున్నప్పటికీ నిజానికి వీరిద్దరూ ఒక్కటే.

పార్వతీ! రాధాదేవిని మొట్టమొదట కృష్ణపరమాత్మ పూజించగా తరువాత నేను (శంకరుడు) బ్రహ్మదేవుడు, ధర్మదేవత, అనంతుడు, వాసుకి, సూర్యచంద్రులు, ఇంద్రుడు, రుద్రులు, మనువులు, మానవులు, దేవతలు, మునులు, ఋషులు, ఇలా అందరూ పూజించారు.

**సుయజ్ఞుడి వృత్తాంతం :** పూర్వం స్వాయంభువమనువంశంలో ఉత్కళుడనే మహారాజు జన్మించాడు. అతడు నారాయణ భక్తుడు. ఒక శుభ ముహూర్తంలో పుష్కర క్షేత్రానికి వెళ్ళి, అక్కడ వేయి రాజసూయ యాగాల్ని మహావైభవంగా జరిపించాడు. ఆ యాగాలు ముగిసాక బ్రాహ్మణులకి ఎంతో విలువైన రత్న పాత్రల్ని దానం చేసాడు.

అత్యంతవైభవంగా నభూతో నభవిష్యతి అన్న రీతిలో ఉత్కళుడు చేసిన యాగాలు చూసి బ్రహ్మదేవుడు అతడికి 'సుయజ్ఞుడు' అన్న బిరుదునిచ్చాడు.

ఆ సుయజ్ఞుడు రత్న పాత్రలనే కాక నవరత్నాలతో అలంకరించిన కొమ్ములు గల పదిలక్షల గోవుల్ని కూడా విప్రులకి దానంచేసాడు. అలాగే కోట్లాది మంది బ్రాహ్మణులకి అన్న సంతర్పణలు కూడా చేసాడు. సుయిజ్ఞుడు ఇచ్చిన ధనరాసుల్ని మోసుకుపోలేక ఎంతోమంది విప్రులు వాటిని అక్కడే వదిలేసారు. మరికొంతమంది దారిలో వదిలేసి వెళ్ళిపోయారు. అంతమంది భుజించినా ఇంకా ఎన్నో అన్నరాశులు అక్కడ మిగిలిపోయాయి.

యాగం నిర్విఘ్నంగా పరిసమాప్తం కావటంతో సుయజ్ఞుడు ఆనందంగా రాజసభలో సింహాసనం మీద కొలువుదీరాడు. అప్పుడు ఆ సభలోకి, మాసిన వస్త్రాలతో, గొంతుతడి ఆరిపోతున్న స్థితిలో ఒక బీదబ్రాహ్మణుడు వచ్చాడు. లోపలికి వచ్చిన బ్రాహ్మణుడు సరాసరి సుయజ్ఞుడి దగ్గరకి వెళ్ళి ఆయన్ని ఆశీర్వదించాడు. సుయజ్ఞుడు మౌనంగా ఆ విప్రుడి ఆశీర్వాదాన్ని అందుకున్నాడే గానీ కనీసం మర్యాద కోసమైన లేచి నిలబడలేదు. అతడే కాదు ఆ సభలో వున్న ఎవ్వరూ లేచి నిలబడలేదు. పైగా ఆ విప్రుణ్ణి చూసి అవహేళనగా నవ్వారు.

తనని అవమానించిన సుయజ్ఞుడి మీద బ్రాహ్మణుడికి ఆగ్రహం కలిగింది. వెంటనే "ఓ సుయజ్ఞా! గొప్పరాజువన్న మదంతో, అహంకారంతో నిన్ను ఆశీర్వదించటానికి వచ్చిన నన్ను విప్రుణ్ణి కనీస గౌరవంకూడా చూపకుండా అవమానించావు. కనుక త్వరలోనే నీవు రాజ్య భ్రష్టుడవైపోతావు. నీకు కుష్ఠువ్యాధి సంక్రమిస్తుంది. బుద్ధినశించి ఎన్నో బాధలనుభవిస్తావు ఇదే నా శాపం" అని అన్నాడు. అలాగే తనని అవహేళన చేసిన సభాసదులందర్నీ శపించబోయాడు.వెంటనే వారంతా పైకి లేచి ఎంతో భయభక్తులతో ఆయనకి నమస్కరించారు. దానితో ఆవిప్రుడు శాంతించాడు.

ఆవిధంగా సుయజ్ఞుడు విప్రశాపం కారణంగా రాజ్యాన్ని కోల్పోయి కుష్ఠువ్యాధి గ్రస్తుడయ్యాడు. తరువాత మహర్షులు, దేవతలు అందరూ కలిసి విప్రుడి దగ్గరకి వెళ్ళి సుయజ్ఞుణ్ణి క్షమించమని వేడుకున్నారు. వారందరి మాటవిని సుయజ్ఞుడు విప్రుడి పాదాలమీద పడి తనతప్పుని మన్నించమని

దీనాతి దీనంగా ప్రార్థించాడు. అప్పుడా విప్రుడు పూర్తిగా శాంతించి సుయజ్ఞుణ్ణి క్షమించి ఆశీర్వదించాడు.

తరువాత సుయజ్ఞుడి కోరిక మేరకు అతడికి దివ్యజ్ఞానాన్ని ఉపదేశించాడు. అలాగే గోలోక వైభవాన్ని, యుగాల ప్రమాణాన్ని, కాలపరిణామాన్ని, మన్వంతరాల్ని, లోకాల్ని గురించి సవివరంగా బోధించాడు. చివరగా రాధాదేవిని ఆరాధించమని, ఆమెని ఆరాధిస్తే శాశ్వతంగా గోలోకంలో నివసించే భాగ్యాన్ని పొందవచ్చునీ ఆమె భక్తసులభ అనీ తెలిపాడు. అలా చెప్పటమే కాకుండా రాధాదేవి పూజావిధానాన్ని, కవచాన్ని స్తోత్రాన్ని కూడా ఉపదేశించాడు. సుయజ్ఞుడు ఆ విప్రుడు చెప్పిన విధంగా రాధాదేవిని భక్తి శ్రద్ధలతో ఆరాధించి చివరికి ఆదేవి అనుగ్రహంతో గోలోకాన్ని చేరుకున్నాడు.

## రాధాదేవి పరిహారస్తుతి

త్వం దేవీ జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ ।
కృష్ణప్రాణాధి దేవీ చ కృష్ణప్రాణాదికా శుభా ॥

కృష్ణప్రేమమయాశక్తిః కృష్ణే సౌభాగ్యరూపిణీ ।
కృష్ణభక్తిప్రదే రాధే నమస్తే మంగళప్రదే ॥

అద్య మే సఫలం జన్మజీవనం సార్థకం మమ ।
పూజితాసి మయా సా చ యా శ్రీకృష్ణేన పూజితా ॥

కృష్ణవక్షసి యా రాధా సర్వసౌభాగ్య సంయుతా ।
రాసే రాసేశ్వరీ రూపా బృందాబృందావనే వనే ॥

కృష్ణప్రియా చ గోలోకే తులసీ కాననే తు యా ।
చంపావతీ కృష్ణసంగే క్రీడా చంపక కాననే ॥

చంద్రావళీ చంద్రవనే శతశృంగే సతీతి చ ।
విరజాదర్పయంత్రీ చ విరజాతటకాననే ॥

పద్మావతీ పద్మవనే కృష్ణా కృష్ణ సరోవరే ।
భద్రా కుంజకుటీరేచ కామ్యావై కామ్యకే వనే ॥

వైకుంఠే చ మహాలక్ష్మీర్వాణీ నారాయణోరసి ।
క్షీరోదే సింధుకన్యా చ మర్త్యే లక్ష్మీః హరిప్రియా ॥

సర్వస్వర్గే స్వర్గలక్ష్మీర్దేవదుఃఖ వినాశినీ ।
సనాతనీ విష్ణుమాయా దుర్గా శంకర వక్షసి ॥

సావిత్రీ వేదమాతా చ కళయా బ్రహ్మవక్షసి ।
కళయా ధర్మపత్నీ త్వం నరనారాయణ ప్రభోః ॥

కళయా తులసీ త్వం చ గంగా భువన పావనీ ।
లోమకూపోద్భవా గోప్యః కలాంశా రోహిణీ రతిః ॥

కళాకళాంశ రూపాచ శతరూపా శచీ దితిః ।
అదితిర్దేవ మాతా చ త్వత్కలాంశా హరిప్రియా ॥

దేవ్యశ్చ మునిపత్న్యశ్చ త్వత్కళాకళయా శుభే ।
కృష్ణభక్తిం కృష్ణదాస్యం దేహి మే కృష్ణపూజితే ॥

ఏవం కృత్వా పరిహారం స్తుత్వా చ కవచం పఠేత్ ।
పురాకృతం స్తోత్రమేతద్భక్తి దాస్యప్రదం శుభం ॥

*(శ్లో॥44-57,అధ్యా-55,ఖం-2)*

## రాధాదేవి కవచం

శ్రీ జగన్మంగళస్యాస్య కవచస్య ప్రజాపతిః ॥
ఋషిశ్ఛందోఽస్య గాయత్రీ దేవీ రాసేశ్వరీ స్వయం ।
శ్రీకృష్ణభక్తి సంప్రాప్తౌ వినియోగః ప్రకీర్తితః ॥
శిష్యా య కృష్ణభక్తాయ బ్రాహ్మణాయ ప్రకాశయేత్ ।
శఠాయ పరశిష్యాయ దత్వా మృత్యుమవాప్నుయాత్ ॥
రాజ్యం దేయం శిరోదేయం న దేయం కవచం ప్రియే ।
కంఠే ధృతమిదం భక్త్యా కృష్ణేన పరమాత్మనా ॥
మయాదృష్టం చ గోలేకే బ్రహ్మణా విష్ణునా పురా ।
ఓం రాధేతి చతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవచ ॥

కృష్ణేనోపాసితో మంత్రః కల్పవృక్షః శిరోఉవతు ।
ఓం హ్రీం రాధికాం జేంతం వహ్నిజాయాంతమేవ చ ॥
కపాలం నేత్రయుగ్మం చ శ్రోత్రయుగ్మం సదా ఉవతు ।
ఓం ఐం హ్రీం శ్రీం రాధికాయై వహ్నిజాయాంతమేవ చ ॥
మస్తకం కేశ సంఘాంశ్చ మంత్రరాజః సదా ఉవతు ।
ఓం రాం రాధాచతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ॥
సర్వసిద్ధి ప్రదః పాతు కపోలం నాసికాం ముఖం ।
క్లీం కృష్ణప్రియాజేంతం కంఠంసాతునమో ఉంతకం ॥
ఓం రాం రాసేశ్వరీం జేంతం స్కంధం పాతునమోంతకం ।
ఓం రాం రాసవిలాసిన్యై స్వాహా పృష్ఠం సదాఉవతు ॥
బృందావన విలాసిన్యై స్వాహా వక్షః సదాఉవతు ।
తులసీ వనవాసిన్యై స్వాహా పాతు నితంబకం ॥
కృష్ణప్రాణాధికాజేంతం స్వాహాంతం ప్రణవాదికం ।
పాదయుగ్మం చ సర్వాంగం సంతతం పాతు సర్వతః ॥
ప్రాచ్యాం రక్షతు సారాధా వహ్నౌ కృష్ణప్రియాఉవతు ।
దక్షే రాసేశ్వరీ పాతు గోపీశా నైఋతేఉవతు ॥
పశ్చిమే నిర్గుణా పాతు వాయవ్యే కృష్ణపూజితా ।
ఉత్తరే సంతతం పాతు మూలప్రకృతి రీశ్వరీ ॥
సర్వేశ్వరీ సదైశాన్యాం పాతుమాం సర్వపూజితా ।
జలేస్థలే చాంతరిక్షే స్వప్నే జాగరణే తథా ॥
మహావిష్ణోశ్చ జననీ సర్వతః పాతు సంతతం ।

*(శ్లో॥28-42,అధ్యా-56, ఖం-2)*

జగన్మంగళాకారమైన ఈ దివ్యకవచాన్ని పూర్వం శ్రీకృష్ణ పరమాత్మ శంకరుడికి చెప్పగా ఆయన తిరిగి దాన్ని పార్వతీదేవికి బోధించాడు. ఎంతోమంది దేవతలు, మునులు, ఋషులు ఈ దివ్యకవచాన్ని పఠించి ధరించి లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. ఈ కవచస్తోత్రాన్ని కోటిసార్లు జపిస్తే సిద్ధిస్తుంది. ఇది సిద్ధించినవాడికి అసాధ్యమైనది ఏదీ వుండదు.

## రాధాదేవి మంత్రం

**ఓం రాధికాయై స్వాహా**

రాధాదేవి దివ్యమంత్రం ఇది. దీనిని కార్తీక పౌర్ణమినాడు జపిస్తే మంచిది. లక్షసార్లు పురశ్చరణ పూర్వకంగా ఈ మంత్ర జపం చేసినవాడికి రాధాదేవి అనుగ్రహం కలుగుతుంది.

## దుర్గాదేవి వృత్తాంతం

శ్రీకృష్ణ పరమాత్మ గోలోకంలో సృష్టిని ప్రారంభించే సమయంలో దుర్గాదేవిని మొదటి సారి పూజించాడు. ఆతరువాత మధుకైటభులనే రాక్షసుల బారిన పడ్డ బ్రహ్మదేవుడు దేవిని పూజించాడు. అలాగే త్రిపురాసురుల సంహార సమయంలో శివుడు, దుర్వాసమహర్షి శాపం వల్ల రాజ్యాన్ని కోల్పోయిన మహేంద్రుడు, దుర్గాదేవిని పూజించి తమతమ కష్టాల్ని పోగొట్టుకున్నారు. ఆ తరువాత ఎందరో ఋషులు, సిద్ధులు, మునులు దుర్గాదేవిని అర్చించటం ప్రారంభించారు.

ఆది ప్రకృతి పూర్ణాంశ స్వరూపిణి అయిన దుర్గాదేవి ఒక కల్పంలో సమస్త ప్రాణుల తేజస్సుతో ఆవిర్భవించగా, దేవతలంతా ఆమెకి తమ అస్త్రాలని, ఆభరణాలని ఇచ్చారు. తరువాత దేవతల ప్రార్ధన విని దుర్మార్గుడైన దుర్గముడనే అసురుణ్ణి వధించి వారందరికీ ఆనందాని చేకూర్చింది దుర్గాదేవి.

మరోకల్పంలో సురథుడు, అనే మహారాజు సమాధి అనేవైశ్యుడు దుర్గాదేవి మట్టిప్రతిమని ఒక నదీతీరంలో స్థాపించి షోడశోపచారాలతో ఆమెని అర్చించారు. దుర్గాదేవి అనుగ్రహంతో సురథమహారాజు కోల్పోయిన తన రాజ్యాన్ని తిరిగి పొంది అరవైవేల సంవత్సరాలు రాజ్యపాలన చేసాడు. అలాగే సమాధి అనే వైశ్యుడు దేవి పూజతో పాటు దుర్గాదేవి మంత్రాన్ని కూడా కఠోర దీక్షతో పుష్కర క్షేత్రానికి వెళ్ళి జపించాడు. తద్వారా దేవి అనుగ్రహంతో అతడు గోలోకాన్ని చేరుకున్నాడు.

# దుర్గాదేవి షోడశనామాలు

అమ్మవారికున్న ఆ అన్నినామాల్లోకీ, అత్యంత మహిమోపేతమైన నామాలు, ముఖ్యమైనవి పదహారున్నాయి. వాటినే శోడశనామాలు అని అంటారు. నాలుగువేదాల్లో ఒకటైన సామవేదంలోని కౌధుమశాఖ అనే దాంట్లో చెప్పబడ్డ ఈ పదహారు నామాలు, దుర్గాదేవి మహాత్మ్యాన్ని, ఆ తల్లిదివ్య స్వరూప స్వభావాన్ని మనకి వివరంగా తెలియచేస్తాయి.

శ్లో॥ దుర్గా నారాయణీశానా విష్ణుమాయా శివా సతీ ।
నిత్యా సత్యా భగవతీ శర్వాణీ సర్వమంగళా ॥
అంబికా వైష్ణవీ శౌరీ పార్వతీ చ సనాతనీ ।
నామాని కౌథుమోక్తాని సర్వేషాం శుభదాని చ ॥

1.ఓం శ్రీదుర్గాయైనమః 2.ఓం శ్రీనారాయణీదేవ్యై నమః 3.ఓం శ్రీ ఈశానా దేవ్యై నమః4.ఓం శ్రీ విష్ణుమాయా దేవ్యై నమః 5.ఓం శ్రీ శివాదేవ్యై నమః 6.ఓం శ్రీ సతీదేవ్యై నమః 7.ఓం శ్రీ నిత్యాదేవ్యై నమః 8.ఓం శ్రీ సత్యా దేవ్యైనమః 9.ఓం శ్రీ భగవతీదేవ్యై నమః 10.ఓం శ్రీ శర్వాణీ దేవ్యై నమః 11.ఓం శ్రీ సర్వమంగళా దేవ్యై నమః 12. ఓం శ్రీ అంబికా దేవ్యై నమః 13.ఓం శ్రీ వైష్ణవీ దేవ్యైనమః 14.ఓం శ్రీగౌరీదేవ్యైనమః 15.ఓం శ్రీ పార్వతీదేవ్యై నమః 16.ఓం శ్రీ సనాతనీ దేవ్యై నమః అనే ఈ పదహారు నామాలతో దుర్గాభవానీ దేవిని పూలతో గానీ, కుంకుమతో గానీ పూజించాలి.

1. **దుర్గా :** దుర్గ అనే శబ్దానికి, రాక్షసుడు, విఘ్నాలు, సంసార బంధాలు, కర్మ, శోకం, నరకం, యమదండన అనే అర్థాలున్నాయి. అలాగే ఆ అనే అక్షరానికి పోగొట్టేది, నాశనంచేసేది అనే అర్థాలున్నాయి. ఇలా ఈ రెండు శబ్దాల్ని కలిపితే దుర్గ + ఆ దుర్గా అయ్యింది. దీనికి రాక్షసుల్ని విఘ్నాల్ని, సంసారబంధాల్ని, నాశనంచేసేసేది, లేకపోగొట్టేది అని అర్థం.
2. **నారాయణీ :** దుర్గాదేవి తేజస్సులో, రూపంలో, గుణంలో నారాయణుడి (విష్ణువు)తో సమానమైనది. అంతేకాదు ఆ నారాయణుడికే శక్తిని ప్రసాదించింది కాబట్టి నారాయణీ అయ్యింది.

3. **ఈశానా :** ఈశాన అంటే సమస్తమైన సిద్ధులు అని, ఆ = అంటే దాత అని అర్థం. ఇక ఈశాన + ఆ ఈశానా అంటే. సమస్తమైన సిద్ధుల్ని ప్రసాదించే దేవి అని అర్థం.

4. **విష్ణుమాయా :** పరమాత్మయైన శ్రీ మహావిష్ణువు ఈ ప్రపంచాన్నంతా సృష్టించదలుచుకొని ముందుగా మాయాదేవిని సృష్టించాడు. ఆ మాయవల్ల లోకమంతా మోహంలో పడిపోయింది. అలా విష్ణువుచేత సృష్టించబడిన మాయకాబట్టి విష్ణుమాయా అని దుర్గాదేవి కీర్తించబడింది.

5. **శివా :** శివ అంటే కళ్యాణప్రదమైనది, శివుడికి, అని, ఆ = అంటే, ఇచ్చేది, ప్రియమైనది అని అర్థం. ఇక శివ + ఆ = శివా అంటే. కళ్యాణప్రదమైన శుభాల్ని ఇచ్చేది, శివుడికి ప్రియమైనది అని అర్థం.

6. **సతీ :** మంచిబుద్ధికి అధిష్టాన దేవత, లేక ప్రతియుగంలో వుండేది, అని, పతివ్రతగా, మంచిగుణగణాలతో వుండేది అని సతీ శబ్దం తెలియచేస్తుంది.

7. **నిత్యా :** ఈ చరాచరసృష్టిలో బ్రహ్మనుంచి గడ్డిపోచవరకూ అన్నీ అశాశ్వతమైనవే. కానీ వీటన్నిటినీ సృష్టించిన దుర్గాదేవి మాత్రం నిత్యమైనది అంటే ఎల్లప్పుడూ వుండేది అని అర్థం.

8. **సత్యా :** ఆది ప్రకృతి స్వరూపిణైన దుర్గాదేవి సత్యస్వరూపిణి

9. **భగవతీ :** భగము అంటే, సిద్ధము, ఐశ్వర్యముఅని అర్థం. భగవతి అంటే ఐశ్వర్యాది సిద్ధి సహితంగా వుండేది అని

10. **శర్వాణీ :** జగన్మాతైన దుర్గాదేవి ఈ ప్రపంచంలో వున్న సమస్త జీవులందరికీ, జన్మ, మృత్యువు మోక్షాల్ని ప్రసాదించేది కాబట్టి శర్వాణి అని పిలవబడుతోంది.

11. **మంగళా :** మంగళ అనే శబ్దానికి, శుభప్రదమైన, మోక్షము అని, ఆ శబ్దానికి దాత అని, ఇచ్చేదని అర్థం. ఈ సర్వసృష్టికీ శుభప్రదమైనవి ఇక సర్వమంగళ అంటే, అందరికీ, ఆనందాన్ని, సంపదని, ప్రసాదించేది అని అర్థం.

**12. అంబా :** అంబా అనే శబ్దానికి తల్లి అనే అర్థం వుంది. అలాగే పూజించబడేది. నమస్కరించబడేది అనే అర్థాలుకూడా వున్నాయి. దీనిని బట్టి దుర్గాదేవి లోకాలన్నిటికీ తల్లిగా, జగన్మాతగా పూజించబడేది, నమస్కరించబడేది అని భావం.

**13. వైష్ణవీ :** విష్ణు స్వరూపిణీ శక్తి అయినందువల్ల దేవి వైష్ణవీ అని పిలవబడుతోంది.

**14. గౌరి :** గౌర అనే శబ్దానికి పీతవర్ణం అని, నిర్మలమైన అని, పరబ్రహ్మ అని అర్థాలున్నాయి. దీనిని బట్టి గౌరి అంటే గౌరవవర్ణం కలిగినదని, నిర్మలమైనదని, సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపిణి అని భావం.

**15. పార్వతి:**పర్వతరాజు(హిమాలయపర్వతం)పుత్రిక కాబట్టి పార్వతి అయ్యింది.

**16. సనాతని :** సనా అంటే అన్నికాలాల్లో అని, తనీ అంటే వ్యాపించివుండేది అని అర్థం. ఇలా సర్వకాలాల్లో ఈ సృష్టి అంతా వ్యాపించి వుండేది సనాతనీ అని పిలువబడుతుంది.

*(బ్రహ్మవైవర్తం శ్లో॥6-27, అధ్యా-57, ఖం-2)*

## శ్రీదుర్గాదేవి స్తోత్రం

బ్రహ్మ వైవర్త మహాపురాణంలో సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడి చేత చేయబడిన ఈ స్తోత్రాన్ని ఎవరైతే శ్రద్ధగా ఒక సంవత్సరం పఠిస్తారో అతని కష్టాలన్నీ దూరమైపోతాయి. మహాదరిద్రుడైనా, మహామూర్ఖుడైనా, అతను ధనవంతుడు, తెలివైనవాడు అవుతాడు. ఒక సంవత్సర కాలం ఈ స్తోత్రాన్ని వింటే అనేక రోగాలనుంచి విముక్తులవ్వవచ్చు. అత్యంత మహిమోపేతమైన ఈ స్తోత్రాన్ని అందరూ నిత్యం పఠించి ఆయురారోగ్య ఐశ్వర్యాలు పొందుదురుగాక.

త్వమేవ సర్వజనీ మూలప్రకృతి రీశ్వరీ ।
త్వమే వాऽద్యా సృష్టివిధౌ స్వేచ్ఛయా త్రిగుణాత్మికా ॥ 1

కార్యార్థే సగుణా త్వం చ వస్తుతో నిర్గుణా స్వయమ్ ।
పరబ్రహ్మస్వరూపా త్వం సత్యా నిత్యా సనాతనీ ॥ 2

తేజ స్స్వరూపా పరమా భక్తానుగ్రహవిగ్రహా ।
సర్వస్వరూపా సర్వేశా సర్వాధారా పరాత్పరా ॥ 3
సర్వబీజస్వరూపా చ సర్వపూజ్యా నిరాశ్రయా ।
సర్వజ్ఞా సర్వతోభద్రా సర్వమఙ్గలమఙ్గలా ॥ 4
సర్వబుద్ధి స్వరూపా చ సర్వశక్తిస్వరూపిణీ ।
సర్వజ్ఞానప్రదా దేవీ సర్వజ్ఞా సర్వభావినీ ॥ 5
త్వం స్వాహా దేవదానే చ పితృదానే స్వధా స్వయమ్ ।
దక్షిణా సర్వదానే చ సర్వశక్తిస్వరూపిణీ ॥ 6
నిద్రా త్వం చ దయా త్వం చ తృష్ణా త్వం చ ఆత్మనః ప్రియా ।
క్షుత్క్షాన్తిః శాన్తి రీశా చ కాన్తిః సృష్టిశ్చ శాశ్వతీ ॥ 7
శ్రద్ధా పుష్టిశ్చ తన్ద్రా చ లజ్జా శోభా ప్రభా తథా ।
సతాం సంపత్స్వరూపా శ్రీ ర్విపత్తి రసతా మిహ ॥ 8
ప్రీతిరూపా పుణ్యవతాం పాపినాం కలహాఙ్కురా ।
శశ్వత్కర్మమయీ శక్తిః సర్వదా సర్వజీవినామ్ ॥ 9
దేవేభ్యః స్వపదోదాత్రీ ధాతు ర్ధాత్రీ కృపామయీ ।
హితాయ సర్వదేవానాం సర్వాసుర వినాశినీ ॥ 10
యోగనిద్రా యోగరూపా యోగదాత్రీ చ యోగినామ్ ।
సిద్ధిస్వరూపా సిద్ధానాం సిద్ధిదా సిద్ధియోగినీ ॥ 11
మాహేశ్వరీ చ బ్రహ్మాణీ విష్ణుమాయా చ వైష్ణవీ ।
భద్రదా భద్రకాలీ చ సర్వలోక భయంకరీ ॥ 12
గ్రామే గ్రామే గ్రామదేవీ గృహదేవీ గృహే గృహే ।
సతాం కీర్తిః ప్రతిష్ఠా చ నిన్దా త్వ మసతాం సదా ॥ 13
మహాయుద్ధే మహామారీ దుష్టసంహారరూపిణీ ।
రక్షాస్వరూపా శిష్టానాం మాతేవ హితకారిణీ ॥ 14
వన్ద్యా పూజ్యా స్తుతా త్వం చ బ్రహ్మాదీనాం చ సర్వదా ।
బ్రాహ్మణ్యరూపా విప్రాణాం తపస్యా చ తపస్వినామ్ ॥ 15

విద్యా విద్యావతాం త్వం చ బుద్ధి ర్బుద్ధిమతాం సతామ్ ।
మేధా స్మృతిస్వరూపా చ ప్రతిభా ప్రతిభావతామ్ ॥ 16

రాజ్ఞాం ప్రతాపరూపా చ విశాం వాణిజ్యరూపిణీ ।
సృష్టౌ సృష్టిస్వరూపా త్వం రక్షారూపా చ పాలనే ॥ 17

తథాఽన్తే త్వం మహామారీ విశ్వే విశ్వేన పూజితే ।
కాలరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ మోహినీ ॥ 18

దురత్యయా మే మాయా త్వం యయా సమ్మోహితం జగత్ ।
యయా ముగ్ధో హి విద్వాంశ్చ మోక్షమార్గం న పశ్యతి ॥ 19

ఇత్యాత్మనా కృతం స్తోత్రం దుర్గాయా దుర్గనాశనమ్ ।
పూజాకాలే పఠేద్యోహి సిద్ధి ర్భవతి వాఞ్ఛితా ॥ 20

వన్ధ్యా చ కాకవన్ధ్యాచ మృతవత్సా చ దుర్భగా ।
శ్రుత్వా స్తోత్రంవర్ష మేకం సుపుత్రం లభతే ధ్రువమ్ ॥ 21

కారాగారే మహాఘోరే యో బద్ధో దృఢబన్ధనే ।
శ్రుత్వా స్తోత్రం మాసమేకం బన్ధనాన్ముచ్యతే ధ్రువమ్ ॥ 22

యక్ష్మగ్రస్తో గలత్కుష్ఠీ మహాశూలీ మహాజ్వరీ ।
శ్రుత్వా స్తోత్రం వర్షమేకం సద్యో రోగాత్ప్రముచ్యతే ॥ 23

పుత్రభేదే ప్రజాభేదే పత్నీభేదే చ దుర్గతః ।
శ్రుత్వా స్తోత్రం మాస మేకం లభతే నాత్ర సంశయః ॥ 24

రాజద్వారే శ్మశానే చ మహారణ్యే రణస్థలే ।
హింస్ర జన్తుసమీపే చ శ్రుత్వా స్తోత్రం ప్రముచ్యతే ॥ 25

గృహదాహే చ దావాగ్నౌ దస్యుసైన్యసమన్వితే ।
స్తోత్రశ్రవణమాత్రేణ లభతే నాత్ర సంశయః ॥ 26

మహాదరిద్రో మూర్ఖశ్చ వర్షం స్తోత్రం పఠేత్తుయః ।
విద్యావాన్ధనవాంశ్చైవ స భవే న్నాత్ర సంశయః ॥ 27

# బ్రహ్మవైవర్త పురాణ ఫలశ్రుతి

పరమపవిత్రమైన ఈ బ్రహ్మపురాణాన్ని సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవుడికి చెప్పగా, ఆయన దాన్ని ధర్ముడికి ప్రవచించాడు. ఆ ధర్ముడు నారాయణమునికి, ఆయన తిరిగి దాన్ని నారదమహర్షికి ప్రబోధించాడు.

ఈ బ్రహ్మవైవర్తపురాణం దుర్లభమైనది. కర్మలు చేసేవారికి, కర్మలకి ఆ పరబ్రహ్మే సాక్షి అని, జీవులందరిలో ఆ శ్రీకృష్ణ పరబ్రహ్మ అంతరాత్మగా వున్నాడని ఈ పురాణం ప్రబోధిస్తుంది.

తీర్థాలలో పుష్కరతీర్థం, పురాలలో కాశీపురం, దేశాలలో భరతవర్షం, పర్వతాలలో మేరుపర్వతం, పుష్పాలలో పారిజాతం, పత్రాలలో తులసీవ్రతం, వ్రతాలలో ఏకాదశీవ్రతం, వృక్షాలలో కల్పవృక్షం, దేవతలలో శ్రీకృష్ణపరమాత్మ, యోగుల్లో గణేశ్వరుడు, సిద్ధులలో కపిలముని, తేజస్సులలో సూర్యుడు, రాజులలో రామచంద్రుడు, ఎంతగొప్ప వారో, ఎంత గొప్పవో అలాగే పురాణాలలో బ్రహ్మవైవర్త పురాణం అన్నిటికన్నా గొప్పది.

ఈ దివ్య పురాణాన్ని విన్నా పఠించినా లక్షగోవుల్ని దానం చేసిన ఫలం లభిస్తుంది. దివ్యమైన ఈ పురాణ శ్రవణం వల్ల సకల పాపాలు హరిస్తాయి. శ్రీకృష్ణ పరమాత్మ దివ్యానుగ్రహంతో విన్నవారు చదివినవారు దుర్లభమైన గోలోకాన్ని చేరుకుంటారు.

## స్వస్తి

**సర్వేజనాః సుఖినోభవన్తు**





